నరసింహారావు, చోడవరపు

హిందూదేశచరిత్రము

విజయనగరము, 1924

Record no. 764

నరసింహారావు, చోడవరపు.
హిందూదేశచరిత్రము : హిందూ మహమ్మదీయ మహాయుగములు / చోడవరపు నరసింహారావుచే రచియింపబడినది.- విజయనగరము : వేదవ్యాస ముద్రాక్షరశాల, 1924.
2, 183 p. ;18 cm.
Record no. 764

Narasiṃhārāvu, Cōḍavarapu.
Hindūdēśacaritramu : Hindū Mahammadīya mahāyugamulu / Cōḍavarapu Narasiṃhārāvucē raciyimpabaḍinadi.- Vijayanagaramu : Vēdavyāsa Mudrākṣaraśāla, 1924.
2, 183 p. ;18 cm.
Record no. 764

# హిందూదేశచరిత్రము

## హిందూ మహమ్మదీయ మహాయుగములు.

శ్రీవిజయనగర మహారాజావారి కాలేజీలో ప్రధాన సహాయ
చారిత్రోపాధ్యాయుఁడగు
చోడవరపు నరసింహారావు బి.ఏ., ఎల్.టి. చే
రచియింపఁబడి






విజయనగరమున
శ్రీవేదవ్యాస ముద్రాలయమందు ముద్రింపఁబడెను.
1924

# పీఠిక

పాఠశాలలో నాలవఫారమునకు రెండుసంవత్సరములనుండి హిందూదేశచరిత్ర తెలుఁగున గఱపుచుండుటచేతను, మదరాసు యూనివర్సిటీ మెట్రిక్యులేషను పరీక్షకేర్పాటయిన సెలబస్సుననుసరించి తెలుఁగున పుస్తకమేదియు లేనందునను నాకొఱతదీర్చుటకు నీపుస్తకము వ్రాయఁగడంగితిని. ఇందు వ్యాకరణసూత్రముల నంతగాఁ బాటింపకపోయినను గ్రామ్యపదముల సాధారణముగా నుపయోగింపలేదు. తెలుఁగుపుస్తకములఁ జదువనలవాటుపడిన చెవులకుఁ గటువుగా నుండకుండ బాలురకు సులువుగాబోధపడునట్లు వ్రాయుట నాయుద్దేశము. నాలవఫారముతోనే హిందూదేశచరిత్రచదువుట సమాప్తిగాన హిందూయుగమున హిందూబాలురకుఁ దెలియనలసిన విషయముల నీచిన్నపొత్తమున వీలగుసంతవఱకు విపులముగా వ్రాసితిని. ఎవ్వియైన దోషములుగాని లోపములుగాని యున్న యెడల వానిని దెలియఁబరచిన రెండవముద్రణమున సవరించుకొందును. కాన సోదరోపాధ్యాయులు నాయీప్రయత్నమును సోదరభావమునఁ దిలకించి నాకు, ప్రోత్సాహముగలిగింప వేడుచున్నాను.

గ్రంథకర్త.

# విషయసూచిక.

పటములు.



# హిందూమహాయుగము

## 1.వ అధ్యాయము.

### హిందూదేశచారిత్రికభూగోళము.

మనము నివసించు హిందూదేశమును దుష్యంతునికుమారుడగు భరతుడు రాజ్యముజేయుటచే హిందువులవలన నది భరతవర్షమని పిలువబడుచుండెను. కాని పరదేశీయులగు పారశీకులు మొదట సింధునదిని జూచుటచే దానికి హిందూదేశమని పేరిడిరి. అదియె బ్రిటిషురాజ్యకాలమున 'ఇండియా' అయ్యెను. ఏ దేశపు చరిత్రనైనను సహేతుకముగ దెలుసుకొనవలెనన్న దాని భూగోళముపూర్తిగా దెలియవలెను. కావున హిందూదేశచరిత్ర చదువుటకుబూర్వము దాని నైసర్గికస్వరూపమును శీతోష్ణస్థితియు నెరుంగుట ముఖ్యము.

**హిందూదేశ నైసర్గిక స్వరూపము**

హిందూదేశమున కుత్తరమున హిమాలయపర్వత పంక్తికలదు. ఇది రెండువరుసలుగలిగి ప్రపంచమందెల్లనెత్తైనదై యున్నది. దీనికి కనుమలుగలవుగాని మిక్కిలి యెత్తుననుండుటచే రాకపోకలకు నుపయోగములుగావు. దాని పశ్చిమ తూర్పుకొనలనుండి దక్షిణమునకు పర్వతములు వ్యాపించియున్నవి. వీటిలోగూడ కనుమలు గలవు. అందుముఖ్యమైనవి పశ్చిమోత్తరపర్వతములందున్న ఖైబరు, బొలాను కనుములు. మిగిలిన

భాగము సముద్రముచే జుట్టుకొనబడియున్నది. వింధ్యపర్వతములు, తపతీనర్మదానదులు, వింధ్యాటవియు నుత్తరభాగమును దక్షిణముననుండి వేరుజేయుచున్నవి. ఈదేశమును నైదుభాగములుగా నైసర్గికస్వరూపమునుబట్టి విభజింపవచ్చును. ఉత్తరమున గంగానది దానియుపనదులు ప్రవహించుపల్లపునేల మొదటిది. సింధు దానియుపనదులుప్రవహించు పశ్చిమదేశము రెండవది. దక్కనుపీఠభూమిమూడవది. దక్షిణయిండియా పీఠభూమి నాల్గవది. దక్షిణమున సముద్రతీరభాగములైదవవి.

**దీనిఫలితములు.**

ఉత్తరముననున్న హిమాలయములు పెట్టనికోట. అందుచే నుత్తరమునుండి శత్రువులిండియాకు రాలేకుండిరి. సముద్రయాన మాకాలమున నారంభదశలోనుండుటచే సముద్రముగూడ హిందూదేశమును శత్రువులబారినుండి రక్షింపసమర్థతగలిగియుండెను. కాని హిందూదేశపుసరిహద్దులలో పశ్చిమోత్తర, తూర్పోత్తరపర్వతములలోని కనుమలు శత్రువులకేగాక వర్తకమునకుగూడ నుపయోగించుచుండెను. తూర్పుకనుమలడవులచే నిండియుండుటవలన శత్రువులకు దుర్గమంబులయ్యెను. చరిత్రలేనికాలమున నెవరోయొకరిద్దరుతప్ప యాదారిని నెవ్వరురాలేదు. పశ్చిమోత్తరకనుమలద్వారా యనేకులువచ్చియుండిరి. దీనికి నింకొక కారణముగూడగలదు. ఆశియా తూర్పునకువెళ్ళినకొలది ఫలవంతమగుటచే ప్రజలుపడమరనుండి తూర్పునకేగాని తూర్పుననుండిపడమరకు సారవంతముగు స్థలములనివాస మేర్పరచుకొనుటకు బోయియుండలేదు. అందుచే నిండియాకువచ్చుటకుపశ్చిమోత్తరకనుములే మిగులనుపయోగకారిగా నుండెను.



వింధ్యాదులచే నుత్తరమునుండి వేరుచేయబడుటవలన నుత్తరమునకుగలిగిన సంక్షోభములను దక్షిణముపొందలేదు. ఉత్తరమున బ్రవేశించిన జాలకాలమునకుగాని పరదేశీయులు దక్షిణమునకు రాలేదు. పర్వతములు పొట్టివగుటచేతను, నదులు దాటుటకనుకూలములగుటచేతను నుత్తరదేశపురాజులు దక్షిణదేశమును, దక్షిణదేశపురాజులుత్తరదేశమును నాక్రమించుకొనుటకు నవకాశము గలిగెను. అదిగాక నుభయభాగముల నాగరికతలకు సంతవిస్తారభేదములేదు. పశ్చిమఘాటులలో దారులులేకుండుటచే పశ్చిమతీరదేశ మితరభాగములవల్ల లాభముగాని నష్టముగాని బొందలేదు. వారినాగరికత వేరు. ఇతరదేశీయులు పశ్చిమతీరమున మొదటజేరినను తూర్పుతీరముననే తొలుతరాజ్యస్థాపనము జేయగలిగిరి. సముద్రతీరము తిన్నగా వంకరటింకర లేకుండుటచేతనున్ను, తీరమువద్ద సముద్రము లోతులేకుండుటచేతనున్ను హిందూదేశపుప్రజలు సముద్రయానమున విశేషప్రజ్ఞ సంపాదింపలేకుండిరి. సర్వశాస్త్రములయందును కళలయందును బ్రఖ్యాతివహించిన హిందూదేశమీవిషయమున పశ్చిమదేశములకు దీసిపోవుటకిదియే హేతువు.

**శీతోష్ణస్థితి.**

హిందూదేశము భూమధ్యరేఖకు దగ్గరగానుండుటచే నుష్ణమిచ్చట యధికము. వర్షము దేశములో చాలభాగము బాగుగాగురియును. అందుచే దేశము మిక్కిలిఫలవంతమైనదై దేశీయులు కష్టపడనవసరములేకుండెను. దీనివలన జనులు సోమరులై యభివృద్ధినొందజాల

కుండిరి. సంతుష్టిచే జనులుపాడయిరి. కాని మతవిషయము లో నెక్కువకృషిచేసిరి. దేశమందున్నమధిక్యమగుటచే ప్రజల జవసత్వములు నానాటికిక్షీణించి దేశము పరరాజులపాలయినది. ఇతర దేశములనుండి వచ్చినవారుగూడ గొంతకాలమునకు బలహీనులగుచున్నారు. దేశపుప్రస్తుతస్థితికి యిదియొక ముఖ్య కారణము.

హిందూదేశ మాశియాదక్షిణభాగమునకు మధ్యనుండుటచే తూర్పుపశ్చిమములకుజరుగు వర్తకవ్యాపారములలో ముఖ్యస్థానమును బొందగలిగెను. తూర్పుదేశములతో వర్తకము చేయువారందరును ముఖ్యముగా సముద్రవర్తకముజేయువారిండియాలో స్థానముల సంపాదించిరి. అందుచే హిందూదేశము పూర్వమునుండియు ప్రపంచప్రఖ్యాతి నొందియుండెను.



## 2-వ అధ్యాయము.

### ఆర్యులకు బూర్వులు.

హిందూదేశచరిత్ర యార్యాక్రమణముతో నారంభమగును. కాని వారికిపూర్వమందు దేశమున నెవరుండిరో, వారినాగరికత యెట్టిదో, వారేమైరో దెలిసికొనుట ముఖ్యము.

మూడుజాతుల మిశ్రమము.

ఈకాలపుప్రజలలో కకేషియను, మంగోలియను, నీగ్రోజాతుల ముఖ్యచిహ్నములు కనిపించుచుండుటచే నీజాతులవారందరీదేశమునను డిరాయన్న ప్రశ్నజనించుచున్నది. సముద్రములచేతను పర్వతపంక్తులచేతను రక్షింపబడుచున్న యీదేశమునకు వారెట్లువచ్చిరి? కొందరుశాస్త్రజ్ఞులు హిందూదేశపుటాకృతి యిప్పుడున్నట్లే యెల్లప్పుడు లేదని చెప్పుచున్నారు. హిమాలయపర్వతములు సముద్రమున మునిగియుండెను. ఆరవిల్లి పర్వతములు మిక్కిలి యెత్తుగానుండెను. వాటిపశ్చిమమునను నుత్తరమునసముద్రముండెను. ఆఫ్రికాదేశముతోను నాస్ట్రేలియాదేశముతోను హిందూదేశముకలసియుండెను. దేశమంతయు నగ్నిపర్వతమయమై యుండుటచే భూకంపములు తరుచుగావచ్చుచుండెను. అట్టిభూకంపములచే దేశపుటాకృతి మారెను. కనుక యాఫ్రికానుండినీగ్రోలున్ను ఉత్తరమునుండి మంగోలియనులున్ను వచ్చియుండవచ్చును.



కాని యార్యులకు బూర్వులలో ద్రావిడులుముఖ్యులు.

ద్రావిడులు.

వారేమార్గమున హిందూదేశమునకునచ్చిరో నిశ్చయముగ దెలియదు. తూర్పోత్తర కనుమల ద్వారా వచ్చియుండవచ్చును. ఎట్లువచ్చినను వారు దేశమంతయు వ్యాపించియుండిరి. వారినిగురించి వ్రాతయాధారము లేవియులేవు గాని, ద్రావిడభాషలని పిలువబడు భాషలయందున్న సంస్కృతేతరపదములబట్టియు, మతమునందున్న కొన్ని యాచారములబట్టియు భూమినుండితీయబడిన గొన్నియుపకరణములబట్టియు వారనాగరికులుగారని దెలుసుకొనవచ్చును.

వారిముఖ్యచిహ్నములు, నాగరికత.

ద్రావిడులు నల్లగాపొట్టిగానల్లనికండ్లును చప్పిముక్కులును దట్టమైన తలకట్టును గలిగియుండిరి. వారుమొదట నున్ననయిన రాతి

ఱాయుధములను నుపయోగించినను హిందూదేశమునకు వచ్చిన కొంతకాలమునకు ఇనుముతో నాయుధములజేయుటకారంభించిరి. క్రమముగాదేశమున దొరికిన లోహములవాడుట నేర్చిరి. వ్యవసాయము, రంగులువేయుట మొదలగుసాధారణ పరిశ్రమలయందు నేర్పునుగలిగియున్నట్లు దెలియుచున్నది. అక్కడక్కడ పట్టణములున్నను మొత్తముమీద గ్రామములలోనేనివసించుచు చిన్నసంస్థానాధిపతుల పరిపాలనములో నుండిరి. గ్రామపాలకులు రాజుచేనేర్పరుపబడుట యాచారమైనను వంశపారంపర్యపు సాక్కుగలదు. పంటలో గొంతభాగము రాజునకు ప్రతిరైతివ్వవలెను గాన యీలెక్కల నుంచుటకు కరణములుండిరి. వారికి యుద్ధమనిన ప్రియమగుటచే నొకరాజింకొకరాజుతో బోట్లాడుట బహుతరుచుగానుండెను. నావలు పడవలు చిన్నయోడలు జేయుటవారికి దెలియును. ఒకేభగవంతునియందు నమ్మకమున్నను వారు దయ్యములను భూతములను నరబలులచేగూడ దృప్తినొందించుచుండిరి. చెట్లను పుట్టలను పూజించు నాచారముండెను. సర్పపూజ వారినుండియే మనకువచ్చినది. కాని వారికిమతగురువులు లేరు. వారు నూరువరకు లెక్కపెట్టగలిగియుండిరి. చంద్రునిబట్టివారికాలమాన మేర్పాటయ్యెను. వీరు పశ్చిమముననుండిన దేశములతో వర్తకము జేయుచుండిరి. సింధు, హైదరబాదు, బ్రోచి, సూరతు వారికాలమున వేరునామములుగలిగి ముఖ్యరేవుపట్టణములుగా నుండెను.

ఇండియానంతను వీరాక్రమించియుండిరి. ఆర్యులుత్తర



ద్రావిడసంతతివారు.

హిందూస్థానమునుండి వీరిని తరిమివేసిగాని చంపివేసిగాని యాదేశమున ద్రావిడులులేకుండజేసిరి. దక్షిణమునకువచ్చిన యార్యులు కొద్దిమందియగుటచే నచ్చటనున్న ద్రావిడులతో సంబంధములుగలుపుకొనిరి. అందుచే ద్రావిడచిహ్నములు దక్షిణమున వచ్చిన కొలదిప్రజలలో హెచ్చుగాగనిపించును. కొండప్రదేశములకుబోయిన ద్రావిడులలోమాత్రము వర్ణసంకరము లేకుండెను. బంగాళా రాజధానిలోని ఛోటియా నాగపురములోనున్న సంతాలులు, సాత్పురాపర్వతపంక్తిదరిని నివసించు గాండ్లును, ఒరిస్సాదేశమందలి ఖాండ్లును, మలబారులోని పనియనులును వారిసంతతివారే.



## 3-వ అధ్యాయము.

### ఆర్యులు.

ఆర్యులనగా వ్యవసాయదారులనియు గొప్పవారనియు నర్థము. గొర్రెలమందలబెంచుటచే జీవనముచేయు నితరజాతులనుండి వేరుచేయుటకు వీరినియార్యులని పిలిచియుండిరి. ఈజాతివారైరోపా యాశియాలలో నివాసమేర్పరచుకొనుటచే నిండోయూరపియనులని యిటుతరువాత బిలువబడిరి. పరిష్యా హిందూదేశములలో నివాసమేర్పరచుకొనినవారే యార్యులమని చెప్పుకొనిరి.

ఈయార్యులితరదేశమునకుబోకపూర్వ మెచ్చటనుండి

ఆర్యులజన్మస్థానము, వారివ్యాపనం.

గో నిశ్చయముగ దెలియదు. పలువురుపలు విధములుగా జెప్పుచున్నారు. కొందరుత్తరసముద్రతీరమనియు, మరికొందరాశియా మధ్యపీఠభూమియనియు జెప్పెదరు. కానియనేకులువారిస్థానము కాకసస్సు, యూరల్ పర్వతముల ప్రాంతమందలిబయలనియు, నాభూములనిస్సారములగుటచేత పశువులకుగడ్డియు ద్రాగుటకునీరునులేకను జనవృద్ధియగుటచేతను నలువ్రక్కలకుబోయిరని చెప్పియున్నారు. కొందరచటనుండిపశ్చిమముగావెళ్ళి యైరోపాయందలి దేశములను నాక్రమించిరి. గ్రీకులు, ఇటాలియనులు, ఫ్రెంచి బ్రిటిషు జర్మనీమున్నగు దేశస్థులు వీరిసంతతివారే. రెండవతెగ కాస్పియన్ సముద్రముదాటిమధ్యయాశియాలో గొంతకాలముండి యాస్థలము తమకనుకూలముగాలేనందున గొందరాక్ససునదిద్వారా దక్షిణమునకువచ్చి యాఫగనిస్థానమువద్ద రెండుతెగలయి యొక తెగవారుపరిష్యాకున్ను రెండవతెగవారు కాబూలుమీదుగా హిందూదేశమునకునువచ్చి పంజాబులో వాసస్థానమేర్పరచుకొనిరి. మరికొంతకాలమునకు మధ్యయాశియానుండియింకొక తెగబయలుదేరి గిల్గాటు చిత్రాలులద్వారా హిందూదేశము ప్రవేశించెను. వీరువచ్చినమార్గము శిలావృతమగుటచేతను నింకను నితరకష్టములతో నిండినదియగుటచేతను నాలుబిడ్డలుదారిలోనశించియో లేక వారినిదీసికొనిరాకయో యొంటరిగావచ్చియుండిరి. వీరు ద్రావిడస్త్రీలను వివాహమాడి మొదటవచ్చినవారితో యుద్ధముజేసి వారినోడించి దేశమును నాక్రమించుకొనిరి.



ఆర్యుల పూర్వస్థితి.

ఐరోపా యాశియాఖండములలో నార్యసంతతివారి భాషలన్నిటిలో సామాన్యముగానున్న మాటలను బట్టి హిందూదేశమునకు రాకపూర్వ మార్యుల యొక్క నాగరికతయెట్టిదో తెలియగలదు. ఇదిగాక వేదములలో ఋగ్వేదమునుండిగూడ వీరినిగురించి తెలిసికొనవచ్చును. వారువ్యవసాయదారులనియు, గొఱ్ఱెలను పశువులను పెంచుచుండిరనియు దెలియుచున్నది. ఇండ్లుకట్టుట, బండ్లు పడవలుజేయుట, యినుముతో నాయుధముల బాత్రల జేయుట, బొచ్చుతోను నారతోనువస్త్రములునేయుట వారికి దెలియును. వారిది చాంద్రమానము.

హిందూదేశమందు వారి మొదటవాసస్థానము.

సింధునది, దానియుపనదులు, సరస్వతీనది వీటియొడ్డున వారు నివాసస్థానము నేర్పరుచుకొనిరి. సట్లెజ్ నది వారితూర్పుటెల్ల. అయినను వారిలో శూరులీయెల్లల దాటి సంస్థానముల స్థాపించిరి. ఇచ్చటనున్న కాలమున వీరియాచారములలో గొన్నిమార్పులు జరిగినవి.

ఇచ్చట వీరియాచారవ్యవహారములు.

వారిండ్లుకట్టగలరని యిదివరకేచెప్పబడియున్నది. హిందూదేశమున వారిండ్లువిశాలముగను దృఢముగనునుండెను. కొన్నికుటుంబములొకచోటజేరి యొకగ్రామమునేర్పాటుజేసికొని యడవిజంతువులనుండియు, దొంగలనుండియు, శత్రువులనుండియు గాపాడుకొనుటకుగాను నొకముండ్లకంచను గ్రామముచుట్టు వేయుచుండిరి. వారందరొకరాజుక్రిందగాక వేరువేరుచిన్న

సంస్థానాధిపతులక్రింద నుండిరి.

మతము.

ఆర్యులనుగూర్చి మనకుదెలిసినవృత్తాంతము ఋగ్వేదమునుండి గ్రహింపబడినది. ఇది వారిప్రార్థనల సంపుటము. ఇతరదేశీయులకువలె వీరికినిజొబ్బిలి పాటకులవంటి భట్లుకలరు. వీరులజయములనుగూర్చిన పాటలనుజేసి వారుపాడెడివారు. వీరేదైవప్రార్థనలు పాటరూపమున జేయుచుండిరి. ఈపాటలు తండ్రికొడుకునకు నేర్పుటసాంప్రదాయము. అందుచే నవిచావకుండమిగిలినవి. హిందూదేశమునకువచ్చినతరువాత వాటినన్నిటిని నెవరోసంపుటము జేసిరి.

ఆర్యులు హిందూదేశమునకు రాకపూర్వమునను వచ్చినతరువాత కొంతకాలమువరకును ప్రపంచమందు నుత్కృష్టవస్తువులను నద్భుతసంభవములను బూజించుచుండెడివారు. సూర్యుడు, చంద్రుడు, మరుత్తులు, అగ్ని, ఇంద్రుడు, వాయువు, యముడు వీరిముఖ్యదైవములు. ఈభగవంతులదయనుసంపాదించుటకు మంత్రములనుచ్చరించుట, పాటలుపాడుట బలులనిచ్చుట జేసెడివారు. పుణ్యముచేసినవారు మృత్యుదేవతయైనయమునివద్ద నివసించుచు సౌఖ్యమనుభవించుచు తమ సంతతివారిలో సన్మార్గులకు సహాయముజేయుచు దుర్మార్గుల శిక్షించుచు నుందురనియు, పాపులెడతెగనికష్టముల యధోలోకమునబడి యనుభవింతురనియు వారినమ్మకము. క్రమముగా వారు వృద్ధిజెందినకొలది వేదముకూడ వృద్ధినొందినది. దీనిలోని కొన్నిపాటలుతీసికొని క్రొత్తవిజేర్చి మూడుక్రొత్త వేదములుగా సృష్టించిరి. అవి సామవేదము, యజుర్వేదము,



అథర్వణవేదము. పిదప కొంతకాలమునకు వేదములంగములనియు నుపాంగములనియు రెండుభాగములుగ భాగింపబడినవి. ఋగ్వేదముపెరిగి మంత్రములనియు, బ్రాహ్మణములనియు, నుపనిషత్తులనియు మూడుభాగములయినది.

స్వతహా క్రమవృద్ధిచేతను, ద్రావిడులతో సంబంధముల చేతను, తమమతమునశింపకుండ నిలుపుకొను నుద్దేశముచేతను మతములో వారనేకమార్పు లవసరమైనప్పుడు చేయుచుండిరి.



## 4-వ అధ్యాయము.

## ఆర్యుల మతసాంఘికాచారములు.

ఈయాచారములలో నప్పుడప్పుడుజరిగినమార్పులనుబట్టి నాలుగంతరములుగ వీటినిగూర్చి విచారించవలసియున్నది. అవియెవ్వియన ఋగ్వేదయుగము, పురాణయుగము, ప్రాతహిందూయుగము, క్రొత్తహిందూయుగము.

ఋగ్వేదయుగము. I

ఆర్యులు హిందూదేశమునకు రాకపూర్వము వారియాచారములను వ్యవహారములనుగూర్చి జెప్పబడినదిగాన వాటిలోమార్పులే యిచ్చటజెప్పబడును.

మతము.

ఇదివరకువలెనే సూర్యుడు, రుద్రుడు, మరుత్తులు, అగ్ని వాయువు భగవంతులుగా బరిగణింపబడుచుండిరి. వీరినిగాక విష్ణుని, శివుని, యముని, దేవవైద్యు

లగు నశ్వినులనుగూడ వీరు ప్రార్థించుచుండిరి. కానిపూర్వమునతె గాక నొకేసమయమందు నొకేభగవంతుని ప్రార్థించి వానికేయన్ని దేవులశక్తుల నారోపించిరి. ఇందుచే భగవంతుడొకడేయన్న సమ్మకము వారికి క్రమముగాగలిగెను. క్రమముగా శివవిష్ణులు ముఖ్యభగవంతులుగా బరిగణింపబడిరి. విగ్రహారాధనగాని దేవాలయములుగాని యీకాలమున లేవు.

**సాంఘికాచారములు.**

తండ్రి యింటియజమాని గురువును. భార్యాభర్తలు దైవకార్యములను గలిసి చేయుచుండిరి. స్త్రీలను గౌరవముగాజూచుటయు వారినిజదివించుటయు గలదు. కన్యలు భర్తలనెన్నుకొనునాచారమును, విధవలగుస్త్రీలు తిరిగివివాహము చేసికొనుటయు నుండెను. మృతులైనవారిని దహనముచేయుట మామూలుగాని, ఖననముగూడ నుండెను. పాలు, నెయ్యి, ధాన్యములు వారి ముఖ్యాహారములు. మాంసమప్పుడప్పుడు తినుటగలదు. త్రాగుటకు నుపయోగించువస్తువులు సోమరసము, సుర. రెండవది నిషేధింపబడెను. సంగీతము వారికిమిక్కిలి యిష్టము. చిన్న పడవలలో నదులుదాటెడివారు. ధర్మముచేయుట మనుజుని విధిగానెంచబడెను.

**ఆర్థికస్థితి.**

పశురక్షణ, వ్యవసాయము ముఖ్యపరిశ్రమలు. వారికి నాణెములు లేవు. వర్తకము వస్తువులమార్పుతో జేసుకొనుచుండిరి. వస్తువులవిలువ యిన్నియావులని నిర్ణయించుచుండిరి.



పురాణములనుండి యీకాలపుటాచారముల గ్రహింపవచ్చును. గాన దీనికి పురాణయుగమనినామమిడిరి. పురాణములనగా రామాయణ మహాభారతములు. వీటియందు జెప్పబడినకథలందరకు దెలిసినవే గాన నిచ్చటవివరించలేము. కానివాటిలో జరిత్రాత్మకమైననిజమేమని మనముదెలుసుకొనవలసియున్నది. ఈకథలుపూర్తిగా నిజములుగావని పురాణమనప్రస్తుతార్థమునుబట్టి దెలియుచున్నది. పురాణమనగా యబద్ధపుసమాచారమని యీపదమును జనులిప్పుడు నీచార్థమున వాడుచున్నారు.

**పురాణయుగము. II**

**రామాయణము.**

రామాయణ మార్యవీరులు దక్షిణహిందూస్థానమున రాజ్యము సంపాదించుకొనుటకు బ్రయత్నించినకథను దెలుపుచున్నది. రాముడార్యరాజు. సీతభూపుత్రిగాన దేశము. రావణుడు బలవంతుడగు ననార్యరాజు. సీతచెరను విడిపించుటయనగా దేశమును వానివద్దనుండి లాగికొనుట. సుగ్రీవాదులితర యనార్యజాతివారు. వారు రావణునియందు నసూయచేతనో వానిక్రౌర్యమును భరించలేకనో రామునికి సహాయము చేసియుందురు.

**మహాభారతము.**

మహాభారతము కురుపాంచాలయుద్ధమని పూర్వకాలమున బిలువబడుచుండెడిది. క్రమముగా కురుపాండవయుద్ధముక్రింద బుస్తకముల వ్రాయబడెను. ఇది మొదటవచ్చిన యార్యులకును తరువాతవచ్చిన యార్యులకును జరిగినయుద్ధ మనవచ్చును.

ప్రస్తుతకథయందు ముఖ్యులు పాండవులు. కాని వీరు

ముఖ్యులగు పాంచాలురకు సహాయముచేసిన యొకయనార్య జాతివారు. ఏలయన నొక స్త్రీ పలువుర భర్తల వివాహముచేసికొనుట యార్యాచారముగాక యనార్యాచారమైయున్నది. ఈ కథలు కవులచేతులలోను, బ్రాహ్మణుల చేతులలోనుబడి వృద్ధి నొంది మతగ్రంథములై పూజనీయమైనవి. భారతమున ముఖ్యపురుషులలో నొకడు కృష్ణుడు. ఇతడు భగవదంశసంభూతుడుగా బరిగణింపబడుచున్నాడు. కాని యితడనార్యుడో లేక యనార్యులలో గలిసిపోయిన యార్య తెగవాడో గావలయును. మిగుల మేధాశాలియు పరాక్రమవంతుడు నగు రాజైయుండవచ్చును. ఇతడార్యుడు కాడని చెప్పుటకు గొన్ని హేతువులుగలవు. ఇతడు నల్లనివాడు. ఆర్యులు తెల్లనివారు. గొల్లలకధిపతి. అనార్యుల ముఖ్యపరిశ్రమ గొల్లవృత్తి. కృష్ణుడు మాయలవాడు. ఆర్యులు సత్యప్రియులు. కృష్ణునిపట్టణము సముద్రమున నతనిచే నిర్మింపబడినట్లు జెప్పబడినది. ఆర్యులచేతనో ననార్యులచేతనో దరుమబడి యీ తెగవారు యిచ్చటవాసస్థానము నేర్పాటుచేసుకొనియుందురు. దీనికి నుదాహరణము కంసవధ, జరాసంధునితో బోరుట మొదలగునవి. రాక్షసుడగు కంసుడితని మేనమామ. ఆర్యు లనార్యులను రాక్షసులుగ వర్ణించిరి. అందుచే గృష్ణునిగూడ యనార్యుడని జెప్పుటకు నిదియింకొక యాధారము. స్వజాతివారగు నితర యనార్యులతో బోరాడినందున యితడార్యులతోజేరి వారికి యుద్ధమున సహాయముజేసియుండును. అదిగాక రెండవసారివచ్చిన యార్యు లనార్యులతో సంబంధముల జేసికొనిరి. కాన



కృష్ణునివంశ మార్యులతో బాంధవ్యము గలవగుటచే నాతడు భారతయుద్ధమున జేరి యుండవచ్చును. ఏది యెట్లున్నను నితడొక మతాచార్యుడై మతోద్ధారణమొనరించెనని చెప్పక తప్పదు. అందుచేనిప్పటికిని నితడు భగవంతుడుగా బూజింపబడుచున్నాడు. ఇతనిచే జెప్పబడినవియన్న భగవద్గీతలు హిందువులకేగాక యితర దేశీయులకుగూడ మార్గోపదేశకములైనవి.

**ఆచారములు.**

ఆర్యులు ప్రాతఃస్నానముజేసి శుచిగానుండెడివారు. వారు సత్యప్రియులును, యదార్థవాదులును. ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱములు, గాడిదెలు బరువులుమోయుటకేగాక బండ్లులాగుటకుగూడ నుపయోగపడెను. ఎద్దులను ధాన్యము మోయుటకును దున్నుటకునుదప్ప నింకొక పనికి నుపయోగించెడివారు కారు. స్త్రీలకు స్వాతంత్ర్యముండెను. చదువుకొనుట, సంగీతనృత్యముల నేర్చుకొనుటకూడ గలదు. పురుషులు ధోవతి యుత్తరీయము తలగుడ్డ ధరించిరి. స్త్రీలకును రెండుబట్టలుండెనుగాని యుత్తరీయము మేలిముసుగునకును పైశరీరముచుట్టును గప్పుకొనుటకును బనికివచ్చెను. బట్టలు సాధారణముగా నూలుతో నేయుట వాడుకగాని, పట్టు, ఉన్నివస్త్రములుగూడ గలవు. కాలికి కర్రవో తోలువో పాదరక్షల వారుపయోగించిరి. అనేకభార్యల వివాహమాడు నాచారముండెను. రజస్వలానంతరవివాహములు విధవావివాహములునుగలవు. బాల్యవివాహములు లేవు. మాంసభక్షణక్రమముగా దగ్గిపోయెను. ఆహారమునకు జంపదగినజంతువులు నిర్ణయింపబడెను. పశువులజంపుట పాపముగ బరిగణింపబడెను.

అహింస ప్రాముఖ్యతవహించెను. వరియన్నముదినుట యీ యుగమందారంభమయ్యెను.

పురాణయుగముననే వర్ణవిభజన మారంభమయినను

ప్రాకహిందూయుగము
III
వర్ణపద్ధతి.

నీకాలమునాటికి నదిపూర్తియయ్యెను. జనవృద్ధియైనకొలది క్రొత్తదేశముల జయించుటవసరమగుటచే గొందరు మానములకొలది యుద్ధములజేయుటయందే కాలయాపన జేయవలసివచ్చెను. అందుచే భగవద్భక్తులగు నార్యులు భగవత్కార్యములను జరుపుటకు దమలోగొందర నియమించిరి. యుద్ధములజేయుటకు గొందరును, వ్యవసాయముజేయుటకు గొందరును నేర్పాటైరి. అనార్యులతో సంబంధములు జేసికొనుటచే నార్యరక్తము సంకరముగాకుండగాపాడుటకు నీవర్ణవిభజన మేర్పడియుండవచ్చును. జయింపబడిన యనార్యులు శూద్రులనబడిరి. వీరుకాక చండాలురు మొదలగుసంకరజాతులును, వృత్తులనుబట్టి బుట్టినగొన్నివర్ణములును, దేశభేదములవలనగలిగిన గొన్నివర్ణములును నుండెను. బ్రాహ్మణులు తమబుద్ధిబలముచే నగ్రస్థానముసంపాదించి యదిపోకుండవర్ణమునుండి వర్ణమునకు మార్పులేకుండ జేసిరి. తుదకు పుట్టుకయే వర్ణములో స్థానమునకు హక్కయ్యెను. వర్ణముయొక్క వృత్తియేర్పాటుచేయబడి యింకొకవృత్తి నవలంబించుటకు వలనుపడదయ్యెను.

ఎట్టిమంచియుద్దేశముతో జేయబడినను మొదట యెట్టిలాభము లున్నను మానవనిర్మితమయిన సంస్థలు క్రమముగా



పాడగును. అటులనే వర్ణవిభజన మభివృద్ధికి మొదట నెంతో లాభకారిగానుండెను. వర్ణములకు వృత్తులునిర్ణయింపబడుటచే వృత్తులనెన్నుకొనుటలో వృథాకాలయాపన మనవసరమగుటయేగాక వంశపారంపర్యా కొందరొకేవృత్తి నవలంభించుటచే వృత్తులువృద్ధినొంది వాటిలో నెక్కువనైపుణ్యమును సంపాదించుటకు వీలయ్యెను. వర్ణము లోకరాజ్యముననేగాక దేశమంతయు వ్యాపించియుండుటచే దేశపునైకమత్యమునకు వీలిచ్చెను. రాజకీయావసరమునబట్టి యనార్యు లార్యసంఘములో జేర్చుకొనబడిరిగాని బహుళసంఖ్యాకులగు ననార్యుల నాగరికతలోగలిసి యార్యనాగరికత నశించకుండ యీవర్ణపద్ధతి గాపాడెను. కాని వర్ణపద్ధతి దేశముననాటుకొని యొకవర్ణమునుండి యింకొకవర్ణమునకు మార్పులేకుండుటచేతను, భోజనప్రతిభోజనములుగాని, వర్ణేతరవివాహములుగాని లేకుండుటచేతను దేశమునందైకమత్యమునశించి యీర్ష్య, యసూయ, కార్పణ్యములకు జోటిచ్చెను. ఐకమత్యములేకుండుటచే దేశము పరరాజుల పాలయ్యెను. వర్ణములనంతము లయ్యెను. మేధావంతుల జ్ఞానాభివృద్ధికి నాటంకముకలిగి వారిబుద్ధి నిరుపయోగమయ్యెను. వేయేలహిందూనాగరికత దినదినాభివృద్ధినొందకగొంతవరకు వృద్ధినొంది యచ్చటనాగిపోయెను. ప్రజలు మతభ్రష్టులు, కార్యభీరులు, స్వలాభపరులును నయిరి.

ఈయుగంబుననే యార్యులు వ్రాయుటనేర్చిరిగాని వేదములు మొదలగు మతగ్రంథములను నితరవర్ణములు దెలిసికొందురన్న భయముచే వ్రాసినవారుకారు. వేదమునందున్న

గ్రాంథికభాషసంస్కృతమయ్యెను. జనసామాన్యముమాటలాడు భాష క్రొత్తపదములను ననార్యభాషలనుండిగ్రహించి దేశభేదములతో దేశభాషలయ్యెను. ఇవియే ప్రాకృతములు. ఈకాలముననే మానవవిధులను సూత్రరూపముగ రచించిరి. అవి శ్రౌత, గృహ్య, ధర్మసూత్రములుగ భాగింపబడినవి. సులభముగా జ్ఞాపకముంచుకొనుటకు నీసూత్రములేర్పడినవి. బ్రహ్మచర్య, గార్హస్త్య, వానప్రస్థ, సన్యాసాశ్రమములుగ బ్రాహ్మణుని జీవితకాలముభాగింపబడియెను. భగవంతునకును మనుజునకునుగల సంబంధము, పరలోకవిచారణ, యాత్మయొక్క భావిపరిణామము మొదలగువాటినిగూర్చి పండితులు చర్చింపసాగిరి. అట్టిచర్చకు ఫలితముగా నారువేదాంత మతములుద్భవించినవి. అవియెవ్వియనిన కపిలునిసాంఖ్యమతము, పతంజలుని యోగమతము, కనదుని వైశేషికమతము, గౌతమునిన్యాయమతము, జైమిని పూర్వమీమాంస, బాదరాయణుని యుత్తరమీమాంస, చార్వాకుని నాస్తికమతము.



## ౫-వ అధ్యాయము.

### —॰ ఆర్యుల రాజ్యాంగ పద్ధతి. ॰—

ఆర్యులు హిందూదేశమునకు వచ్చినప్పుడు కొన్ని కుటుంబములొకసంఘముగా నేర్పడి యొకముఖ్యునిక్రిందనుండెడివారు. వీరీదేశమున గొంతస్థలమునాక్రమించుకొని యచ్చట



నివాసమేర్పరచుకొనిరి. కాని శత్రువులతో బోరాడుట యవసరమయ్యెనుగనుక యిట్టిసంఘములు గొన్నికలిసి యొకరాజునేర్పరచుకొని వానియధికారముక్రింద నుండిరి. ఈరాజ్యపదవి వంశపారంపర్యపు హక్కుక్రింద పరిణమించినను ప్రజలకు రాజునెన్నుకొను హక్కులేకపోలేదు. పన్నులులేవుగాని ప్రజలుతమకుదోచినది రాజునకు కానుకగానిచ్చు నాచారము గలదు. రాజునకు దనయిష్టప్రకారముపరిపాలనజేయుటకు హక్కులేదు. సమితియని పిలువబడు ప్రజాసంఘము రాజునకు సలహానిచ్చుటకుండెను. ఈసలహాను రాజతిక్రమించగూడదు. రాజువిధులెవ్వియనిన న్యాయమునిచ్చుట, యుద్ధమునందు సైన్యములనడుపుట, యుద్ధమునకుబూర్వము దేవతలకుబలులనిచ్చుట.

ఆర్యులు పురాణయుగమున గంగానది దానియుపనదులు ప్రవహించు దేశమాక్రమించుకొనిరి. దేశపు పూర్వకాపులతోను తమలోనొకరొకరితోను యుద్ధములుజేయుచుండిరి. అందువలన సర్వదాసైన్యము నుంచుకొనవలసివచ్చుటచే రాజులు బలీయులైరి. పురాణకాలమునాడు రాజు భగవదాంశసంభూతుడనియు యాతనికెవ్వరు నడ్డుజెప్పగూడదనియు నమ్మకము ప్రజలలోబలిసెను. రాజుయొక్కవిధులు వృద్ధియయ్యెను. న్యాయమునిచ్చుట, యుద్ధమునందు సైన్యమునడపుటయేగాక, పట్టణములను పల్లెలను బందిపోటులనుండి గాపాడుట వ్యవసాయము వర్తకము మొదలగువృత్తుల నభివృద్ధిపరచుట యవధ్యుల బోషించుట, చెరువులు నూతులు త్రవ్వించుట, యప్పుమీదవడ్డీ నూటికిపన్నెండుకంటె నుండనీయకుండుట రా

జనకు విధులు.

ప్రతిగ్రామమున నొకయధికారియు, పది యిరువై నూరు వెయ్యి గ్రామములకు నొక్కొక్కయధికారియు నుండిరి. వీరందరిమీఁదను పన్నులక్రింద ధాన్యమువగయిరాలు వసూలుజేయుటకు నొకమంత్రియుండెను. గ్రామాధికారికి నాయూధియడవిరాబడియు, నూరుగ్రామములయధికారికి నొకయూరిరాబడియునిచ్చెడివారు. పన్నులువసూలుజేయుట యీయుగమున నారంభమయ్యెను. నేలపన్ను, వర్తకపుపన్ను ముఖ్యమైనవి. పంటలో నారవవంతు రాజునకు పన్నుక్రిందనీయవలెను. ఉప్పుపన్ను, నేలపన్ను, రేవులపన్ను, గజములమీఁదబన్నును గలవు. రాజునకు వెట్టిచేయించుకొను హక్కుగలదు. ఆర్యులు హింధూస్థానమునకువచ్చి చిన్నరాజ్యములను స్థాపించుకొనిరి. ఇట్టిరాజ్యములు విస్తారముగనుండెను. వీరిలోవీరు పోరుటచేతను, ననార్యులనుండి దేశమును జయించుటచేతను, బలవంతులగురాజులాచిన్నరాజ్యముల జయించిరి. అందుచే దేశమంతయు జుక్కలవలెవ్యాపించియున్న యీచిన్నరాజ్యములునశించి కొలదిసంఖ్యగల పెద్దరాజ్యములు స్థాపితమయ్యెను. వీరిలో నెవరోయొకరు బలవంతులై యితరరాజుల సామంతులుగజేసిరి. ఇట్లు కొంతకాలముజరిగినవెనుక దేశమంతయు నొకేరాజు నేలుబడిక్రిందకు వచ్చెను. ఈవిషయములబట్టి జూడ నింగ్లాండున శాక్జనురాజ్యస్థాపనను నిదిబోలియున్నది. ఇచ్చట నేకఛత్రాధిపతి చంద్రగుప్తుడు. అచ్చటనెగ్బర్టు.

పురాణయుగమున ప్రసిద్ధికెక్కినరాజ్యములు కురు, పాం



చాల, కోసల, విదేహ, కాశ్మీరరాజ్యములు. ప్రాతహిందూయుగమునాటికి నివి నాలుగయ్యెను. అవియెవ్వియనిన మగధ, కోసల, వత్స, అవంతిరాజ్యములు. పండ్రెండితర చిన్నరాజ్యములుగూడ నుండెను.

## ౬-వ అధ్యాయము.

### జయనులు, బౌద్ధులు.

వర్ణాశ్రమపద్ధతి యేర్పడినయనంతరము బ్రాహ్మణులు తమయాధిక్యమును నిలుపుకొనుటకు బలులనిచ్చుతంతులవృద్ధిజేసిరి. అదిగాక మతముగూడ జాలనభివృద్ధినొందుటచే మతగ్రంథములు విస్తారమై వాటియందలిజ్ఞానము బ్రాహ్మణులవశమైయుండెను. వారిది యితరులకుజెప్పక దమయెక్కువను సమర్థించుటకు గాథలగల్పించిరి. మనుధర్మశాస్త్రప్రకారము తక్కినజాతులన్నియు బ్రాహ్మణునికొరకే సృష్టింపబడినట్లు గనిపించుచున్నది. బ్రాహ్మణులు బ్రహ్మయొక్క ముఖమునుండియు, క్షత్రియులు బాహువులనుండియు, తొడలనుండి వైశ్యులును, పాదములనుండి శూద్రులును జన్మించిరని మనువుచెప్పెను. కాని వర్ణములేర్పడకపూర్వము రాజులేబలుల నిచ్చుచుండిరి. యుద్ధవీరులు ప్రఖ్యాతినొందినపురుషులగుటచే రాజన్యులనియు క్షత్రియులనియు పేరువడసి సంఘమున ముఖ్యస్థానము నాక్రమించియుండిరి. బ్రాహ్మణులు క్రమముగా వీరిని దప్పించి యగ్రస్థానమును సంపాదించిరి. వీరియాధిక్యత, వీరియి

తరవర్ణనిరసన, ప్రజలలో ముఖ్యముగా క్షత్రియులలో నుద్రేకము గలిగించినది. మతోద్ధారకులైన బుద్ధమహావీరులు క్షత్రియులు. ఇదిగాక పరలోకము మొదలగువాటినిగూర్చి యీకాలమున ననేకపండితులు చర్చించి బ్రాహ్మణమతము వారికి సరిపడనందున యితరమతముల స్థాపించిరి. అన్నిమతములు నశించినవిగాని జైను, బౌద్ధమతము లట్లునశించక నిలబడినవి.

జైనమతము.

వీటిలో జైనమతము మొదటనేర్పడినది. దీనిస్థాపకుడు వర్ధమానమహావీరుడు. ఇతడు వైశాలి కాపురస్తుడగు సిద్ధార్థుడను ప్రభువుకుమారుడు. ఈకుటుంబమనేక రాజకుటుంబములతో బాంధవ్యము గలిగియుండెను. వీరు పరశ్వనాథమతమువారు. దీనిలో గొప్పకుటుంబమువారుగాని చేరకూడదు. దీని సంకుచితభావమును నిరసించి వర్ధమానుడామతమును వదలి యందరకును లభ్యమగు మతమును స్థాపించుటకు బ్రయత్నించెను. నలుబదిరెండవయేట తనకుజ్ఞానోదయమయ్యెనని చెప్పి మహావీరుడనియు జిననియు బిరుదులు స్వీకరించెను. ఇతడు మతస్థాపనకై దేశాటనముచేసి యనేకుల నీమతమునజేర్చెను. ఈమతమువారే జైనులు. ఇతడు డెబ్బదిరెండవయేట క్రీ.పూ. 527 దాపున మరణించెను. ఈమతమునందు జాతివర్ణభేదములేదు. అందరును నీమతముఖ్యోద్దేశమైన మోక్షము నొందవచ్చును. ఆత్మ తిరుగ జననమొందకుండుటయే మోక్షము. ఈమతమున మూడు విధులుగలవు. సరిగాజూచుట, సరిగానెరుగుట, సరిగాచేయుట యనునవి. మూడవదానిలో నబద్ధమాడగూడదు, దొంగిలించగూడదు, కోరికయుండగూడదు. మనోవాక్కర్మముల పాపమును వర్జించవలెను, జంతువులయందు ప్రేమయుండవలెననునవి యిమిడియున్నవి. వీరిలో క్రమముగా బ్రాహ్మణవర్ణము బయలుదేరెను. ఈమతము బౌద్ధమతమంత వ్యాపించలేదు.



బౌద్ధమతము.

బౌద్ధమతస్థాపకుడు సిద్ధార్థుడు. కపిలవాస్తు రాజధానిగాగల శాక్యరాజయిన సుదోధనునికుమారుడు. పుట్టినదాది ప్రపంచమునందు కష్టముల జూచి ప్రాపంచికసుఖమునందు విముఖుడై ప్రహ్లాదునివలెనుండెను. ఇతనిమనస్సును ప్రాపంచికవిషయములదెస ద్రిప్పుటకుగాను కష్టములితనికి నగపడకుండ నితనిని వేరొకయింట నుంచి సంతోషముగా గాలక్షేపముజేయుటకు నితనితండ్రి యేర్పాటులగావించెను. కాని లాభములేకుండుటచే వివాహముజేసిన విషయలోలుడై విచారమును మానునని తండ్రియూహించి యితనికి వివాహముజేసెను. ఒకకుమారుడు గలిగెను. కానిప్రపంచకష్టములు ప్రాణికి లేకుండజేయుట యెట్లని యితడువితర్కించుచు నొకనాటిరాత్రి యెవరికినిజెప్పకుండ దల్లిదండ్రుల, భార్యాపుత్రుల, బంధువుల, రాజ్యసంపదల విడిచి యడవులపాలయ్యెను. అచ్చట తాపసులగూడి చిరకాలము తపమాచరించెనుగాని దానివలన శరీరముశుష్కించుటదప్ప యేయుపయోగము లేదనిగ్రహించి తాపసదీక్షనువదలెను. తనతోటితాపసు లాక్షేపించుచున్నను లక్ష్యముజేయక శరీరపోషణకొరకు నాహారముదిన నారంభించెను. ఇట్టిస్థితిలో గయప్రాంత

మందున్నయడవిలో బ్రస్తుతము బోధివృక్షమనిపిలువబడునొక చెట్టుక్రిందగూర్చుండి యాలోచించుచుండగానతనికిజ్ఞానోదయ మయ్యెను. దానిచేసంతుష్టుడై యాజ్ఞానమును నితరమనుజుల కుగూడ జెప్పివారినిగూడ గష్టములనుండి విముక్తుల జేయనూహించి దేశాటనము బ్రారంభించెను. ముందు రాజగృహము రాజధానిగాగల బిందుసారుడనురాజును బౌద్ధునిజేసి తనజన్మస్థానమయిన కపిలవాస్తుజేరి యచట దనతల్లిదండ్రుల నాలుబిడ్డల బంధువుల బౌద్ధులజేసి యితరదేశములకు బయలుదేరెను. ఇతడు ముసలితనమున క్రీ. పూ. 487 లో కాశీనగరమున మృతినొందెను.

అన్నికష్టములు కోరికవలన గలుగునుగాన గోరికయుండగూడదనియు నెవ్వరికిని హానిజేయగూడదనియు నతనియభిప్రాయము. అనేకజన్మము లున్నవనియు జన్మాంతరపాపఫలితముల జనులనుభవింతురనియు బుద్ధుడు నమ్మెను. బలులవలన లాభములేదనియు మనకర్మలమీద నేమనభావిసుఖదుఃఖములుండుననియు నితడుచెప్పెను. బుద్ధుడు భగవంతుడు లేడనలేదు గాని భగవంతుని గూర్చినప్రశ్నలనవసరములనియు నిర్వాణమొందుటకు మనకర్మలే సహకారులనియు నితనిమతము. నిర్వాణమును సంపాదించుటకు జీవయాత్రనెట్లు నడపవలెనో యావిధులనుగూర్చి యితనిమతముబోధించెను. అవియెవ్వియనిన జీవహింసజేయగూడదు, దొంగతనముజేయుకూడదు ,త్రాగకూడదు, త్రాగించకూడదు; మనోవాక్కర్మల శుచిగానుండవలయును. బౌద్ధజైనుమతములు కొన్నివిషయములలో నేకీభవించినను మరికొన్నిటిలో వ్యతిరేకముగానున్నవి. ఉభయులు బలులు వ్యర్థమనియు వేదములు భగవంతునిచే రచింపబడలేదనియు మంచికర్మల జేయవలెననియు జీవహింసకూడదనియు నొప్పుకొనిరి. కాని జైనులు ప్రతివస్తువునందున నాత్మగలదనియు మోక్షమునొందుటకు దేహమును గృశింపజేయవలెననియు నమ్మిరి. బుద్ధుడిందున కొప్పుకొనలేదు.





## 7-వ అధ్యాయము.

### మగధరాజ్యము. పరిష్యనులు, గ్రీకులు.

ఈకాలపు హిందూదేశ చరిత్రనుగూర్చిన వృత్తాంతమును బౌద్ధజైనుల మతగ్రంథములనుండియు బురాణములనుండియు గ్రహింపవచ్చును.

మగధరాజ్యము.

పురాణములు వ్రాయబడిన కాలమునాటి కార్యులు యమునాగంగానదులు ప్రవహించు స్థలములనుండిరి. కురు పాంచాల కోసల విదేహారాజ్యములు ప్రసిద్ధికెక్కినవి. ఆరవశతాబ్దమునాటికి వీటిప్రాముఖ్యత నశించి కోసల మగధ అవంతి వత్సరాజ్యములు ప్రబలములయ్యెను. మగధరాజయిన బిందుసారుడు గంగాదేశమును జయించి వివాహముద్వారా కోసలరాజ్యమునుండి కాశీనగరమును సంపాదించి రాజగృహము రాజధానిగా జేసికొనెను. ఇతనికుమారుడగు నజాతశత్రుడు తండ్రినిజంపి రాజయ్యెను.

ఇతడు రాజ్యమును జాల పెంచెను. కోసలరాజకుమార్తెను పెండ్లియాడి కాశీనిలబెట్టుకొనుటయేగాక నుత్తరముననుండి దనరాజ్యమునకు శతృభయము లేకుండచేసికొనెను. వైదేహుల నోడించి గంగానదియొడ్డున తూర్పుపశ్చిమముల రహదారికి నడ్డుగ పాటలీపుత్రమునొద్ద నొకకోటగట్టెను. ఈశిశునాగవంశస్థులగు రాజులకాలమున నితరరాజ్యముల నాక్రమించి మగధరాజ్యము ప్రసిద్ధికెక్కెను. దీనికి కారణములుగలవు. కోసలదేశపురాజు బలహీనుడయ్యెను. వత్స యవంతిరాజులు దమలోదాము పోరాడి బలహీనులైరి. ఇదిగాక మగధరాజ్యము ప్రబలమగుటకు మంచివసతులా దేశమున గలవు. నదులు మెండుగానుండుటచే భూమిసారవంతమయ్యెను. రాకపోకలకుమంచివీలు కలిగెను. ఫలవంతము ధనవంతము బలవంతమునగు మగధ ప్రసిద్ధికెక్కుట యొకవింత కాదు. ఇంగ్లాండున వెసెక్సు రాజ్యప్రాముఖ్యత గమనింపుడు. గ్రీకుదాడినాటికి శిశునాగవంశస్థులు రాజ్యము గోలుపోయిరి. నందవంశస్థులు రాజులయిరి.

పరిష్యనులు.
క్రీ॥పు॥ 521-425.

పరిష్యా దేశమునకు బోయిన యార్యులు సైరస్సనునొక యోధుని నాయకత్వమున మీడియా, బాబిలోనియా, ఎస్సిరియా, లిడియా మొదలగు ప్రసిద్ధికెక్కినరాజ్యములనుజయించిరి. ఆవంశపురాజయిన డెరయస్సనువాడు తనరాజ్యమునుపడమటిదిక్కున డెన్యూబునదివరకును, తూర్పున సింధునదివరకును వ్యాపింపజేసెను. ఇతడు జయించిన హిందూదేశభాగమును నొకపరగణా



క్రిందనేర్పరచి దానిపైనొకపాలకునినియమించెను. ఇచ్చటిరాబడి యాతని యాసియారాజ్యపు రాబడిలో మూడవవంతుండెను. అది బంగారురూపమున జెల్లింపబడెనట. అతని నావికాధిపతి యగు స్కైలాక్సునతడు సింధునదిమీదను సముద్రమునకుబోయి యచ్చటనుండి యర్రసముద్రమునకు వెళ్లెను.

పరిష్యనురాజ్య
ఫలితములు.

పరిష్యనురాజ్యము క్షీణించినపిదప యితరదేశములతో బాటు హిందూదేశముకూడ స్వాతంత్ర్యము నొందెను. కాని పరిష్యనులకును హిందువులకునుగల స్నేహభావము పోనందున పశ్చిమదేశములతో వర్తకము యథాప్రకారము సాగెను. రాజ్యతంత్రములనుగూర్చి కొన్నివిషయములు హిందూదేశస్థులు పరిష్యనులనుండిగ్రహించిరి. పరిష్యనురాజ్యవిస్తీర్ణతవలన చిన్నరాజ్యములుగలిపి పెద్దరాజ్యముగాజేయు విధానమును హిందువులు నేర్చిరి.

గ్రీకులు.
క్రీ॥పు॥ 334-325.

పరిష్యనులు గ్రీకుదేశముపై దాడివెడలి యోడిపోవుటచే గ్రీకులు పరిష్యనురాజ్యము నాక్రమించుటకుద్యమించిరి. ప్రపంచమున గొప్పవీరులని పేరుబడ్డవారిలోనొకడగు అలెగ్జాండరు వీరికి రాజు. ఇతడు పరిష్యనురాజ్యము నైదుసంవత్సరములలో జయించి తూర్పుదేశముల జయించుచు హిందూదేశమునకు వచ్చుటకు నిశ్చయించెను. తన సైన్యమును రెండుభాగములుగా జేసి పెద్దభాగమును ఖైబరుకనుమద్వారా పంపి, తాను చిత్రాలుమీదుగా కొద్దిసైన్యముతో హిందూదేశమున బ్రవే

శించితనసైన్యమును క్రీ.పూ.326 లో అటాకువద్దగలుసుకొనెను. ఈకాలమున పశ్చిమోత్తరమున జిన్నచిన్నరాష్ట్రములు విస్తారముండెను. అందులో ముఖ్యమైనవి కాశ్మీరము, తక్షశిల, యన్నదమ్ములును పురుషోత్తములని పిలువబడెడువారునునగు సద్దరురాజుల రాజ్యములును. తక్షశిలరాజు అలెగ్జాండరునకు లొంగిపోయి కప్పముగట్టుట కొప్పుకొనెను. అలెగ్జాండరు పురుషోత్తమునకు కబురుబంపగా పురుషోత్తముడు యుద్ధసన్నద్ధుడయ్యెను. అలెగ్జాండరు వానిదేశమునకుబోవ జీలంనదినిదాట యత్నించి యవతలయొడ్డున పురుషోత్తముని సైన్యమునుగాంచి, యచ్చట దాటుటకువీలులేక రాత్రియందు కొద్దిసైన్యమును దీసికొని శత్రువులకు దెలియకుండ నదియొడ్డుననేబోయి నదిపైభాగమున నొకచోట నదినిదాటి పురుషోత్తముని సైన్యమునుదాకెను. పురుషోత్తముని సైన్యమట్లుబోరుచుండ నవతలిగట్టుననున్న మిగిలిన యలెగ్జాండరు సైన్యము నదినిదాటి శత్రువులతో బోరాడనారంభించెను. ఇరుపక్కల శత్రువులసైన్యము దాకుటచేతను, గ్రీకుసైన్యమునకు యుద్ధశిక్ష బాగుగానుండుటచేతను నెంతధైర్యముతో బోరినను పురుషోత్తముని సైన్యమోడిపోయి చెల్లాచెదరైపోయెను అలెగ్జాండరు మంచిరాజకీయవేత్తగాన పురుషోత్తముని ధైర్యమునకు మెచ్చియతని రాజ్యము నతనికిచ్చివేసి శత్రువుని మిత్రునిగా మార్చెను. తాను జయించినస్థలమున రెండుపట్టణములనిర్మించి తూర్పునకుబోవ రెండవపురుషోత్తముడు తారసిల్లెను. ఈతడు మొదటివానివలెగాక అలెగ్జాండరునుజూచి పారిపోయెను. ఇతనిని దరుముట



మాని అలెగ్జాండరు తూర్పుదేశమునకు దిరిగెను. ఆసమయమున నందరాజులు తననుజంపింపయత్నింప మగధరాజ్యమును విడిచి మగధరాజకుటుంబమువాడయిన చంద్రగుప్తుడనువాడలెగ్జాండరు నొద్దకువచ్చి మగధరాజ్యముపై దాడివెడల నాతని ప్రోత్సాహపరచెను. అలెగ్జాండరు సమ్మతించి సట్లెజినదిని దాటనుండగా దనసైనికులు చిరకాలముక్రిందట దమదేశమునువదలినవారగుటచే నికముందునకు బోమనియు నింటికివెళ్లెదమనియు జెప్పి తిరుగుబాటుచేసిరి. అలెగ్జాండరిష్టములేకున్నను వెనుకకుమరలెను. సింధునదిప్రాంతమున చిన్నరాష్ట్రములనుజయించి యానదిమీద ప్రయాణముచేసి హైదరాబాదుపట్టణమును స్థాపించెను. చాలభాగము సైన్యమును రోడలమీద నియార్కసు నాధీనమున బంపి దాను కొలదిసైన్యముతో బెలుచిస్థానముగుండా పరిష్యాచేరెను. అలెగ్జాండరు బాబిలోనులో సంగ్రహించిన జ్వరముచే క్రీ.పూ. 323 లో మరణించెను. పరిష్యనులవలెనే యితడుకూడ తానుజయించిన దేశములపై పాలకులను నియమించెనుగాని కొద్దికాలములోనే ప్రజలుతిరుగుబాటుచేసి పాలకులను జంపివేసిరి.

**గ్రీకుదాడిఫలితములు.**

తూర్పునుగూర్చి పాశ్చాత్యులకు విస్తారముగా దెలియుటకు నిది హేతువయ్యెను. పశ్చిమముతో జేయువర్తకము వృద్ధియయ్యెను. ఉభయదేశములకును సంపర్కము జ్ఞానాభివృద్ధికి గారణమయ్యెను. సైన్యశిక్షణ, పెద్దరాజ్యముల గావించువిధము మొదలగునవి హిందువులునేర్చికొనిరి. అలెగ్జాండరుదాడిచే బలహీనములైన

పశ్చిమోత్తరమునను న్న చిన్నరాజ్యములు పరదేశీయులకాగతే మను భయముచేత బలవంతుడగు నొకరాజుక్రింద సామంతులగుటకు సిద్ధముగానుండిరి. ఇది చంద్రగుప్తుని యేకచ్ఛత్రాధిపత్యమునకు ముఖ్యకారణములలో నొకటి.



## 8-వ అధ్యాయము.

### మౌర్యసామ్రాజ్యము.

మగధరాజులయిన శిశునాగవంశస్థులలో నాకరువాని జంపి పద్మనందుడను మంగలివాడు రాజయ్యెను. ఈతడు శిశునాగవంశస్థులనందరిని వధించుటచే నావంశపువాడయిన చంద్రగుప్తుడు పారిపోయెను. అలెగ్జాండరును మగధమీదకు దండెత్తుటకు బ్రోత్సహించెనుగాని యితరకారణములచే నతడురాలేదు. రెండవనందునికాలమున రాజ్యాంగతత్వవేత్తయైన చాణక్యుడను బ్రాహ్మణునిసహాయమున నందులజంపి చంద్రగుప్తుడు రాజయ్యెను. నందులు బహుక్రూరులగుటచే బ్రజలుగూడ జంద్రగుప్తునివైపుననే యుండిరి. చంద్రగుప్తుడు మురకొడుకుగాన మౌర్యుడయ్యెను.

అలెగ్జాండరుదాడిచే జిన్నచిన్నరాజ్యములన్నియు బలహీనములయ్యెను. వాటినిజయించి చంద్రగుప్తుడు తనవశము జేసికొనెను. పరదేశీయుల దామెదిరింపలేమని యారాజులుగూడ నందుల కంగీకరించిరి. దేశమునందలి భాగ్యము, రాకపో



కలసౌకర్యము, చంద్రగుప్తునికిదోడయ్యెను. సహజముగ చంద్రగుప్తుడు బుద్ధిసూక్ష్మతగలవాడు. దానికితోడుగ్రీకులసహవాసమువలన మరికొంతజ్ఞానము సంపాదించుకొనెను. సైన్యనిర్మాణము, యుద్ధశాస్త్రము, పలుచిన్నరాజ్యములజయించి పెద్దరాజ్యముల నేర్పాటుజేయుట మొదలగువిషయముల నతడునేర్చెను. ఫలవంతమగు మగధరాజ్య మతనికార్యమునకు ననుకూలించెను. ఈకారణములచే చంద్రగుప్తుడేకచ్ఛత్రాధిపత్యము నొందగలిగెను. ఇతడన్నివిషయముల వెసెక్సురాజగు నెగ్బర్టును పోలియున్నాడు.

చంద్రగుప్తుడు, 321-297.

చంద్రగుప్తుడు క్రీ. పు. 321 లో మగధకురాజయ్యెను. ఇతనిపరాక్రమము యుద్ధకౌశలము జూపింపనవసరము గలిగెను. అలెగ్జాండరు సైన్యాధిపతులలోనొకడగు సెల్యూకసనువాడు తనప్రభువు తూర్పురాజ్యముల నాక్రమింపబ్రయత్నించి హిందూదేశమునకు వచ్చెను. కాని చంద్రగుప్తునిచే నోడింపబడి సంధిచేసికొని తనకూతురును చంద్రగుప్తునకు వివాహముచేసి పశ్చిమోత్తరదేశమనగా ఆఫ్ఘనిస్థానము బెలుచిస్థానముగూడ జంద్రగుప్తునకిచ్చి చంద్రగుప్తునిదర్బారులో దనప్రతినిధిని మెగస్తనీసనువానినుంచెను. చంద్రగుప్తుడతని కైదువందల నేనుంగులనిచ్చెను. తానుమృతినొందునాటికి నుత్తరమున హిందూకుష్ హిమాలయపర్వతములు, దక్షిణమునవింధ్యపర్వతములు, తూర్పుపడమర్లను సముద్రము నెల్లలుగాగల రాజ్యమును జంద్రగుప్తుడు పాలించెను.

బిందుసారుడు, 297-272.

చంద్రగుప్తుని యనంతరమతనికుమారుడగు బిందుసారుడు రాజ్యమునకు వచ్చెను. ఇతనినిగురించి నేమియు దెలియదుగాని యశోకుని కాలమునాటికి మగధరాజ్యములో కళింగరాజ్యముదప్ప మిగిలిన దక్కనంతయు జేరియుండుటచే నితడుగూడ వీరుడనియే జెప్పకతప్పదు.

అశోకుడు, 272-232.

ఇతనియనంతర మితనికుమారుడగు నశోకుడు రాజయ్యెను. అశోకుడు నలుబదిసంవత్సరములు రాజ్యముచేసి మిక్కిలి కీర్తివంతుడయ్యెను. ఇతనికి చరిత్రలో శ్రేష్ఠుడని బిరుదుగలదు. పరాక్రమవంతుడేగాని పరాక్రమముచే నితనికీబిరుదు రాలేదు. ఇతనిశాంతము, పొరలేనినడవడి, బౌద్ధమతవ్యాపన యితనికిఘనతదెచ్చెను. యుద్ధమునువర్జించి తనశాంతౌదార్యాదిగుణములచే శత్రుభయము, చోరభయములేకుండ దనరాజ్యము నతడు గాపాడగలిగెను. ఈతనిరాజ్యచరిత్రమాతనిరాజశాసనములవలన గొంతవిశదమగును. అట్టిశాసనములు పలుప్రక్కలనుండుటచే నీతనిరాజ్యవిస్తీర్ణత మనకుదెలియుచున్నది. నేపాలమునందు టరాయిలోను పశ్చిమోత్తరదేశమునను కథియవారులోగిర్నారువద్దను మైసూరునసిద్ధపురములోను గంజాంజిల్లాలో జౌగడావద్దను నీశాసనములు గనిపించుచున్నవి. కాని రాజగునాతనిచే నవివ్రాయింపబడియుండుటచే నతనిరాజ్యపద్ధతిని గురించిగాని యతనినిగూర్చిగాని విస్తారముగాదెలియుటకు వీలులేదు.



కళింగరాజ్యము.

రాజ్యమునకు వచ్చిన మూడుసంవత్సరములవరకు నితనికేకారణముచేతనో పట్టాభిషేకము కాలేదు. ఆకాలమున తరుచుగా జరుగుచున్న ట్లితడు రాజ్యమునకువచ్చినపుడు భాతృవధ బంధువధ జరుగలేదు. ఇది యితని ప్రేమపూరితమైన మనస్సును దెలియజేయుచున్నది. క్రీ.పూ. 291 లో నితడు కళింగరాజ్యమును జయించెను. ఆయుద్ధమున జరిగిన ప్రజానష్ట మితనిని యుద్ధమునుండి విముఖునిగను బౌద్ధునిగను జేసెను. ఇక నితడెప్పుడును యుద్ధము చేయలేదు.

అశోకుని గొప్పతనము.

హిమాలయపర్వతములు మొదలు పాలేరునదివరకును గల హిందూదేశమును, అఫగనిస్థానమును, బెలుచిస్థానమును, కాశ్మీరమును నతనిపాలనయందుండెను. ఇంతవిస్తీర్ణముగల రాజ్యమును కత్తితోగాక శాంతవచనములతోను, దయతోగూడినయాదరణమునను, పరరాజుల భయములేకుండగను, దేశములో సంక్షోభము లేకుండగను నితడేలగలిగెను. ఎంతదూరదేశమైనను నితని న్యాయవీక్షణలో నుండెను. పెద్దయుద్యోగులు, బంధువులు, తప్పుచేసినను వారినిశిక్షించుట కితడెప్పుడును వెనుదీయలేదు. ఎంతబీదవాడైనను చక్రవర్తివద్దనుండి న్యాయము నొందగలిగెను. ఇరువదవ శతాబ్దమునగూడ పశ్చిమవాసులు శాంతిమూలాధారముగ రాజ్యము నడుపుటకు బ్రయత్నించి విఫలులుకాగా క్రీ.పూ. రెండువందల సంవత్సరములక్రిందట శాంతమే ప్రధానముగ రాజ్యమేలిన రాజు శ్లాఘాపాత్రుడగుటకు

సందేహమేమి? అట్టివాఁడు శ్రేష్ఠుఁడనిగాని శ్రేష్ఠతముఁడనిగాని పిలువబడుటకు దగినవాఁడు. అదిగాక తాను ప్రజాసౌకర్యముకొఱకే రాజువయితినని జెప్పి, తన జీవితకాలమంతయు జనములకు వినియోగించిన రాజు దేవసముఁడుగాని మనుజమాత్రుఁడు గాఁడు. రహదారీలప్రక్క నితఁడు బాటసారుల సౌకర్యార్థము బావుల త్రవ్వించి, సత్రముల గట్టించి, చెట్లు నాటించెను.

కళింగయుద్ధానంతర మితఁడు బౌద్ధమతమువలంబించెను. ఈతనిగురువు ఉపగుప్తుఁడనువాఁడు. అశోకుఁడు ప్రియదర్శినను నామమును వహించి బౌద్ధమతమును తనరాజ్యములో ముఖ్యమతముగా జేసెను. కాని యన్యమతదూషణ నాశనము లతనికిష్టములుగావు. హిందువులును బౌద్ధులును స్నేహమున నుండునట్లతఁడు చేసెను. బౌద్ధమతము స్వీకరించినది మొదలు మతమును వ్యాపింపజేయుటయే యతని ముఖ్యమైన పని. ప్రజల బాగుకొఱకు బౌద్ధమతసూత్రముల రాతిమీద జెక్కించి ప్రజలనడవడి బాగుచేయుటకును వారికి సౌఖ్యము కలుగజేయుటకును నుద్యోగుల నియమించెను. మాంసభక్షణ నిషేధింపబడి యావిషయమై కొన్ని నియమము లేర్పరుపబడెను. ఈతని సూత్రములు ముఖ్యముగా భూతదయను, పెద్దలయందు గౌరవమును, మనోవాక్కర్మల శుచిత్వమును, నితరమత సహనమును బోధించెను. తనరాజ్యమున బౌద్ధమతము స్థాపించుటయేగాక హిందూదేశమందున్న నితరరాజ్యములకును పరదేశములకును

బౌద్ధమతావలంబన.



మతబోధనకై మనుష్యుల బంపెను. ఇతనితమ్ముఁడు మహేంద్రుఁడును చెల్లెలగు సంఘమిత్రయు మతవ్యాపనకై సింహళమునకు బోయిరి. చైనావంటి దూరదేశములకు సయితము మతవ్యాపకులు పంపబడిరి. అశోకుఁడు తనయంత్యకాలమున తన కొడుకునకు రాజ్యమిచ్చివేసి తాను సన్యసించెను. ఆకాలమున పాటలీపుత్రమున బౌద్ధసభ నొకదానిని జరిపెను.



## 9-వ అధ్యాయము.

### మౌర్యులకాలమున సాంఘికరాజకీయస్థితి.

ఈకాలపుస్థితినిగూర్చిన సమాచారము చంద్రగుప్తుని దర్బారునందున్న మెగస్తనీసను గ్రీకురాయబారి యొక్కయు బౌద్ధమతవ్యాపన బరీక్షింపవచ్చిన చైనాదేశస్థులలో మొదటివాఁడగు ఫాహియాన్ యొక్కయు గ్రంథములవలన దెలియుచున్నది.

రాజు నిరంకుశాధిపతి. వ్యవహారమంతయు తానే స్వయముగ జూచుకొనుచుండెను. అతనిక్రింద తరగతివారీగా రాజప్రతినిధిమొదలు గ్రామాధికారివరకు నుద్యోగులుండిరి. ఈయుద్యోగులనుగూర్చి వర్తమానములు దెలియుటకు చారులును, సరిహద్దులు గాపాడుటకుద్యోగులును వేరేయుండిరి. ఆకాలమున రాజకుటుంబములలో హత్యలు తరుచుగాన రాజును గాపాడుటకు రక్షకసైన్య

రాజ్యాంగపద్ధతి.

ముండెను. ఈసైన్యమున స్త్రీలుగూడ గలరు. రాజు వేటకు వెళ్లినప్పుడెవ్వరును రాజుయొక్క యరణ్యయావరణలోనికి బోగూడదు. ప్రజల నిత్యకృత్యములలోగూడ ప్రభుత్వమువారు జోక్యము కలుగజేసికొనెడివారు. చంద్రగుప్తునికాలమున చారులు ప్రతికుటుంబమునను జరుగు సంగతుల నిత్యము రాజునకు దెలియజేయుచుండిరి. అశోకునికాలమున ప్రజల మతసాంఘిక వ్యవహారములలో జోక్యము కలుగజేసికొనుటకు కొందరుద్యోగులు నియమింపబడిరి.

సైన్యపద్ధతి.

చంద్రగుప్తునికాలమున పెద్దసైన్యముండెను. 600000 కాల్బలము, 30000 యశ్వదళము, 9000 ఏనుగులు నుండెను. సైన్యమునకు కావలసిన సామానులు జాగ్రత్తజేయుటయందు బహుశ్రద్ధ వహించుచుండిరి. సైన్యవ్యవహారములు జూచుటకు ముప్పది సభ్యులుగల యొకసంఘముండెను. విల్లులు, రెండువైపుల వాడిగల కత్తులు, యెద్దుచర్మపు డాలులు కాల్బలము ధరించిరి. అశ్వారోహాధులీటులు పొట్టికత్తుల నుపయోగించెడివారు. అరదము లెడ్లు లాగెడివి. యుద్ధము జరుగుచున్నప్పుడు జనుల వ్యాపారములతో జోక్యము కలుగజేసికొనెడివారు కారు.

రాబడి.

పన్నులు వసూలుచేయుట కుద్యోగులుండిరి. పన్నులు ద్రవ్యరూపముగాను వస్తురూపముగాను చెల్లించెడివారు. భూమిపన్ను ముఖ్యమైనది. ఇదిగాక వర్తకసంబంధమైన పన్నులు, గనులమీదను చేపలమీదను పన్నులు, అడవిపన్నులు, జరిమానాలు, సారాయి మొదలగు



వస్తుపదార్థములమీద పన్నును, వృత్తిపన్నునుగూడ గలవు. ఇవిగాక భాగ్యవంతులనుండి వారిష్టముపై నుచితముగ సొమ్ము పుచ్చుకొను వాడుకగూడ కలదు.

ఈపన్నులవలన వచ్చురాబడి ప్రజల యుపయోగముకై చాలభాగము వెచ్చింపబడుచుండెను. రోడ్లువేయుట, వంతెనలు సత్రములు గట్టుట మొదలగు పనులు జాగ్రత్తగా జరుపబడుచుండెను. వర్తకము యొక్కయు, పరిశ్రమలయొక్కయు వృద్ధినిజూచుటకును, పరదేశీయుల నాదరించుటకును, జననమరణములు వ్రాయుటకును, ప్రభుత్వపన్నులు వసూలు జేయుటకును మ్యునిసిపలు సంఘమొకటి పట్టణములనుండెను. మూడు సంవత్సరములకో యైదుసంవత్సరములకో యొకసారి ప్రజాసభల పరగణాముఖ్యపట్టణములకు రాజాజ్ఞలను వినిపించుటకు బిలుచునాచార ముండెను.

న్యాయపద్ధతి.

వ్రాతచట్టములు లేవుగాని యాచారము ననుసరించి నేరములను విచారించుటకు జడ్జీలు మేజస్ట్రీటులు నుండిరి. జనులు చట్టబద్ధులును, న్యాయబుద్ధిగలవారు నగుటచే రాజ్యమున ఘోరనేరములు లేవు. తలుపులు మూయుట, తాళములు వేయుట లేదట. దీనివలన ప్రజలెంత న్యాయవంతులో దెలియుచున్నది. నేరమునకు శిక్షలు భయంకరముగా నుండెను. అబద్ధసాక్ష్యము చెప్పినందునకును, పన్నులు జెల్లింపమికిని, పనివాండ్రకు హానికలుగజేసినందులకును శిక్షలు విధింపబడెను. అశోకునికాలమున రాజుచే నేర్పరుపబడిన ప్రవర్తనవిధానమునకు భంగము గావి

చినను, జీవహింసవిధులను దాటినను నేరములుగా బరిగణింపబడెను. కాని యశోకుడు ప్రజలశిక్షింప నిష్టములేనివాడుగాన ప్రజలను హెచ్చరించుటకు గొందఱుద్యోగుల నియమించి నేరస్థులను తగినకారణముండిన క్షమించుచుండెను.

సాంఘికస్థితి.

జనులలో వర్ణభేదము లుండెను. పరిశ్రమలు ప్రభుత్వముచే బోషింపబడుచుండుటచే యభివృద్ధిదశలో నుండెను. సకాలవర్షములవలనను కాలువలగుండా నీటిపారుదలవలనను వ్యవసాయము బాగుగసాగుచుండెను. చోరభయము రాజబాటలగూడ లేదట. త్రాగుడుమొదలగు దురభ్యాసములు లేక జనులు క్లుప్తముగను సుఖముగను జీవించుచుండిరి. బానిసలుండిరి గాని వారిని యజమానులు బాగుగా నాదరించుచుండిరట. పురుషులు మొలకొక బట్టయు పైకొక యుత్తరీయమును శిరమునకు తలపాగయు ధరించెడివారు. స్త్రీలకుగూడ శరీరమున కొకబట్టయు మేలిముసుగున కొకబట్టయు నుండెను. పురుషులు తమ పాగాలమీదను స్త్రీలు శిరస్సులను మిగులవెలగల నగిషీపని జేయబడిన నగల ధరించెడివారు. అశోకుని విహారములను రాతిస్తంభములను శాసనములను బట్టిచూడ నాకాలమున రాతిమీద జెక్కుపనిలో జనులు మంచి నేర్పరితనమును సంపాదించినట్లు కనబడుచున్నది. ఇంజనీరింగులోగూడ గొప్పకృషి చేసినటుల స్పష్టమగుచున్నది.

మతము.

రాజమతము బౌద్ధమతమైనను నశోకు నితరమత సహనముచే బ్రాహ్మణమత మభివృద్ధిలో నుండెను. కాని ప్రజలలో జాలమందికి విద్య తక్కువగుటచే



వారు పూర్వాచారముల వదలక పిచ్చినమ్మకములుగలిగి యనేక భూతపిశాచముల బూజించి బలులనిచ్చుచుండిరి. సామాన్యప్రజల దమలోనికి దీసికొని తమమతమును వృద్ధిజేయుటకు బ్రాహ్మణులు బౌద్ధులుగూడ నీదురాచారములలో గొన్నిటిని దమతమ మతములలో జొన్పిరి. రెండుమతములుగూడ నిందుచే దమ యుత్కృష్టతను బోగొట్టుకొనెను.



## 10-వ అధ్యాయము.

### మౌర్యులరాజ్యనాశనము, సంగ కణ్వాయాంధ్రరాజులు

మౌర్యులరాజ్య విస్తీర్ణతయే దీని నాశనమునకుగూడ గారణమయ్యెను. అట్టిరాజ్యము నిలబెట్టుకొనుటకు బలవంతుడు బుద్ధిమంతుడు నగు రాజు కావలెను. కాని యశోకుని తరువాత వచ్చినవారు బలహీనులగుటచే నెక్కడికక్కడ స్వతంత్రరాజ్యములేర్పడెను. పశ్చిమోత్తరమున నున్న దేశము బాక్ట్రియనుల పాలయ్యెను. దక్షిణమున నాంధ్రులు స్వతంత్రులయిరి. కళింగదేశము జైనురాజైన కరవేలుని వశమయ్యెను. మౌర్యులరాజ్యము టిర్హాటు, బీహారము, సంయుక్తరాష్ట్రములనుమాత్రమే కలిగియుండెను.

మౌర్యులరాజులలో కడపటివానిని సంగవంశస్థుడగు పుష్యమిత్రుడనెడు సేనానాయకుడు జంపి క్రీ.పూ. 185 లో రాజయ్యెను. పుష్యమిత్రు డశ్వమేధయాగమును జేసెను.

సంగసంశస్థులు ముప్పదిసంవత్సరములు రాజ్యముచేసి బ్రాహ్మణమతమును వృద్ధిజేసిరి. క్రీ.పు. 272 లో నీవంశపురాజును కణ్వసంశపుబ్రాహ్మణ మంత్రియొకడు జంపి రాజయ్యెను. కణ్వవంశపురాజు లచిరకాలములోనే నాంధ్రులచే నోడింపబడి రాజ్యమును గోలుపోయిరి. ఆంధ్రులు క్రీ.పు. 27 మొదలు 300 సంవత్సరములు రాజ్యముచేసిరి కాని వారినిగురించి దెలియుటకేమియు నాధారములు లేవు.

బౌద్ధబ్రాహ్మణ మతములు.

మౌర్యుని వంశనాశనముతో బ్రాహ్మణ మతాభివృద్ధి యారంభమయ్యెను. పుష్యమిత్రుడు బ్రాహ్మణమతావలంబకుడు. ఈరోజులలోనే మనుధర్మశాస్త్రము రచింపబడెను. బౌద్ధమతమును పరదేశీయు లవలంబించుటచే నది నశించలేదు. ప్రజావలంబనకొరకు జేసినమార్పులవలన బౌద్ధమతస్వచ్ఛత నశించెను. బ్రాహ్మణమతాభివృద్ధితోబాటు సంస్కృతముగూడ వృద్ధినొందెను. ప్రాకృతములు నశింపసాగెను. పాణిని ననుసరించి యనేక వ్యాకరణములు రచింపబడెను.



## 11-వ అధ్యాయము.

పరరాజులు;- హిందూబాక్ట్రియనులు, హిందూపార్థియనులు, హిందూసిథియనులు, కుషానులు.

ఈజాతులవారు హిందూదేశమున హిందూమతము నవలంబించి హిందువులలో నైక్యమగుటచే వారిచరిత్రము దెలిసికొనుట యవసరము.



హిందూబాక్ట్రియనులు క్రీ.పు. 250 క్రీ.శ. 50.

అలెగ్జాండరు మృతినొందినవెనుక యతని సేనానాయకు లాతని రాజ్యమును బంచుకొనిరి. పశ్చిమయాసియా రాజ్యమునకు సెల్యూకస్సు రాజయ్యెను. ఇతనిమరణానంతరమున క్రీ.పు. 250 లో బాక్ట్రియనులు పార్థియనులు స్వతంత్రరాజులయిరి. ఇందులో బాక్ట్రియనులు గ్రీకువంశస్థులు. వీరు క్రమముగా నాఫ్గనిస్థానము, బెలుచిస్థానము, పంజాబు, సింధుదేశములను జయించిరి. వీరిలో బ్రసిద్ధికెక్కినవాడు మెనేండరు. ఇతడు బౌద్ధమత మవలంబించెను. హిందూగ్రంథముల యవనులని బిలువబడినవారు వీరే. క్రీ.పు. 130 లో బాక్ట్రియాను హిందూసిథియనులు లేక శకులు జయించినను హిందూదేశమునమాత్రము క్రీ.శ. 50 వరకు బాక్ట్రియనులు రాజ్యముచేసిరి.

హిందూపార్థియనులు క్రీ.పు. 138 క్రీ.శ. 100.

పార్థియనులు క్రీ.పు. 138 లో నాఫగనిస్థానము పంజాబుల నాక్రమించి బాక్ట్రియనులను సామంతులుగ జేసి క్రీ.శ. 100 వరకు రాజ్యముచేసిరి. వీరిలో బ్రసిద్ధికెక్కినవాడు గండోఫరు. ఇతడు మహారాజబిరుదమును వహించెను. పార్థియనులలో నొకతెగవారు దక్షిణహిందూస్థానమునకుబోయిరనియు వారే పల్లవులనియు దెలియుచున్నది.

వీరు తొలుత టుర్కిస్థానములో జాక్సార్టీసు నది

**శకులు లేక హిందూసిథియనులు.**

ప్రాంతమున నుండెడివారు. యూచూలను నొక తెగవారిచే దరుమబడి, బాక్ట్రియాదేశమునాక్రమించి, యచ్చటినుండి యాఫ్గనిస్థానమునకును, హిందూదేశమునకును వచ్చిరి. ఇందులోనొక తెగవారు సింధురాష్ట్రమునకును, రెండవ తెగవారు కథియవారు గుజరాతులకును, మూడవతెగవారు పంజాబున తక్షశిలకును బోయి యాదేశముల నాక్రమించిరి. నాలవతెగవారు దేశములోనికి బోయి మధురనాక్రమించుకొని రాజ్యమునొకటి నచ్చట స్థాపించిరి.

ఈశకప్రభువులు శాత్రపులను బిరుదును వహించిరి. శాత్రపులనగా రాజప్రతినిధులు. పంజాబున గొంతకాలము హిందూపార్థియను రాజుల యాజమాన్యము నంగీకరించి, శాత్రపులని పిలువబడి, తరువాత వీరు స్వతంత్రులైయుండిరి. ఇదియే యీబిరుదునకు గారణమైయుండును. వారుత్తరశాత్రపులనియు పశ్చిమ శాత్రపులనియు రెండుశాఖలుగా నుండిరి. పంజాబుదేశపురాజు లుత్తరశాత్రపులు, గుజరాతువారు పశ్చిమశాత్రపులు. ఉత్తరశాత్రపులు బౌద్ధులు. వీరు కుషాను రాజులచే నోడింపబడి రాజ్యమును గోలుపోయిరి. పశ్చిమశాత్రపులు మాళ్వా, సింధు, కచ్ఛి, కథియవారు, గుజరాతు, కొంకణదేశముల బాలించిరి. వీరు బ్రాహ్మణమతావలంబకులై యామతమును బ్రోత్సాహపరిచిరి. వీరాంధ్రులతో గొన్నిసమయముల బోరాడినను, మొత్తముమీద వారితో సంబంధబాంధవ్యములు గలుపుకొనిరి. ఈశకులు హిందువులతో గలిసిపోవుటచే వీరిచిహ్నము లేవియు నీకాలమున గనిపించుటలేదు. గానురాను వారినామములుగూడ హిందూనామములయ్యెను. ఈరాజులలో నొకడగు రుద్రదమను డాంధ్రులతో బోరాడి వారివశమైయున్న తనపూర్వులరాజ్యమును దిరుగ సంపాదించెను. ఉజ్జయిని రాజధానిగ వీరు క్రీ. వె. 400 వరకు రాజ్యమేలిరి.



**కుషానులు.**

సిథియనులను బారదోలిన యూచూలలో కుషానులను నొక తెగవారుండిరి. వారు కాడిఫిసెస్సు I యనువానిక్రింద సింధునది ప్రాంతమువరకు జయించిరి. ఇతనితరువాత రాజు క్రీ. వె. 85 లో దక్షిణమున సింధు, తూర్పున కాశీవరకును గలదేశమును, పశ్చిమోత్తరహిందూస్థానమును జయించెను. గ్రీకు పార్థియను రాజ్యములు నశించుటచే పశ్చిమదేశములతో తిరుగ వ్యాపారము సాగెను. మాళవరాజు ప్రసిద్ధికెక్కిన కానిష్కుడు. ఇతడుత్తరమున కాశ్మీరమును, పార్థియనురాజ్యములను, చీనారాజ్యమునుండి యార్కండు, ఖోతాను, కాష్గరు దేశములను జయించెను. ఇతని రాజ్యము బొఖరా మొదలు సింధునదివరకును, పరిష్యా మొదలు బీహారము వరకును వ్యాపించెను. ఇతనికి హిందూదేశమున కవతల విశేషరాజ్యమున్నను హిందూదేశపురాజుగనే బరిగణింపబడెను. ఇతనిరాజధాని పురుషపురము.

ఇతడు బౌద్ధుడు. బుద్ధుని మరణానంతరము బోషించు రాజులు లేక బౌద్ధమతము క్షీణించుటచే నితడు బౌద్ధమతోద్ధ

రణమునకై యొక బౌద్ధసభను జరిపెను. బౌద్ధమతగ్రంథముల బ్రోగుచేసి మతనిబంధనల నేర్పాటుగావించెను. ఈనిబంధనలలో నుత్తరమతమునకును దక్షిణమతమునకును గొన్ని భేదము లుండెను. ముఖ్యభేదము నుత్తరమతమువారు బుద్ధుని దేవుడనిరి; దక్షిణమతమువారు కాడనిరి. ఈభేదములచే బౌద్ధమతము హీనాయన, మహాయన, యని రెండుతెగలయ్యెను. కానిష్కు మతవ్యాపనకై యనేకకట్టడముల నిర్మించెను.

ఈవంశస్థులు క్రీ. శ. 226 వరకును రాజ్యముజేసిరి. ఆఖరురాజు వాసుదేవుడు. ఈనామమునుబట్టి వీరు పూర్తిగా హిందువులలో గలిసిపోయిరని జెప్పవచ్చును. ఈరాజ్యము నశించి చిన్నచిన్న రాజ్యములు స్థాపితమయ్యెను. శాంతినెలకొల్పుటకొక బలవంతుడగు రాజులేకుండుటచే దేశమరాజకమై, గుప్తరాజ్యస్థాపనవరకు చరిత్రకాధారములు లేకుండెను.



## 12వ అధ్యాయము.

### బౌద్ధయుగమున సాంఘికార్థికపరిస్థితులు

పల్లెలు.

ఈకాలమునాటికిగూడ పల్లెటూరులు దేశమున మెండుగా నుండెను. పల్లెటూరుల నిండ్లు విడిగులదగ్గరగా నుండెను. ఊరికిసమీపమున నొకతోపును, దానికవతలవ్యవసాయపుభూములును నుండెను. ఆతోపు దేవతకొరకేర్పాటై యుండుటచే దానిలోని చెట్లెవ్వరును నఱుకగూడదు. ఊరికంతకు నొకగడ్డిబీడును, వంటచెఱకునకొకయడవియు నుండెను. ఊరిపశువుల నన్నిటిని కాయుపని యొకనిది. భూములను భూఖామందులు తమబిడ్డల, సోదరుల, బానిసల సహాయమున దున్నుకొనిరి. కూలికి వ్యవసాయపు బనిచేయుట బహునీచముగా జూడబడెను. పంటకాలువ లూరివారే త్రవ్వుకొనవలెను. తండ్రి యాస్తిని కొడుకులు సమముగా పంచుకొనిరి. స్త్రీలకునాస్తిలో హక్కులేదు.



గ్రామవ్యవహారములు గ్రామాధికారి యాధిపత్యము క్రింద నొకసంఘముచే జరుపబడుచుండెను. ఈగ్రామాధికారిని సంఘమున కెన్నుకొను హక్కున్నను సాధారణముగా నాయుద్యోగము వంశపారంపర్యా వచ్చుచుండెను. వెట్టిపనులు లేవుగాని యుద్యోగస్థులు గ్రామమునకు వచ్చినపుడు వారికి గావలసిన సామగ్రుల సప్లయిజేయుట గ్రామాధికారికి విధి. కచేరిసావడి గట్టుట, పొరుగూరికి దారినేర్పరచుట, కాలువలు మరమ్మతుజేయుట యూరివారివిధి.

మిక్కిలి భాగ్యవంతులుగాని జమీందారులుగాని లేకున్నను జనులు మొత్తముమీద కలిగినవారుగనే యుండిరి. వారికి గావలసిన వస్తుసామగ్రి స్వల్పము. అవి యూరిలోనే దొరకెను. అప్పుడప్పుడుకరువుచే బాధపడుచుండుటయు గలదు. ప్రతియూరను సాధారణముగా చాకలి, మంగలి, వడ్రంగి, కమ్మరి మొదలగు నవసరమైన పనివాండ్రుండిరి. వరి, కాయధాన్యములు ముఖ్యమైన పంటలు. చెఱకుగూడ పైరగుచుండెను. రాజునకు పంటలో నారవభాగము మొదలు పం

డ్రెండవ భాగమువరకు నిచ్చనాచారముండెను.

**వర్ణపద్ధతి.**

వర్ణములు స్పష్టముగా నేర్పాటైనను ప్రస్తుతమున్నంత కఠిననిబంధనలు లేవు. పలురంగులమనుష్యులొకే వర్ణమున నాకాలమున గనుపడుచుండుటచే వర్ణమునుండి వర్ణమునకు మార్చుండెనని యూహించవచ్చును. వర్ణమునకును వర్ణమునకును భోజన ప్రతిభోజనములును వివాహములునుగూడ నున్నట్లు తెలుచున్నది.

**పరిశ్రమలు.**

ప్రస్తుతమున హిందూదేశమునను న్న పరిశ్రము లన్నియు నప్పుడుగూడ నుండుటయేగాక పనివాండ్రు వారిపనిలో నైపుణ్యమును సంపాదించి నట్లుగూడ గనబడుచున్నది. ఇంగ్లాండున గిల్డులవలె నిక్కడగూడ పరిశ్రమసంఘము లుండెను. ఈసంఘములకు మహాశెట్టి యనునొక యధికారియుండెను. ఇతడు పరిశ్రమాభివృద్ధికి జూచుటయేగాక పనులలో గల్తీ లేకుండ జూచుటచే పరిశ్రమలకీర్తి నిలబడెను. పట్టణముల నంగడు లుండెను; సంతలు లేవు. వీథులవెంబడి గ్రామములవెంబడి దిరిగి యమ్ము వర్తకు లుండిరి. మాంసవిక్రయమునకు ప్రత్యేకస్థలము లేర్పాటయ్యెను.

ఇప్పటివలె గంకరరోడ్లు లేవు. అన్నియు నాటుమార్గములే. సరుకు కాలువలమీద చిన్నపడవలలోగాని బాటలవెంబడి ఎడ్లమీదను చిన్నబండ్లమీదనుగాని దీసికొనిపోవుచుండిరి. వర్తకమునకు నుపయోగించెడి సరకులలో ముఖ్యము



లైనవి పట్టుబట్టలు, శెల్లాలు, సన్నబట్టలు, కవచములు గోదిసీలు, తివాసులు, అత్తరువులు, ఔషధములు, నగలు, దంతపు సామానులు మున్నగునవి.

**నాణెములు.**

ఈకాలమున నాణెము లారంభమయ్యెను. మొదట కహాపణమనెడు రాగి చతురపునాణె ముండెను. ఇది రాజులచే ముద్రింపబడక నిచ్చిన వారిచే గంట్లు పెట్టబడెను. గ్రీకుదాడి యనంతరమున గుండ్రపునాణెము లమలులోనికి వచ్చెను. నాణెములమీద విగ్రహములు వ్రాతలుగూడ మొదలిడిరి. రాగితోనేగాక బంగారుతోను వెండితోనుగూడ నాణెములజేయనారంభించిరి. నిష్కము సువర్ణమునునవి బంగారునాణెములు. ధారణ యనునది వెండినాణెము. నిష్కము విలువ నిర్ధారణలేక మారుచుండెను. సువర్ణము పదునెనిమిదిరూపాయల పండ్రెండణాలు. ధారణ తొమ్మిదణాలు. కహాపణ మొకణా.

**ధరలు.**

వస్తువుల ధరలు కహాపణములలో జెప్పెడివారు. గాడిద 8 కహాపణములు. గుఱ్ఱము 1000, కాశీశల్లా యంగీ 100000, కాలిజోళ్లజత 500 మొదలు 1000 వరకును, జతయెద్దులు 24. బానిస 100, బండిబాడుగ గంటలబట్టి 8, క్షవరమునకు 8, నగిషీపనిజేయు దర్జీ రాబడి రోజునకు 1000, తక్షశిలలోగాని కాశీలోగాని చదువుకొనుటకు భాగ్యవంతుని కుమారునకు జీతము 1000, సరకులేని బండిని నదినిదాటించుట కొకకహాపణము, పశువును దాటించినందుల కర్ధకహాపణము.

## 13-వ అధ్యాయము.

### గుప్తవంశము—హర్షవర్ధనుడు.

మౌర్యులరాజ్యము క్షీణించిన తరువాత దేశమరాజకముగా నుండెను. ఈయరాజకమును బోగొట్టి శాంతినెలకొల్పి హిందూస్థానమునంతయు తిరుగ నేకచ్ఛత్రాధిపత్యముగా నేలినవారు గుప్తులు. ఈవంశమూలపురుషుడు చంద్రగుప్తుడు. మౌర్యుల చంద్రగుప్తుడు వేరని దెలియుటకు జరిత్రకారు లితనిని మొదటి చంద్రగుప్తుడని పిలిచిరి. ఇతడు మగధరాజ్యములో నొకచిన్నరాష్ట్రమున కధిపతి. బలవంతులైన లిచవీలను నొక తెగవారి ముఖ్యుని కుమార్తె కుమారీదేవియను నామెను వివాహమాడుటచే వీరిసహాయమును సంపాదించి చంద్రగుప్తుడు పాటలీపుత్రమును, దానిచుట్టుననున్న జిల్లాలను సంపాదించెను. బిహారము, టిర్హాటు, అయోధ్యలను జయించి క్రీ. వె. 326 లో నితడు చనిపోయెను. తన జయముల జ్ఞాపకార్థ మొక నూతనశకము నారంభించెను.

చంద్రగుప్తుడు I

చంద్రగుప్తుని యనంతర మతనిపుత్రుడగు సముద్రగుప్తుడు రాజయ్యెను. ఇతడు గుప్తరాజులలో బ్రసిద్ధుడు. అశోకునిరాతిస్థంభములలో నొకదానిమీద నితడు చెక్కించిన వ్రాతవలనను నితరయాధారములబట్టియు నితనిజయములగూర్చి మనకు దెలియుచున్నది. ఇతడు వీరుడగుటయేగాక గవిపోషకుడై భాషాసేవగూడ జేసెను. ఇతని దక్షిణదిగ్విజయ యాత్రమిగుల

సముద్రగుప్తుడు 326-375.



యద్భుతమైనది. మొదట గంగానదిప్రాంతములనున్న చిన్నరాజ్యముల జయించి తనరాజ్యమును, సుస్థిరము జేసికొని దక్షిణమునకు బయలుదేరెను. తనరాజధానియగు పాటలీపుత్రమునుండి బయలుదేరి చోటానాగపురముద్వారా సాత్పురాపర్వతముల పూర్వభాగమునుజుట్టి, మహాకోసల, కళింగ, యాంధ్రరాష్ట్రములజయించి, కొల్లేరుసరస్సుదాటి దక్షిణమునకుబోయెను. దారిలో పల్లవవంశస్థుడగు వెంగిదేశపురాజును, కాంచీపురపురాజగు విష్ణుగోపుని, పాలక (పాల్ఘాటు) రాజగు నుగ్రసేనుని జయించెను. అటనుండి పశ్చిమమునకుదిరిగి దేవరాష్ట్రము (మహారాష్ట్రము) ఖాండేషులజయించి వింధ్యపర్వతముల దాటి తనరాజధానిజేరెను. ఇతని యాత్రంతయు 3000 మైళ్లుండి మూడుసంవత్సరములు పట్టెను. ఇట్టి దండయాత్రజరిపినవారిలో నితడు మొదటివాడు. మహమ్మదీయ సేనానాయకుడగు మలిక్కాఫరు రెండవవాడు. జయించినరాష్ట్రముల నాక్రమింపక కొల్లయు కప్పముగొని వెళ్ళిపోయెను. తన దిగ్విజయప్రకటనార్థ మొక యశ్వమేధయాగముజేసి, యంతటినుండి యుద్ధమువంకబోక దేశాభివృద్ధికిని భాషాభివృద్ధికిని బాటుపడెను. తన కడపటిరోజులలో తనకుమారునిగూడ రాజ్యపాలనలో సహాయముగ దీసికొని యతనిని దయారుచేసెను.

సముద్రగుప్తునికీర్తి నలుగడల వ్యాపించుటచే కాబూలుపరిష్యారాజులుగూడ నీతనిసఖ్యముగోరి రాయబారములనంపిరి. ఈతనిరాజ్యమున జోరభయముగాని, సంక్షోభములుగాని లేకుండెను. ఈతనిరాజ్య ముత్తరమున హిమాలయమును, దక్షి

ణమున నర్మద, తూర్పున భగీరథి, పశ్చిమమున యమునచాంబలులు నెల్లలుగా గలిగియుండెను

చంద్రగుప్తుడు II
375—413.

ఇతడుకూడ తండ్రివలెనే చాలకాలము రాజ్యముజేసి వీరుడనియు, భాషాపోషకుడనియు పేరుపడెను. పశ్చిమమునను వంగదేశమునను దిరుగుబాటులనణచి, గుజరాతు శాత్రాపులజయించి విక్రమాదిత్యుడని బిరుదునొందెను. బహుశా యనేక కట్టుకథలకు మూలపురుషుడగు విక్రమార్కుడితడే యయియుండవచ్చును. శాత్రాపులను జయించిన దరువాత రాజధాని యుజ్జయినికిమార్చెను. ఇతని యాస్థానమున గాళిదాసాది మహాకవులుండిరి.

ఇతని యనంతరము మగధరాజ్యము క్షీణించెను. ఇతని తరువాతరాజ్యమునకు వచ్చినవారు దుర్బలులగుటచేతను హూణులను నొకతెగవారు పశ్చిమ యాశియా, తూర్పు ఐరోపాలను నాక్రమించి హిందూదేశముపైకి దాడివెడలి పంజాబు నాక్రమించుటచేతను గుప్తరాజ్యము నశించెను. కాని హూణులు హిందూస్థానమున రాజ్యస్థాపన జేయలేకపోయిరి. తోరమాణుడను నతనియనంతరమతని కుమారుడగు మిహిరగులుడను రాజ్యస్థాపన జేయప్రయత్నించిరిగాని వారనాగరికులును క్రూరులునునగుటచే బ్రజలువారియెడల విముఖులైరి. గుప్తవంశజుడగు నరసింహగుప్తుడను నొకచిన్నరాష్ట్రాధిపతి యశోధర్ముడను నొకసామంతరాజు సహాయముతో హూణుల నోడించెను. మిహిరగులుడు కాశ్మీరమునకు బారిపోయెను. హిందూ



దేశమున కవతలనున్న దేశముల హూణులోడింపబడుటచే వారినుండి సహాయములేక హిందూదేశపుహూణు లెక్కడివారక్కడ నోడింపబడిరి. ఈహూణుల నోడించుటలో బ్రసిద్ధికెక్కినవాడు ప్రభాకరవర్మ. ఇతడు థనేశ్వరమువద్ద రాజ్యము స్థాపించెను. ఇతనికుమారుడే హర్షవర్ధనుడు.

హర్షవర్ధనుడు
606—648

హర్షవర్ధనుడు పదునారవయేట విషమపరిస్థితులలో రాజ్యమునకు వచ్చెను. దేశమరాజకముగానుండి యాస్తిప్రాణములకు క్షేమము లేకుండెను. ఇతని బావమరిదియగు కనోజిరాజు తనపొరుగురాజులలో నొకనితో యుద్ధముజేసి యుద్ధమున జనిపోయెను. అతనిభార్య ప్రపంచమునువదలి యడవులకు బారిపోయెను. ఆమెను దీసుకొని వచ్చుటకు హర్షునియన్న వెళ్ళి తిరుగ వచ్చునపుడొకడు మిత్రద్రోహముజేసి యతనిని జంపెను. ఇది జరుగకపూర్వమే వ్యాధిగ్రస్తుడగు నితనితండ్రి మరణించెను. తల్లి సహగమనము జేసెను.

ఇతడు రాజ్యమునకువచ్చి క్రొత్తశకము నారంభించెను. మొదట దనచెల్లెలను వెదకి దీసికొనివచ్చి, తమకుటుంబ శత్రువులనుద్రుంచి హిందుస్థానముజయించి శాంతిని నెలకొల్పుటయందు గాలముపుచ్చెను. రెండవచంద్రగుప్తుని నాటికి రాజ్యమెంతయుండెనో యంతయుగాక బంగాళమును నేపాళమును గూడ క్రీ. వె. 620 నాటికి సంపాదించెను. కామరూప (అస్సాము) వల్లభి (గుజరాతు) రాజులితని యాజమాన్యము నంగీకరించిరి. ఇతడు దక్షిణ చాళుక్యరాజగు పులికేశునితోయు

ద్ధము చేసి యోడిపోయెను. ఇతనిజీవితకాలములో నిదియొక్కటి యే యోటమి. ఈతరువాత నర్మదదాటి దేశమునుజయించు టకు హర్షుడు ప్రయత్నించలేదు. ఇతడు క్రీ. శ. 648 లో చనిపోయెను. ఇతనిరాజ్యకాలమున హ్యుఎన్‌త్సాంగను చీనా దేశస్థుడు బౌద్ధమతగ్రంథములకై హిందూదేశమునకు వచ్చి దేశమంతయుదిరిగి తన హిందూదేశపర్యటనమునుగూర్చిపుస్తక మొకటివ్రాసెను. ఇదియాకాలపు చరిత్రవ్రాయుటకు జాలను పయోగము. హర్షుని యనంతరము దేశముతిరుగ నల్లకల్లోల మున బడిపోయెను.



## 14.వ అధ్యాయము.

### — సాంఘికమత పరిస్థితులు. —

బ్రాహ్మణమతము

గుప్తవంశరాజులకాలమున బ్రాహ్మణ మతము మరల దలయెత్తెను. బ్రాహ్మణ మతము బౌద్ధమత ముగూడ యసంఖ్యాకులగు శూద్రులను దమ మతములోనికి దీసికొనుటకు ద్రావిడయాచారముల గొన్నిటిని దమమతముల జొన్పిరి. ఇంతియగాక బ్రాహ్మణమతమున విగ్రహారాధన, యనేకదైవముల గొల్చుట, యూరేగింపులు, ఉత్సవములు, నీకాలమున బ్రారంభమైనవి. దేశమునకు క్రొత్తగావచ్చినవారిని దమమతములోనికి జేర్చికొనుటచే వారు బ్రాహ్మణమతౌన్నత్యమునకు బాటుబడిరి.



రాజపుత్రులు

ఇటుల బ్రాహ్మణమతములో జేరినవారిలో ముఖ్యులు రాజపుత్రులు. వీరు హిందూదేశముపై దాడి వెడలిన సిథియనులు, కుషానులు, హూణులు మొదలగువారికిని క్షత్రియులకును బుట్టినవారు. వీరవంశముల బుట్టినవారగుటచే వీరు సేనానాయకులుగను రాష్ట్రాధిపతులుగను నుండి క్రమముగా స్వతంత్ర రాజ్యముల నేర్పరచుకొనిరి. శౌర్యధైర్యాదులవలన వీరు కీర్తిని గణించుటచే క్షత్రియులు గూడ రాజపుత్రులమని జెప్పుకొనిరి. బ్రాహ్మణులు రాజపుత్రులు పుట్టుటకొక గాథనుగల్పించి వారిని హిందూమతములో జేర్చిరి.

కుమారిలభట్టు

బ్రాహ్మణమతము ప్రబలమగుటచే తిరుగ మతవిషయ విచారణలు బయలుదేరెను. ప్రసిద్ధికెక్కిన మతోద్ధారకులీకాలమున బయలుదేరిరి. క్రీ.శ.750 లో కామరూప (అస్సాము) కాపురస్థుడగు కుమారిలభట్టను బ్రాహ్మణుడు బీహారమునుండి బయలుదేరి హిందూదేశమంతయు దిరిగి బ్రాహ్మణమతమును స్థాపించెను.

శంకరాచార్యులు 788—819.

వీరు మలబారు నంబూద్రి బ్రాహ్మణులు. క్రీ.శ. 788 లో బుట్టి 32వ యేట వీరుమృతినొందిరి. వీరుగొప్పపండితులు. చిన్నతనముననే సమస్తవిద్యలనేర్చికొని, సన్యాసులై దేశాటనము జేసి యప్పటికున్న మతాధికారుల నందర వాదనలో నోడించి యద్వైతమతము దేశమునస్థాపించిరి. వీరిబుద్ధిసిగూర్చి యు మతజ్ఞానమునుగూర్చియు ననేకకథలు దేశమునందుగలవు.

మతాభివృద్ధికి దేశమున గొన్నిస్థలముల పీఠముల స్థాపించిరి. వీటికన్నిటికిని మూలపీఠము మైసూరునందున్న శృంగేరిపీఠము. శంకరాచార్యులవా రుపనిషత్తులకు భాష్యము వ్రాసిరి. ఇదిచాల ప్రసిద్ధికెక్కెను.

ఈకాలమునాటివారు కాకున్నను హిందూమతములలో యద్వైతమతముతో సరిగా ప్రసిద్ధికెక్కిన వైష్ణవ, మధ్వమత స్థాపకులగు రామానుజ మాధవాచార్యులగూర్చి నిచ్చట జెప్పబడును.

రామానుజాచార్యులు 1150

ఈయన వైష్ణవమతస్థాపకుడు. క్రీ. శ. 1150లో చెన్నపట్టణమునకు దక్షిణమున నొకపల్లెటూరిలో నితడు జన్మించెను. ఈయన యద్వైతమతమును నిరసించి సన్యాసియై, విష్ణువు ముఖ్యదైవముగాగల నొకమతమును స్థాపించెను. జాతిభేదములేకుండ వైష్ణవులందరకును ముక్తిదొరకునని యీయన వాదించెను.

మాధవాచార్యులు 1199

ఈయన మధ్వమతస్థాపకుడు. క్రీ. శ. 1199లో దక్షిణకన్నడమున నితడుజన్మించెను. ఇతడు కూడ నద్వైతమతమును నిరసించి తానొకమతమును స్థాపించెను. వీరిమతమున ప్రధానదైవము విష్ణువు. విష్ణుదరువాత హనుమంతుడు ముఖ్యప్రాణదేవుడు. ఈమతమొక బ్రాహ్మణులకే నుద్దేశించబడెను.

అద్వైతము దేవుడొక్కడేనిత్యుడనియు దక్కినవి యనిత్యమనియు జెప్పును. విశిష్టాద్వైతము దేవుడు జీవుడు నిత్యములనియు జీవుడు చివరను దేవునితో గలసి పోవుననియు జెప్పుచున్నది. మధ్వమతములో దేవునకు దేవుడు జీవునకు జీవుడేగాని యైక్యములేదు.



భాషాభివృద్ధి శాస్త్రములు.

సంస్కృత మీకాలమున నభివృద్ధి జెందెను. అన్నివిషయముల గొప్పగ్రంథములు సంస్కృతమున రచింపబడెను. కాళిదాసు, దండి, భవభూతి భారవి, హాల, సుబంధు, అమరసింహ, భర్తృహరి, బాణుడు మొదలగు సుప్రసిద్ధులైన కవీశ్వరు లీకాలమున నుండిరి. శాస్త్రములగూడ నీకాలమున నెక్కువకృషి జరిగెను. ఈకాలమున హిందువులకును గ్రీకులకును రాకపోకలుండుటచే నొకరినుండియొకరు కొన్నియంశముల నేర్చిరి.

శిల్పశాస్త్రము

శిల్పశాస్త్రమున గ్రీకు లెక్కువప్రావీణ్యమును సంపాదించియుండుటచే హిందువులు వీరివద్ద నీశాస్త్రమును నేర్చినను గ్రుడ్డిగా వారిత్రోవనే బోక తమబుద్ధి నుపయోగించి క్రొత్తత్రోవల బోయిరి. హిందువులు నిర్మించిన దేవాలయములు విహారములు మొదలగువాటిలో గ్రీకుసంబంధ మేమియు లేదు. హిందువు లీశాస్త్రమున నెక్కువ నేర్పును సంపాదించిరి. ఆకాలపు పనులలో గొన్నియిప్పటికిని నద్భుతమును గల్పించుచున్నవి. ఎల్లోరావద్దను సంచీవద్దను గట్టబడిన విహారములు దీనికి నిదర్శనములు.

ఈశాస్త్రము గ్రీకులవద్దనుండి హిందువులు గ్రహించిరా

గణితశాస్త్రము ఖగోళశాస్త్రము.

వీరివద్దనుండి వారుగ్రహించిరా యన్న యంశము నిర్ణయించుటకు వీలులేదు. హిందువులీశాస్త్రముల మంచిజ్ఞానము సంపాదించిరి. కొన్ని విషయముల మాత్రము హిందువులనుండియే యితర దేశీయులు నేర్చిరని జెప్పక తప్పదు. దశమలు సంఖ్యను హిందువులు కనిపెట్టిరి. గణితము బీజగణితము హిందువులవద్ద నరబ్బులు నేర్చికొని పాశ్చాత్యులకు జెప్పిరి. ఖగోళశాస్త్రమున గ్రీకులకంటె హిందువు లెక్కువ పరిశ్రమజేసిరి. అరబ్బు లీశాస్త్రమును హిందువులవద్ద నేర్చికొని పాశ్చాత్యులకు నేర్పిరి. ఈశాస్త్రమున ప్రసిద్ధికెక్కిన వారనేకులు గలరు. ఆర్యభట్టు, వరాహమిహిరుడు, బ్రహ్మగుప్తుడు భాస్కరాచార్యులు ముఖ్యులు. ఆర్యభట్టు సూర్యసిద్ధాంతమును గూర్చి యార్యభట్టీయమను గ్రంధమును రచించెను. భూమి గుండ్రమనియు, సూర్యునిచుట్టు తిరుగుననియు, గ్రహణములు ఛాయచే గల్గుననియు నార్యభట్టు ౫వ శతాబ్దమున వ్రాసెను. అవంతి కాపురస్థుడగు వరాహమిహిరుడు నారవ శతాబ్దమున బృహత్సంహిత యను గ్రంధమును వ్రాసెను. దీని యందు హిందూదేశమందు నప్పుడున్న జ్ఞానమంతయు నిమిడియుండెను. ఇతడు రెండవ చంద్రగుప్తుని యాస్థానమున నుండినట్లు ప్రతీతి. బ్రహ్మగుప్తుడు బ్రహ్మసిద్ధాంతమను గణితశాస్త్రమును వ్రాసెను. భాస్కరాచార్యులు ౧౨వ శతాబ్దమున సిద్ధాంతశిరోమణి యను ఖగోళశాస్త్రమును లీలావతియను గణితశాస్త్రమును రచించెను. ఇతని యనంతరమున నీశాస్త్రముల హిందువులు కృషిచేయలేదు.



ఆయుర్వేదము.

రోగచికిత్స పద్ధతులు పాశ్చాత్యులు హిందువులనుండి గ్రహించిరి. కానిష్కు యాస్థానముననున్న చరకుడను నొక వైద్యుడు తనపేర నొక వైద్యగ్రంథమును రచించెను. ఈగ్రంథము పశ్చిమదేశముల నతివ్యాప్తి నొందెను కాని హిందువులీశాస్త్రమును దరువాత వృద్ధిచేయలేదు. సుశ్రుతమను నొక శస్త్రశాస్త్రమును సుశ్రుతుడు రచించెను. అందు శస్త్రమునకు ౧౨౭ రకముల కత్తులు జెప్పబడెను. దీనిని బట్టిజూడ శస్త్రశాస్త్రమునగూడ హిందువులు మంచికృషిచేసినటుల గనిపించుచున్నది.

న్యాయపద్ధతి.

బ్రాహ్మణమతోద్ధరణచే రాజ్యము మనుధర్మశాస్త్ర ప్రకారము జరుపబడెను. వర్ణభేదము స్థిరపడి వర్ణమునకును వర్ణమునకును బూర్వపుసంబంధము పోయెను. వర్ణమునకు ప్రత్యేకవృత్తు లేర్పాటయ్యెను. న్యాయశాస్త్ర మేర్పాటగుటచే నాస్తి విషయమగు దావాలు శాస్త్రప్రకారము దీర్పజెప్పబడెను. కాని నేరముల విచారణ విషయమున శాస్త్రమే న్యాయముగా లేకుండెను. వర్ణములనుబట్టి నేరములకు శిక్షయుండెను. బ్రాహ్మణుడు సాధారణముగా శిక్షార్హుడుగాడు. జరిమానా, కొరడాదెబ్బలు, అంగవికలము గావించుట, ఊరువెడలగొట్టుట, ప్రాణముదీయుట నేరములకు శిక్షలు. ఖయిదులేదు. గుప్తరాజ్యమున ఘోరనేరములు లేవుగాని యారాజ్యానంతరమున దేశమరాజకమగుటచే ఘోరనేరములు మెండయ్యెను.

ఈకాలపువృత్తాంతమునకు బురాణములు, ఫాహియాను, హానిత్సాంగు, గ్రీకు రాయబారుల గ్రంథము లాధారములు.



## 15-వ అధ్యాయము.

### చీనాదేశపుయాత్రికులు;— ఫాహియాను, హావునిత్సాంగు.

ఫాహియాను, క్రీ. శ. 400

క్రీ. శె. 400 సంవత్సరమున బుద్ధుడు పుట్టినచోటును పెట్టినచోటును జూచుటకు, బుద్ధునిగూర్చి దేశములో ప్రచారముగానున్న కథలను బోగుచేయుటకును, మతగ్రంథముల సంపాదించుటకును హిందూదేశమునకు ఫాహియానువచ్చెను. ఇతడుతనయాత్రనుగూర్చి పుస్తకమొకటి వ్రాసెను. దానిలో రాజకీయ విషయము లంతగా లేవుగాని జనుల స్థితిగతులనుగూర్చి కొద్దిగా వ్రాసియున్నాడు. ఇతడు కాబూలుమీదుగా హిందూదేశమునకువచ్చి పంజాబు, ఉత్తరహిందూస్థానమంతయు దిరిగి యోడనెక్కి సింహళద్వీపమునకు బోయెను. తానుదిరిగిన దేశముల జంతుహింసలేదనియు, చండాలురుదప్ప నెవ్వరును వెల్లుల్లిగాని నీరుల్లిగాని దినరనియు నతడుజెప్పెను. రాజ్యపరిపాలన సౌమ్యముగా నుండెననియు రహదారుల జోరభయము లేదనియు వ్రాసెను. నేరస్థులకు జరిమానా విధింపబడెను. తిరుగుబాటు జేసినవారిని జంపుటలేదుగాని కాలుసేతుల ఖండించెడు నాచారముండెను; రాజుయొక్కరాబడి ముఖ్యముగా



భూమిపన్ను. దేశమునంతను విహారము లుండెను. బౌద్ధసన్యాసులకు గావలసిన సామగ్రిల రాజులిచ్చుచుండిరి. మనుజులకును జంతువులకును జికిత్సాలయము లుండెను. ఇచ్చట చికిత్స నుచితముగ జేసెడివారు. బౌద్ధమతమునకు రాజావలంబన తగ్గుటచే బ్రాహ్మణమతము వృద్ధినొంది బౌద్ధమతము క్షీణింప నారంభించెను. బౌద్ధపుణ్యస్థలములు బాగుచేయువారు లేక పాడగుచుండెను. కొన్నిస్థలములు జనశూన్యములుగను మరికొన్ని యరణ్యమయములుగను నయ్యెను.

హావునిత్సాంగు, క్రీ. శ. 630

ఇతడు క్రీ. వె. 630 లో హిందూదేశమునకువచ్చి 15 సంవత్సరము లీదేశములో నుండెను. ఫాహియాను గ్రంథముకంటె నితని గ్రంథమందు హిందూదేశమునుగూర్చినసమాచారము విస్తారముగ దెలియుచున్నది. ఇతడుగూడ కాబూలుమార్గమున హిందూదేశమునకువచ్చి పంజాబు, కాశ్మీరము, ఉత్తరహిందూస్థానముల బ్రతిపట్టణముజూచి ఒరిస్సా, కళింగ, దక్కనుల ద్వారా దక్షిణహిందూస్థానమునకు బోయి నచ్చటిపట్టణములజూచి పశ్చిమతీరము వెంబడిబయలుదేరి మహారాష్ట్రము, గుజరాతు, రాజపుత్రస్థానము, సింధుదేశముల జూచెను. ఇతడు వచ్చిన కాలమున బౌద్ధమతము క్షీణించి బ్రాహ్మణమతము వృద్ధిలో నుండెను. కాశ్మీరము, ఒరిస్సా, దక్షిణహిందూస్థానములదప్ప దక్కనదేశమంతయు బ్రాహ్మణ మతానుసారులే. హర్షుడు బ్రాహ్మణబౌద్ధమతముల సరిగాజూచెను గాని యతనితండ్రి బౌద్ధులజంపి వారివిహారముల నాశనముజేసెను. హర్షునిరాజ్య

విషయమై హ్యూనిత్సాంగు గ్రంథమున గలదు. హర్షుడు తన రాజ్యమున దిరిగి నేరస్థులశిక్షించుచు సన్మార్గులకు బహుమానము లిచ్చుచుండెను. హర్షుని పన్నుక్రింద నేలరాబడిలో నారవవంతు తీసికొనెను. పన్నులు బహుస్వల్పముగా నుండెను; జనులు సౌఖ్యజీవనము జేయుచుండిరి. నేరము విస్తారముగ లేదుగాని రహదారుల బూర్వమువలె జోరభయములు లేకుండలేవు. ఖయిదు, ప్రాణము తీయుట, కాళ్లు చేతులు నరకుట శిక్షలు. నేరస్థాపనకు సాక్ష్యముగాక అగ్ని, జల, విష పరీక్షలు జేసెడివారు. విద్య ప్రభుత్వాధీనమున నుండెనుగాన వృద్ధిలో నుండెను. హర్షుడు పైకి బౌద్ధుడేగాని హిందూదైవములగూడ గొల్చుచుండెను. హర్షుడు క్రీ. వె. 644 లో హ్యూనిత్సాంగు యొక్క మతప్రచార సంభాషణను వినుట కొకగొప్పసభను జరిపించెను. హ్యూనిత్సాంగుని హర్షుడు చాలమర్యాదజేసి యతనిని వెంటబెట్టుకొని తనరాజ్యమంతయు దిరిగెను. హర్షుడు ప్రతియైదు సంవత్సరములకును తనభాగ్యమంతయు బీదలకు బంచిపెట్టుచుండెనట. హ్యూనిత్సాంగు 650 బౌద్ధమతగ్రంథములదీసికొని చీనాకువెళ్ళిపోయెను.



## 16-వ అధ్యాయము.

### రాజపుత్రయుగము—

### ఉత్తరహిందూస్థానమున చిన్నరాష్ట్రములు.

అఫ్ఘనిస్థాన మిప్పుడు హిందూదేశమున జేరిలేదుగాని



**కాబూలు, పంజాబు.** హిందూయుగమున గాంధారమువేరుగలిగి హిందూదేశభాగమై యుండెను. హిందూదేశరక్షణమునకు పశ్చిమోత్తర పర్వతములందున్న కనుమలు భంగకరములుగాన వాటినిగాపాడుట కవతలనున్న దేశము నాక్రమించు టవసరమయ్యెను. హిందూదేశమునకు దండెత్తివచ్చిన ప్రతివారును ముందుకాబూలు నాక్రమించిగాని హిందూదేశమునకురాలేదు. 9 వ శతాబ్దమునాటికి కాబూలు పంజాబులు కల్లారను బ్రాహ్మణునిచే స్థాపింపబడిన హిందూ షాహియా వంశస్థులచే బాలింపబడుచుండెను. ఈరాజులలో పేరుగాంచినవారు జయపాలుడు వానికుమారు డనంగపాలుడు. క్రీ. వె. 979 లో గజినీరాజగు సిబక్తజినుపయికి జయపాలుడు దాడివెడలెనుగాని యోడిపోయెను. అందుచే సిబక్తజిను 988 లో జయపాలునిమీదకు యుద్ధమునకురాగా హిందూరాజులందరు నేకమయిరిగాని సిబక్తజిను వారినోడించి పెషావరువరకునున్న రాజ్యమును లాగుకొనెను. క్రీ. వె. 1001 లో సిబక్తజిను కుమారుడగు మహమ్మదుగజనీచే నోడిపోయి జయపాలు డగ్నిప్రవేశము జేసెను. క్రీ. వె. 1009 లో జయపాలునికుమారుడగు ననంగపాలుడు మహమ్మదుగజనీ చేనోడింపబడెను. ఈవంశము త్రిలోచనపాలు డనువానితో నంతమై రాజ్యము మహమ్మదీయుల పాలయ్యెను.

**సింధురాష్ట్రము.** సింధునదికి పశ్చిమముననున్న బెలుచిస్థాన మీరోజులలోకన్న నెక్కువ ఫలవంతముగా నుండెడిది. సింధు బెలుచిస్థానముల ప్రజ లొకతెగకే

సంబంధించినటుల గనుపించుచున్నది. రాయసిహారులు మనకు తెలిసినంతవరకు మొదటి రాజులు. వీరు రాజపుత్రులు. వీరికి మూలపురుషుడు దివాజీయనునాతడు. ఇతడు రాజ్యమును క్రీ. శ. 500 సంవత్సరమున సంపాదించెను. వీరుబౌద్ధులు. ఈవంశమున నైదుగురురాజులు రాజ్యముచేసిరి. మూడునాల్గవరాజు లరబ్బులచే జయింపబడి చంపబడెను. క్రీ. శ. 631 లో చాకనను బ్రాహ్మణుడు రాజ్యమును సంపాదించి యరబ్బుల పారదోలెను. ఇతనికుమారుడరబ్బులతో మొదట స్నేహముగానుండి వారిసహాయమును సంపాదించెను. కాని వారి యోడలను బట్టుకొనుటచే వారియాగ్రహమునకు బాత్రుడయ్యెను. ఇతనిని యుద్ధమునజంపి మహమ్మదుకాశీ మను నతడు సింధురాజ్యమును దనవశము జేసికొనెను.

మగధ.

హర్షుని యనంతరము మగధరాజ్యము క్షీణించెను. క్రీ. శ. 670 లో నీరాజ్యము గుప్తవంశరాజుల వశమయ్యెను. క్రీ. శ. 825 వరకు వేరునకుమాత్రము చక్రవర్తి బిరుదముతో వీరురాజ్యము చేసిరి. తరువాత నిది మహమ్మదీయుల పాలయ్యెను.

కనోజి లేక కన్యాకుబ్జము.

పురాణయుగము నాటికిది కన్యాకుబ్జమను పేరుగలిగి దక్షిణపాంచాలుర రాజధానియై యుండెను. దీనినిగురించి మొదటజెప్పినవాడు ఫాహియాను. అది యప్పుడు సామాన్యపట్టణముగానుండి తరువాత బ్రసిద్ధికెక్కెను. హర్షుడు దీనికిరాజయినప్పుడు దీనిప్రసిద్ధి హెచ్చెను. హర్షునిగూర్చి యిదివరకె జెప్పబడెను. హర్షుని



యనంతరము యశోవర్మయను నాతడు రాజ్యమునకు వచ్చెను. ఇతడెవరో రాజ్యమునకెట్లువచ్చెనో దెలియదుగాని యితడుగొప్ప పరాక్రమవంతుడు. ఇతడు వంగ బిహారముల జయించి ఖ్యాతివడసెను. ఇతనికీర్తి సహించలేక కాశ్మీరపురాజయిన లలితాదిత్యుడితనినోడించి చంపివేసెను. ఇతని తరువాత యుద్ధులనువారు రాజ్యమునకు వచ్చిరి. వీరు పేరుప్రతిష్టలు లేకుండ రాజ్యముచేసిరి. కడపటిరాజగు చక్రయుద్ధుని 810 లో పరిహారరాజపుత్రుడగు నాగభట్టుజయించి రాజ్యమును వశపరచుకొనెను. ఈవంశమువారు 200 సంవత్సరములు రాజ్యముచేసిరి. నాగభట్టు మనుమడగు మిహిరభోజుడు 840–850 వరకు రాజ్యముచేసి రాజపుత్రస్థానము, సంయుక్తరాష్ట్రములు, సట్లెజినదికి దూర్పుననున్న పాంచాలము, గ్వాలియరులను బరిపాలించెను. గుజరాతు మాళ్వారాజులితనికి లోబడియుండిరి. ఇతని కుమారుడగు మహేంద్రపాలుడు 908 వరకును రాజ్యముచేసి తండ్రివలెనే పరాక్రమవంతుడని కీర్తివడసెను. వీనితరువాతవారు దుర్బలులగుటచే రాజ్యము క్రమముగా క్షీణించెను. అనంగపాలుని రాజ్యకాలమున ఘుర్వారు రాజపుత్రుడగు నొకడీరాజ్యమును జయించుటచే ననంగపాలుడు డిల్లీకి బారిపోయి తోమరవంశమును స్థాపించెను.

క్రీ. శ. 1090 లో ఘుర్వాగు రాజపుత్రనాయకుడగు చంద్రదేవుడు రాజయ్యెను. ఈవంశమువారు నూరుసంవత్సరములు రాజ్యముచేసిరి. వీరిలో ప్రసిద్ధికెక్కినవాడు జయచంద్రుడు. పృథ్వీరాజితనికి విరోధియగుటచే తనకూతురు [illegible]

రాజును వలచినను నతనిని బిలువక నితరరాజుల నామెస్వయంవరమునకు బిలిచి గుమ్మమువద్ద పృథ్వీరాజుబొమ్మను కాపలాగానుంచెను. కాని యతనికూతురు పృథ్వీరాజునువలచినదగుటచే నాబొమ్మకే పుష్పమాలవేసెను. అంతట నచ్చటనేమారువేషముతోనున్న పృథ్వీరాజు యామెనెత్తుకొని పారిపోయెను. ఇందువలన జయచంద్రునికిని పృథ్వీరాజునకును తీరనిద్వేషముదయించెను. రాజపుత్రులందరు పృథ్వీరాజు నాధిపత్యముక్రింద మహమ్మదుఘోరీని 1192 లో నెదిరించినప్పుడు జయచంద్రుడు దటస్థుడుగా నూరకుండెను. దీనికిఫలిత మితడనుభవించెను. మహమ్మదుఘోరీ మరుచటిసంవత్సరమున కనోజిని జయించి యాక్రమించుకొనెను. జయచంద్రుని సంతతివారు రాజపుత్రస్థానమునకు బోయి యచట నొక చిన్నరాజ్యము నేర్పాటు జేసికొనిరి. అదియిప్పుడు జాడ్పూరని పిలువబడుచున్నది.

డిల్లీ.

1090 లో అనంగపాలు డీరాజ్యమును స్థాపించెను. ఈ వంశమువారు తోమరులమని పిలుచుకొనిరి. అజ్మీరురాజయిన విజ్జలదేవు డనంగపాలుని జయించి డిల్లీని లాగికొని యతనికూతురును తనకొడుకైన సోమేశ్వరునికిచ్చి వివాహముచేసెను. సోమేశ్వరుని కొడుకయిన పృథ్వీరాజు డిల్లీ యాజ్మీరులకు ప్రభువయ్యెను. ఇత డుత్తరహిందూస్థానమునన్నున్న రాజులలో నగ్రగణ్యుడై మొదట మహమ్మదుఘోరీని 1191 లో నోడించి 1192 లో నతనిచే థనేశ్వరమునొద్ద నోడిపోయి హతుడయ్యెను. డిల్లీ ఘోరీ వశమయ్యెను.



వంగ, బీహారములు.

హిందూయుగమునాటికీదేశపాలనము పాలు రాజపుత్రులక్రిందనుండెను. వీరు క్రీ.వ. 800–1160 వరకు రాజ్యము జేసిరి. వీరిలో ప్రసిద్ధికెక్కినవాడు మూడవరాజగు దేవపాలుడు. ఇతడు ఒరిస్సాను జయించి దనరాజ్యమున గలుపుకొనెను. 1060 లో పాలువంశము నశించి సేనులు రాజులయిరి. లక్ష్మణసేనుని కాలమున 1193 లో బిహారును, 1194 లో వంగదేశమును మహమ్మదుకిల్జీ జయించెను. వంగదేశమున నింతవరకు బౌద్ధమతము పోషింపబడుచుండెను. మహమ్మదీయుల యాక్రమణతో నీనివాసముగూడ బౌద్ధులకు బోయెను.

బందలఖండు.

ఇదియే చెడీరాజ్యమనిగూడ బిలువబడుచుండెను. హిందూయుగమునాటికి కాలుచూరురాజపుత్రులు దీనికి రాజులు. వీరినామముల చివరను దేవుడను మాట యుండెను. వీరిలో ప్రఖ్యాతపురుషుడు గంగయ్యదేవుడు. ఇతడు మాళ్వరాజయిన భోజుని జయించెను. కాని చాండలురాజయిన కీర్తివర్మచే నోడిపోయెను. కలుచూరివంశము నశించి బఘేలులు రాజులయిరి. వీరినుండియే భాగలఖండనియు బందలఖండనియు నీదేశమునకు పేరువచ్చెను.

అజ్మీరు.

చోహాను రాజపుత్రులిచ్చట బాలించిరి. 12-వ శతాబ్దమున అజయుడను రాజుచే నొకకోట గట్టబడి యాదేశ మజ్మీరయ్యెను. వీరిలో ప్రసిద్ధపురుషులు విజ్జలదేవుడు, పృథ్వీరాజు. వీరినిగురించి డిల్లీవృత్తాంతమున జెప్పబడియెను.

గుజరాతు.

గుజరాతు దేశము ఫలవంతమైనది. అది యుత్తరమున నుండి దక్షిణమునకు బోవుమార్గమున నున్నది. అందుచే నీరాజ్యము స్థిరముగా నొకనిక్రిందనుండక ననేకముంది పాలయినది. ఎనిమిదివంశముల రాజులు గుజరాతును బాలించిరి. యాదవులు, హూణులు, సిథియనులు, ఘూర్జరులు, తురుష్కులు నీదేశముగుండ బోవుచు గొన్నికుటుంబముల నీదేశమున విడచిరి. అందుచే గుజరాతున పలుచిన్నరాజ్యములుండుటయు బ్రజలు మిశ్రమజాతివారగుటయు దటస్థించినది. గుజరాతనుపేరు ఘూర్జరతెగవారినుండి వచ్చెను. వీరగ్నికుల రాజపుత్రులు. ఈవంశమున మొదటివాడు దద్దుడు. ఇతడు క్రీ.శ. 430 ప్రాంతమున రాజ్యముజేసెను. వానితరువాత నెనమండ్గురు రాజపుత్రులు రాజ్యముజేసిరి. 7 వ శతాబ్దమున బాదమిచాళుక్యులు వీరినోడించి దక్షిణభాగమును లాగికొనిరి. రాష్ట్రకూటుల రాజగు గోవిందుడు 704 లో ఘూర్జరులను జయించి రాజ్యమును లాగికొనెను.

రాష్ట్రకూటులు 704-800 వరకు రాజ్యముజేసిరి. వారి యనంతరమున వల్లభులు రాజులైరి. హర్షుని కాలమున వల్లభరాజును నతనియల్లుడును నగు ధ్రువభట్టు రాజప్రతినిధిగ గుజరాతును బాలించెను. హర్షుని యనంతరము వల్లభరాజైన ధ్రువసేనుడు స్వతంత్రరాజయ్యెను. వీరు తూర్పుభాగమున రాజ్యము చేయుచుండగా చాళుక్యులు 643-733 వరకు గుజరాతులో గొన్నిభాగముల బాలించుచుండిరి. చుదశమరాజపుత్రు లొకచిన్నరాష్ట్రమును 800-1432 వరకు బాలించుచుం



డిరి. ఈరాజ్యము మహమ్మదీయుల పాలయ్యెను. గుజరాతులో నుత్తరభాగమున చవాడరాజపుత్రులు 746-905 వరకు రాజ్యముజేసిరి. పిమ్మట గుజరాతంతయు చాళుక్యుల వశమయ్యెను. ఈచాళుక్యులుగాక వఘేలచాళుక్యులనినొక తెగవారు అనిహీలవారువద్ద రాజ్యముజేసిరి. వారల్లాయుద్దీనుచే జయింపబడిరి.

కాశ్మీరము.

దీనిచరిత్రము కల్హణునిచే వ్రాయబడెను. ఈదేశమున మొదట నాగులనువారు నివసించుచుండిరి. తరువాత నార్యనులు, సిథియనులు, హూణులు, తురుష్కులు మొదలగువారొకరితరువాత నొకరీదేశము నాక్రమించిరి. ఈదేశమును కర్కోటులు 607-855 వరకును, 855-1003 వరకు ఉత్పలులును, లోహరులు 1003-1128 వరకును పాలించిరి. కర్కోటులలో లలితాదిత్యుడును, ఉత్పలులలో నవంతివర్మయు ప్రసిద్ధపురుషులు. 1339 లో మహమ్మదీయులీదేశమును జయించిరి.

## 17-వ అధ్యాయము.

దక్కనురాజ్యము:- పూర్వచాళుక్యులు, రాష్ట్రకూటులు, కడపటిచాళుక్యులు, యాదవులు, ఆంధ్రులు.

దక్కను.

దక్కననగా దక్షిణదేశము. నర్మదా కృష్ణానదుల మధ్యదేశమునకు దక్కనని పేరు. ఇది రెండుదేశములుగా భాగింపవచ్చును. మహారాష్ట్రము, త్రిలింగదేశము. రాష్ట్రకూటులు, ఆంధ్రులు నీదేశమున నుండిరి. ఈదేశము

పర్వతములచే రక్షితమగుటచేత నుత్తరపశ్చిమములనుండి బాధలులేవు. ఎత్తైనస్థలమగుటచే ప్రిజనీదేశమునుండి ఉత్తరమునకును దక్షిణమునకును బోయి నివాసములేర్పరచుకొనిరి. మూడవ శతాబ్దమువరకు దక్కను పడమటిశాత్రాపులక్రిందను నాంధ్రులక్రిందనునుండెను.

ఆంధ్రులార్యులకును ద్రావిడులకును బుట్టినవారు.

**ఆంధ్రులు.** వీరు మొదటనుండియు పరాక్రమవంతులు. మౌర్యులకాలమున మగధసైన్యములతరువాత నాంధ్రసైన్యములే పెద్దవి. అశోకునితరువాత నాంధ్రులుస్వతంత్రులుగ దక్కను పాలించిరి. రెండవరాజగు కృష్ణునికాలమున నాంధ్రరాజ్యము పశ్చిమ సముద్రమునుండి తూర్పు సముద్రమువరకు వ్యాపించెను. అప్పుడు రాజధాని నాశిక. క్రీ.పూ. 27 వరకు యాంధ్రులగూర్చి చరిత్రము లేదు. కాని యాసంవత్సరమున మగధరాజ్యమును కణ్వరాజులనుండి జయించిరి. ఈ యాంధ్రరాజులు శాలివాహన వంశమువారు. శాతకర్ణులని బిరుదువహించిరి. శాలివాహనశక మొకటి యారంభమయ్యెను. 23 వ రాజగు విలివాయకురుడు పశ్చిమశాత్రాపగు నహపానుని జయించి యతనినిజంపి, చాస్తనుడనువానిని రాజప్రతినిధిగనుంచెను. వీనికుమారుడగు రెండవ పులుమాయిని పశ్చిమశాత్రాపగు రుద్రదమను డోడించెను కాని పులిమాయి తన యల్లుడగుటచే రాజ్యము లాగికొనలేదు. కొల్హాపురమునుండి పైఠానునకు పులిమాయి తనరాజధానిని మార్చెను. మిగిలిన యాంధ్రరాజులలో యజ్ఞశ్రీ యనువాడు ప్రసిద్ధుడు.



ఇతడు శాత్రాపులనుండి పోయిన దేశమును దిరుగసంపాదించెను. ఈయాంధ్రులకాలమున దేశము సుభిక్షముగాను ధనవంతముగాను నుండెను. వర్తకము బాగుగా జరుగుచుండెను. పైఠాను, నాశిక, కల్యాణి, బనవాసి యారోజులలో వర్తకమునకు ప్రసిద్ధికెక్కెను. ఆరాజుల కాలములలో వర్తకసంఘములు బ్యాంకులుగూడ నుండెను. కోస్తావర్తక ముండుటచే నోడలు జేయుట నడుపుట యాంధ్రులకు తెలియును. ఆంధ్రులు పల్లవులచే జయింపబడిరి.

చాళుక్యులు లేక సోలంగిరాజు లగ్నికులరాజపుత్రులు.

**చాళుక్యులు.** ఘూర్జరవంశమువారై యుందురు. కాని వీరుచంద్రవంశరాజులమని చెప్పుకొనిరి. వీరు విష్ణుభక్తులు, జెండాచిహ్న మడవిపంది. వీరితర మతములనుగూడ సహించిరి. వీరు నాలుగుతెగలుగ రాజ్యముజేసిరి. బాదమి రాజధానిగా రాజ్యముజేసిన పశ్చిమచాళుక్యులు, కల్యాణిచాళుక్యులు వెంగిచాళుక్యులు గుజరాతుచాళుక్యులు. వీరిలో పశ్చిమచాళుక్యులు మూలవంశమువారు. పశ్చిమచాళుక్యులు క్రీ.వె. 550-754 వరకు రాజ్యముచేసిరి. వీరిలో మొదటివాడు జయసింహుడు. ఇతడు రాష్ట్రకూటులను జయించి బీజపూరువద్ద చిన్నరాజ్యమును స్థాపించెను.

బాదమి రాజధానిగా జేసినవాడు పులికేశుడు I. ఇతడశ్వమేధయాగము జేసెను. పల్లవులను జయించెను. ఈవంశమున ప్రసిద్ధికెక్కినవారు రెండవపులికేశుడును నతనిపుత్రుడు విక్రమాదిత్యుడును. పులికేశుడు హర్షవర్ధనుని జయించెను.

దక్షిణమున నితడు కాంచిపల్లవులనుజయించి తనతమ్ముడగు విష్ణువర్ధనుని రాజప్రతినిధిగా జేసెను. కాంచిపల్లవులతో బోరాడెనుగాని యెవరుజయించిరో తెలియదు. పల్లవులుమాత్రము సంధిగొడంబడిరి. తమ్ములగు విష్ణువర్ధనుని వెంగిలోను, జయసింహునినాశికలోను, పెద్దకుమారుడగుచంద్రాదిత్యుని సవంతవాడిలోను, నింకొకకుమారుడగు నాదిత్యవర్మను కృష్ణతుంగభద్రల మధ్యదేశములోను రాజప్రతినిధులుగా జేసెను. ఇతని యనంతరము వీరు స్వతంత్రులయిరి. ఇతడు క్రీ. వె. 642 లో కంచిరాజగు నరసింహవర్మచే యుద్ధమున నోడింపబడి చనిపోయెను. ఇతని కుమారుడగు విక్రమాదిత్యుడు కంచిపల్లవులను జయించి వారిరాజ్యము నాక్రమించుకొనెను. పాండ్య, చోళ, కేరళరాజ్యములనుగూడ జయించెను. ఆఖరురాజగు కీర్తివర్మ దక్షిణదేశమున పల్లవులతో యుద్ధముననుండ రాష్ట్రకూటనాయకుడగు దంతిదుర్గుడు మహారాష్ట్రమునాక్రమించి తరువాత కీర్తివర్మ నోడించెను. కీర్తివర్మ యుద్ధమున జనిపోయెను. క్రీ.వె. 754 లో చాళుక్యరాజ్యము నశించెను.

తూర్పుచాళుక్యులు వెంగిదేశమున రాజ్యముజేసిరి. గోదావరి కృష్ణానదులకు మధ్యను సముద్రమునకును తూర్పుకనుమలకునుమధ్యనున్న దేశము వెంగిదేశమనబడెను. దీనిరాజధాని వెంగి. దీనిని వేగిదేశమనికూడ నందురు. 16 వ రాజగు రాజమహేంద్రుడు రాజధానిని రాజమహేంద్రవరమునకు మార్చెను. ఈవంశపురాజులు గంగరాజులతోను, పల్లవులతోను, రాష్ట్రకూటులతోను యుద్ధమున కాలముగడపిరి. వీర



నేక దేవాలయములను గట్టించిరి. ఈవంశమున గడపటిరాజులు చోళవంశస్త్రీలను వివాహమాడుటచే వీరు చోళవంశమువారుగూడనై, చివరకు చోళరాజ్యము నాక్రమించిరి. వీరు 12వ శతాబ్దమువరకు రాజ్యముజేసిరి. చాళుక్యుల రాజ్యచిహ్నములు (1) తెల్లనిగొడుగు, (2) శంఖము, (3) ఢంకానౌబతులు, (4) అడవిపందితల, (5) బంగారుదండము, (6) గంగాయమునల విగ్రహములు, (7) నెమలియీకల విసనకర్రలు రెండు.

రాష్ట్రకూటులు.

వీరు రహతూరు రాజపుత్రులనికూడ పిలువబడుచుండిరి. ఇప్పుడు మహారాష్ట్రమను దేశమున వీరుండెడివారు. ఆ పేరుగూడ వీరినుండియె వచ్చినది. వీరు మొదట చిన్నసంస్థానాధిపతులుగ నుండి మొదట నాంధ్రులక్రిందను, తరువాత పశ్చిమపల్లవులక్రిందను నుండిరి. పశ్చిమశాత్రపులను గుప్తులు జయించినప్పుడు వీరు స్వతంత్రులయిరి. క్రీ. వె. 550 లో చాళుక్యులు ప్రభువులయిరి. వారిక్రింద రాష్ట్రకూటులు చాలకాలముండిరి. చాళుక్యులు పల్లవులతో యుద్ధములవలన బలహీనులగుటచే దంతిదుర్గుడను రాష్ట్రకూటనాయకుడొకడారాజ్యము నాక్రమించి, చాళుక్యరాజగు కీర్తివర్మనోడించి యాతనిరాజ్యమును లాగికొనెను. వీరు మయూరఖండు రాజధానిగ 219 సంవత్సరములు క్రీ. వె. 754-973 వరకు రాజ్యముజేసిరి. వీరు యాదవవంశజులమని చెప్పుకొనిరి. వీరు విష్ణుభక్తులు కాని వీరిలో శివభక్తులుగూడ గలరు. వీరిధ్వజముమీద గరుడవిగ్రహముండెను. వీరి రాజ్య

చిహ్నములు పాలిధ్వజము, మూఁడురాజఛత్రములు, శంఖము, గరుడటెక్కెము, గంగాయమునల విగ్రహములు. వీరి కాలమున బ్రాహ్మణమతము ప్రబలెను. వీరనేక దేవాలయములు నిర్మించిరి. పండ్రెండుగురు రాష్ట్రకూటరాజులు రాజ్యమేలిరి. దంతిదుర్గుఁడు ఎల్లోరావద్ద కైలాసదేవాలయము నిర్మించెను. ఇది దేవతలచే గట్టఁబడెనని ప్రజల నమ్మకము. ఈరాజులలో మూఁడవ గోవిందుఁడు ప్రసిద్ధపురుషుఁడు. ఇతఁడు తనపైకి దండెత్తివచ్చిన పండ్రెండుగురు రాజుల నోడించెను. ఖయిదులో నున్న గంగరాజును వదలెను, కాని యతఁడు తిరుగఁబడుటచే నతనిని దిరుగఖయిదీగా బట్టుకొనెను. తనరాజ్యమునశాంతిస్థాపన జేసి పెద్దసైన్యమునుగూర్చికొని మాళవదేశమును జయించెను. తనతమ్ముఁడగు నింద్రుని గుజరాతులో లాటదేశమునకు పాలకునిగా నియమించెను. గోవిందునియనంతర మింద్రుఁడు స్వతంత్రరాజయ్యెను. గోవిందుఁడు దక్షిణమున కంచిజయించి యారాజులను కప్పముగట్ట నియమించెను. ఇతని యధికారమునకు పశ్చిమతూర్పు కనుమల మధ్యను, వింధ్య తుంగభద్రానదులకు మధ్యను నున్న దేశమువారు లోబడియుండిరి. కడపటిరాజగు కక్కలుఁడు క్రీ.వ. 928 లో చాళుక్యరాజగు తైల్లప్పచే నోడింపబడి రాజ్యమును గోలుపోయెను.

కళ్యాణి చాళుక్యులు.

ఈరాజులు క్రీ.వ. 978-1190 వరకు గళ్యాణిరాజధానిగా నేలిరి. ఈవంశపురాజులు పదునొకండుగురు రాజ్యముచేసిరి. వీరు పడమటి చాళుక్యవంశమునకు జెందినవారు. వీరి మొదటి రాజధాని



మాల్ఖేడయి యుండవచ్చును గాని మొదటి సోమేశ్వరుని కాలమున రాజధాని కళ్యాణికి మార్చబడెను. వీరి రాజరికమున రాణులెక్కువ స్వతంత్రముగానుండి రాజ్యభాగముల బరిపాలించిరి. అక్కదేవి, మైలాలదేవి యనువారు ప్రసిద్ధులు. అందులో యక్కదేవి రాజ్యమంతయు బాలించి యుద్ధమును గూడ జేసెను. ఈరాజులలో తైలప్పయనువాఁడు రాష్ట్రకూటరాజగు కక్కలునిజయించి రాజ్యమును బాలించెను. ఇతనికాలమున రాజ్యము వృద్ధినొందెను. మైసూరున నుత్తరభాగమున నీతనిరాజ్యముండెను. కుంతలరాజ్యమని పిలువబడెడు కొంకణదేశముగూడ నీతని యధికారము నంగీకరించెను. తైలప్ప గుజరాతుమీదికి దండెత్తి యోడిపోయెను, మాళవదేశమునగూడ నట్లేజరిగెను గాని మాళవదేశపురాజు తన సేనానాయకుని మాటవినక తైలప్పమీదకుదాడివెడలుటచే తైలప్పనాతని నోడించి రాజ్యము నాక్రమించుకొనెను. నాలవరాజగు జయసింహుఁడు గొప్పవీరుఁడు. యాదవ కదంబరాజు లీతనికి సామంతులుగా నుండిరి. చోళ కొంకణరాజుల నీతఁడు జయించెను. క్రీ.వ. 1050 లో సోమేశ్వరుఁడు రాజయ్యెను. ఇతఁడు కూడ చోళరాజును జయించెను. ఇతనికుమారుఁడు విక్రమాంకుఁడీరాజులలో నెల్ల ప్రసిద్ధిజెందినవాఁడు. ఇతనిసిగూర్చి బిల్హణుఁడనుకవి విక్రమాంకచరిత్రమును వ్రాసెను. సోమేశ్వరుని యనంతరము విక్రమాంకుని యన్న రాజ్యమునకు వచ్చి తమ్మునిజంప బ్రయత్నించెనుగాని యతఁడు దేశమువదలి దక్షిణరాజులను జయింపఁబోయెను. కొంకణదేశపురాజగు జయకే

శినినోడించి యచ్చటనుండి చేరరాజ్యమును జయించి పాల్ఘుటు లోపకుండా చోళరాజ్యము మీదకు బోయెను. చోళరాజు లొంగిపోయి తనకూతురు నితనికిచ్చి వివాహముచేసెను. చోళరాజు మృతినొందిన రాజ్యమరాజకమగుటచే విక్రమాంకుడు కంచికిబోయి తనబావమరదిని సింహాసనమెక్కించెను. ఇతడు వెళ్ళిపోగానే దేశము తిరుగుబాటుచేసి చిన్నరాజును ప్రజలు చంపివేసిరి. విక్రమాంకుడు తిరుగకంచికి వచ్చెను. అప్పుడీత నియన్న వెంగిదేశపుచాళుక్యరాజగు రాజేంద్రునితో సంధిచేసికొని వానిసహాయమున తమ్మునిపయికి దాడివెడలెను. విక్రమాంకుడన్నను జయించి కళ్యాణికిబోయి 1076 లో సింహాసనమెక్కెను. ఇతడేబది సంవత్సరములు రాజ్యమేలెను. ఇతడు శకశతాబ్దమును రద్దుచేసి తన పేర నొకశతాబ్దము నారంభించెను. ఇతనితమ్ముడు తిరుగుబాటుచేయ నతనినోడించి క్షమించెను. హోపల్యులు, పాండ్యులు, గోవా కొంకణ ప్రభువులు యుద్ధమునకురాగా వారినందర నోడించెను. ఇతసి కాలమున బిల్హణుడేగాక నితరకవీశ్వరులుగూడ నుండిరి. మితాక్షరన్యాయశాస్త్రమును వ్రాసిన విజ్ఞానేశ్వరుడొకడు. నర్మదమొదలు తుంగభద్రవరకు నితనిరాజ్యము వ్యాపించెను. కడపటిరాజగు సోమేశ్వరునికాలమున రాజ్యములో నక్కడక్కడ స్వతంత్రరాజ్యము లేర్పడెను.

యాదవులు.

యదు సంతతివారు యాదవులని మహాభారతమువలన దెలియుచున్నది. వీరార్యులలో నొకతెగవారై యుండి దక్షిణమునకుబోయి మధుర జేరి దేశము



లోనున్న యనార్యులతో గలిసిపోయిరి. కృష్ణుడీతెగవారిలో నొకవంశమువాడు. ఈవంశమువారు ద్వారకలో నుండిరి. యాదవులు రెండుచోట్ల రాజ్యమునుస్థాపించిరి. మైసూరులో నొకరును, దేవగిరిలో రెండనవారును నేలిరి. నక్కసురాజులు దేవగిరియాదవులు. గోదావరినది పుట్టినచోటు సెన్నా దేశమున వీరు నివాసమేర్పరచుకొనిరి. వీరు చిన్నరాష్ట్రాధిపతులుగ రెండువందల సంవత్సరములుండిరి. మొదట రాష్ట్రకూటుల యాజమాన్యముక్రిందను తరువాత పడమటిచాళుక్యరాజుల యాజమాన్యముక్రిందనునుండిరి. వీరిరాజధాని సెన్నా. వీరు రాష్ట్రకూటులతోను, చాళుక్యులతోను, యితర రాజపుత్రులతోను సంబంధములజేసికొనిరి. విక్రమాంకుడు మృతినొందిన తరువాత క్రీ. వె. 1187 లో యాదవరాజగు భిల్లముడు స్వతంత్రరాజయ్యెను. మూడవరాజగు సింగన్న రాజధానిని దేవగిరికి మార్చెను ఇతని కాలమునాటికి చాళుక్యరాజ్యములో చాలభాగము వీరివశమయ్యెను. ఆరవరాజగు రామచంద్రుని కాలమున మహమ్మదీయు లితనిని జయించి ధనమంతయు కొల్లగొని కప్పమేర్పాటుచేసిరి. క్రీ. వె. 1306 లో కప్పము కట్టనందున మహమ్మదీయసేనాని మల్లికాఫరు నీరాజ్యమును దిరుగజయించెను. రామచంద్రుడు గప్పముగట్టి సామంతరాజయ్యెను. ఇతని కుమారుడగు శంకరుడు తిరుగుబాటుచేయ మల్లికాఫరు తిరుగవచ్చి నాతనినోడించెను. శంకరుడు మృతుడయ్యెను. యాదవరాజ్య మంతమయ్యెను.

## 18-వ అధ్యాయము

### దక్షిణహిందూరాజ్యములు;- చోళ, పాండ్య, హోసల్య, కాకతీయులు.

**దక్షిణ హిందూదేశస్థితి.**

భూగోళప్రకారము దక్షిణహిందూదేశమును మూడు భాగములుగా భాగింపవచ్చును. ఒకటిపశ్చిమఘాటులకును సముద్రమునకును మధ్యనున్న తీరభూమియు, రెండవది తూర్పుఘాటులకును సముద్రమునకును మధ్యనుండు తీరభూమియు, మూడవ దీరెంటికిని మధ్యనున్న పీఠభూమి. తూర్పుతీరభూమిని యుత్తరకర్ణాటికనియు దక్షిణకర్ణాటికనియు రెండుభాగములుగ కావేరీనది వేరుజేయుచున్నది. కోలులు, ద్రావిడులు, నాగులు నీ దేశపు పూర్వకాపులు.

ఈదేశమునందు చిరకాలమునుండి చేర ,పాండ్య, చోళరాజ్యము లుండెను. పడమరను చేరరాజులు, పాండ్యరాజులు దక్షిణకర్ణాటమున, చోళరాజు లుత్తరకర్ణాటమున, నీమధ్యదేశమున గంగులు, కదంబులు, పల్లవులు, హోసల్యులు రాజ్యముజేసిరి. ఈదేశమున ముఖ్యభాషలు తెలుగు, కన్నడము తమిళము. చేరరాజ్యమునకు వంచి (కరూరు) రాజధాని. తిరువాన్కూరు, కొచిను, మలబారుకలిసి చేరరాజ్యమయ్యెను. ముచూరి యనునది ముఖ్య రేవుస్థలము. పాండ్యరాజ్యమునకు మధుర రాజధాని. మధుర, తిరునల్వేలి, దక్షిణతంజావూరులు కలిసి పాండ్యరాజ్యమయ్యెను. కోర్కాయి తరువాత కయాలు ముఖ్యరేవుస్థలములు. చోళరాజ్యమునకు మొదట ఉరయూరు తరువాత కంచి ముఖ్యపట్టణములు. ఉత్తరతంజావూరు, తిరుచునాపల్లి, దక్షిణార్కాటు, చంగల్పట్టు, ఉత్తరార్కాటు, నీలగిరి, కోయంబుత్తూరు జిల్లాలు చోళరాజ్యములోనివి. కావేరిపట్టణము ముఖ్యరేవుస్థలము. ఈరాజ్యములకోస్తావర్తకము రోమసామ్రాజ్య కాలమునుండియు విశేషముగా జరుగుచుండెను.



**పల్లవులు.**

ఆంధ్రుల యనంతరము దక్కనుయొక్క తూర్పుమధ్యభాగములు పల్లవు లాక్రమించిరి. వీరు పార్థియను వంశస్థులు. వీరాంధ్రులను జయించిరి తూర్పుతీరమున తమిళనాడువరకు పాండ్యరాజులనుండి జయించిరి. ఈ పల్లవులు మూడుతెగలుగా రాజ్యమేలిరి. ఉత్తరపల్లవులలో మొదటివారు క్రీ.వె. 300-550 వరకు బాదమివద్దను, రెండవతెగవారు 615 వరకు వెంగివద్దను రాజ్యముజేసిరి. వీరివద్దనుండి చాళుక్యులు రాజ్యమును లాగికొనిరి. మూడవతెగవారగు దక్షిణపల్లవులు కంచివద్ద 440 సంవత్సరములు క్రీ.వె. 300–740 వరకు రాజ్యముచేసి ప్రసిద్ధినొందిరి. అయినను వీరిగూర్చి హువనిత్సాంగు వ్రాసినదితప్ప వేరుచరిత్ర లేదు. వీరెల్లప్పుడును చాళుక్యులతో బోరుచుండినట్లు గనిపించుచున్నది. ఈరాజులలో నైదుగురి పేర్లుమాత్రము దెలియుచున్నవి. వీరిలో మహేంద్రవర్మ యనునతడనేక రాతిదేవాలయముల గట్టించెను. అందులో మహాబలిపురమునొద్ద గట్టించిన సప్తదేవాలయములు ప్రసిద్ధికెక్కినవి. ఇతని కుమారుడగు నరసింహ

వర్మ పులికేశుని జయించి యాతనినిజంపి, యాతని రాజధాని యగు వాతాపిని జాలకాలము తనయధీనమం దుంచికొనెను. ఇతని కుమారుడగు పరమేశ్వరవర్మ కాలమున పులికేశుని కుమారుడగు విక్రమాదిత్యు డితనినిజయించి తండ్రికాలమున పల్లవుల పాలయిన రాజ్యమును దిరుగ సంపాదించెను. పల్లవరాజ్యము క్రమముగా క్షీణించి క్రీ. శ. 900 లో చోళులపాలయ్యెను. ఈవంశమువారు సామంతరాజులుగ నోలంబపల్లవుల నుపేరుతో మైసూరులో హోంజూరువద్దను యితరస్థలములను 1200 వరకురాజ్యమేలిరి. తరువాతనేమైకో తెలియదు. కంచి పల్లవులు శైవులగుటచే వీరు కట్టించినవి శివాలయములు. వీరి కాలమున రచింపబడిన కీర్తనలిప్పటికిని వాడుకలోనున్నవి.

పాండ్యులు.

వీరు మధురరాజధానిగ నేలిరి. వీరు పాండవులసంతతి వారమని జెప్పుకొనిరి. పండాయి యనునొకస్త్రీ యీవంశమును స్థాపించెననియు, నామె యార్యస్త్రీయయ్యును ననాగరికరాజు నొకనిని వివాహమాడెననియు, మధురపతియను నామమున నామెపూజింపబడెననియు ప్రతీతి గలదు. పూర్వపాండ్యులు, పరపాండ్యులు నని పాండ్యరాజులు రెండువంశములుగ విభజింపబడిరి. పూర్వపాండ్యులలో నడంజిచెల్యాను ప్రసిద్ధుడు. ఇతడు చోళులను జయించెను. పరపాండ్యులు 1190-1567 వరకు రాజ్యమేలిరిగాని పేరుప్రతిష్టల సంపాదింపలేదు. వీరు చోళులతో యుద్ధముజేయుచు 10,11, 12 శతాబ్దములు వారికి లోబడియుండిరి. ఈరాజ్యమున యితరదేశములతో వర్తకము విస్తారముగా నుండెను. వర్తక



సరకులలో విలువగలవి పగడములు ముత్యములు.

చేరులు.

వీరుగూడ పురాతనరాజులు. వీరిలో ప్రసిద్ధికెక్కినవారనేకులు లేరు. చెంకుకుదువ ననురాజు తనబావమరదియగు చోళదేశపురాజు పిల్లవాడయినందున తొమ్మండ్రు చోళప్రభువులు తిరుగబడిన వారినిజయించి రాజ్యము నిలబెట్టెను. సైన్యముతో నోడమీద నొరిస్సాకు బోయి వంగరాజులనుజయించి వారిని ఖయిదీలుగా దీసికొనివచ్చెను.

చోళులు.

వీరు పూర్వచోళులనియు నుత్తరచోళులనియు రెండుతెగలుగా నుండిరి. పూర్వచోళులలో కరికాలచోళుడు మనకు దెలిసినవారిలో మొదటివాడు. ఇతడు సింహాసనమెక్కిన వెంటనే పాండ్యచోళరాజు లెత్తివచ్చిన వారినోడించెను. ఇతడు కావేరినదికి గట్టులబోయించి దేశమునకు నీటిసదుపాయముచేసి వ్యవసాయమును బాగుపరచెను. ఈతనికాలమున రాజ్యము సంపదతో తులదూగుచుండెను. నాలవరాజుతో వంశమంతరించెను. తిరుగ 880 వరకు వీరిని గురించి యేమియుదెలియదు. ఆసంవత్సరమున చోళప్రభునైన యాదిత్యుడు పల్లవరాజయిన నపరాజితునోడించి చోళరాజ్యమును దిరుగ సంపాదించెను. ఇతనివంశమువారే యుత్తరచోళులు. వీరిలో పదవరాజగు రాజరాజు 27 సంవత్సరములు పాలించి చోళరాజ్యమును దక్షిణదేశమున ముఖ్యరాజ్యముగ జేసి ప్రసిద్ధికెక్కెను. చేరరాజుయొక్క వోడలసముదాయము నోడించుటయేగాక వెంగి, కళింగ, పాండ్య, కొడగురాజ్యములను, పశ్చిమతీరదేశమును జయించెను. తన జయసూచనార్థ

ము తంజావూరులో నొకగొప్పదేవాలయమును నిర్మించెను. ఇతనికాలముననే తంజావూరు రాజధానియయ్యెను. ఇతనికూతురు చాళుక్యరాజగు విమలాదిత్యుని వివాహమాడెను. అంతటినుండియు నీరెండు రాజవంశములు సంబంధబాంధవ్యములచే గలిసిపోయి చివరకు రెండవరాజేంద్రచోళుడీరెండురాజ్యములకు నధిపతియయ్యెను. రాజరాజదేవుని కుమారుడు మొదటి రాజేంద్రచోళుడు తండ్రి సంపాదించిన రాజ్యమును పెంచి కీర్తిఁబడసెను. బంగాళాఖాతముదాటి పెగురాజధానియగు కడారమును, బర్మాలో ననేక రేవుస్థలములను, బంగాళాఖాతమున నున్న నికోబరు, అండమాను ద్వీపములను బట్టుకొనెను. ఇతనికూతురగు అమ్మంగదేవి చాళుక్యరాజగు మొదటిరాజరాజును బెండ్లియాడెను. రాజేంద్రచోళునిమనుమడగు రెండవ రాజేంద్రచోళుడు చోళచాళుక్యరాజ్యములకధిపతియయ్యెను. చోళులుసూర్యవంశజులు. చాళుక్యులు చంద్రవంశజులగుటచే రెండువంశము లితనిలో గలిసిపోయెను. ఇతడు కళింగరాజులను జయించెను. క్రీ. వె. 1310 నుండి చోళరాజ్యము క్షీణించి చిన్నసంస్థానములయి పోలిగార్లన్న పేరుతో నాసంస్థానాధిపతులు విజయనగర సామ్రాజ్యాధిపత్యముక్రింద నుండిరి.

హొసల్యులు.

11-వ శతాబ్దము మొదలు 14-వ శతాబ్దమువరకు వీరు మైసూరులో రాజ్యముజేసిరి. ఈవంశ మూలపురుషుడు సాలుడనెడువాడు. ఈవంశస్థాపనకు చక్కని కథయొకటి గలదు. ముంజబాదులో నొకగ్రామమున యడవికి దగ్గరగా గ్రామదేవతగుడి యొకటియుండెను. ఆయ



డవిలో నొకపులియుండి మనుజులను దినుచుండుటచే బ్రజలా గుడికిబోవుట మానిరి. సాలుడొకనాడు గుడిలోనుండగా బులి వచ్చెను. ఆగుడిలోనున్న పూజారి పులినిజూచి వెరచి యచ్చటనున్న నొకయినుపగజము సాలునకిచ్చి హొయిసాలాయని యరచెను. సాలుడు పులినిజంపెను. అతనివంశమువా రంతటినుండి హొసల్యులయిరి. పూజారి ప్రజలతో జెప్పి ప్రతికుటుంబమునుండియు నొకపణమనగా నాలుగణా లితనికిచ్చునట్లేర్పాటుజేసెను. అది మరుచటి సంవత్సరము రెట్టింపయ్యెను ఆపూజారి యనుమతిని యాద్రవ్యమును సేనను సమకూర్చుటకు సాలుడుపయోగించి తనయధికారమును స్థాపించుకొని క్రిముగా నొకపట్టణమును గట్టెను. ఇదియె ద్వారసముద్రము. సాలునికూతురు చాళుక్యరాజును బెండ్లియాడెను. 1192 వరకు వీరు చాళుక్యుల యధికారమున నుండిరి. వీరు మొదట జైనులయ్యును 1170 లో హిందువులయిరి. సాలుని కుమారుడగు వినయాదిత్యుడు సామంతరాజయ్యును తనరాజ్యమును విస్తరింపజేసి 1047-1100 వరకు రాజ్యమేలెను. ఇతనికుమారుడు బిట్టిదేవుడు 1104-1141 వరకును బాలించి యనేకదేశములను జయించెను. గంగవాడిదేశమును, మైసూరులో పశ్చిమఘాటులకు దూర్పుననుపడమటనున్న దేశములను, బెల్గాము, ధార్వారులను నితడాక్రమించెను. కడపటిదేశముల రెంటికిని మూగ్రిము చాళుక్యరాజగువిక్రమాంకుని సామంతరాజుగ నుండెను. వీరబెల్లాలుడు రామానుజులవారిచే వైష్ణవమతములోనికి దీసికొనబడెను. 1172 లో హొసల్యరాజ్యము స్వతంత్ర

మయ్యెను. వీరబల్లాలుడు చాళుక్యరాజగు సోమేశ్వరుని, దేవగిరి యాదవరాజగు భిల్లమునిజయించెను. యాదవులను జయించుటవలన దక్షిణమహారాష్ట్రము కన్నడము నితనివాలయ్యెను. హొయాసల్యరాజ్య మితనికాలమున సంపూర్ణవిస్తీర్ణత నొంది యంతటినుండి క్షీణింపసాగెను. క్రమముగా జయించిన దేశము లన్నియుబోయి 1310 లో అల్లాయుద్దీను సేనానాయకుడగు మలికాఫరుచే జయింపబడి యీరాజ్యము నశించెను. హొయాసల్యు లనేక దేవాలయముల గట్టిరి. వీరికాలమున శిల్పమున బ్రసిద్ధికెక్కిన జకనాచారి యతనికుమారుడు దనకనాచారి యుండిరి. హాలబీడువద్ద దేవాలయముమీద కాతిపని దక్షిణహిందూదేశమున మొదటిస్థానము నాక్రమించుచునుగాని యీదేవాలయము పూర్తికాలేదు. ఇప్పటికిని యీకాతిపని ముక్కలు బోకుండ క్రొత్తగా జేసినట్లున్నది.

వీరు తెలుగుదేశమగు తెలింగనాలో రాజ్యముజేసిరి.

**కాకతీయులు.** ఈదేశము కృష్ణాగోదావరినదులకు మధ్యనుండెను. దీనిని ఒరంగల్లురాజ్యమని పిలుచుచుండిరి. వీరుపూజించు దేవతయగు కాకతినుండి వీరికీపేరువచ్చినది. వీరు బహుశా చాళుక్యవంశమునకు జెందియుందురు. ఈ వంశస్థాపనకు చక్కనికథ గలదు. ఈవంశమున నందుడనువాడు నందగిరియను కోటనుగట్టించి చోళరాజకూతురును వివాహమాడెను. ఒరిస్సారాజితనిని యుద్ధమున జంపెను. ఇతని భార్య గర్భవతిగానుండి హానుమకొండకు బారిపోయెను. అచట నొక బ్రాహ్మణాశ్రమమున నొకపుత్రునిగనెను. అతడా



బ్రాహ్మణునియొద్ద సకలవిద్యల నేర్చి హానుమకొండచుట్టునున్న దేశమంతయు జయించి యొకచిన్నరాజ్యమును స్థాపించెను. ఇతనిసంతతివారు రాష్ట్రకూటుల యాధిపత్యమున నాలుగువందల సంవత్సరములు రాజ్యముజేసిరి. ఈరాజులలో నొకడయిన త్రిభువనమల్లుని కుమారుడయిన ప్రోలరాజునకు నొరంగల్లువద్ద యితరలోహముల నంటించిన బంగారముజేయు శివలింగమొకటి దొరకిన దానిని తనరాజధానియగు హానుమకొండకు దీసికొనిపోవుటకు బ్రయత్నించి విఫలుడై తనరాజధానినే ఒరంగల్లునకు మార్చుకొనెను. ఇతడిట్లు ద్రవ్యవంతుడై చోళరాజునోడించి స్వతంత్రుడయ్యెను. ఇతడు కుమారుడగు రుద్రమదేవుడు తననుజంపునని జ్యోతిష్కులు చెప్పుటచే వానిని యడవిలో విడిచిపెట్టించెను. కాని యతడక్కడ జావక యొక బ్రాహ్మణపూజారిచే బెంపబడి యచ్చటిగుడిలో నుండెను. ప్రోలరాజు వేటకుబోయి దారితప్పి యీగుడికిబోయి లోనికి పోబోగా రుద్రమదేవుడు గెంటివేసెను. ఇద్దరును పెనగులాడుచుండ రుద్రమదేవుడు తండ్రినిజంపెను. ప్రోలరాజుసైన్యమువచ్చి సంగతంతయుజూచి రుద్రమదేవుని ఖయిదీగా బట్టుకొనిరిగాని యీపూజారివచ్చి రుద్రమదేవుని వృత్తాంతముజెప్పగా తమ రాజకుమారుడని గ్రహించి యీసైనికులతని నింటికి దీసికొనిపోయి రాజునుజేసిరి. రుద్రమదేవుడు తెలియకనైనను తండ్రిని జంపినందులకు విచారించి యీపాపముబోవ హానుమకొండవద్ద నొకగొప్పదేవాలయమునుగట్టించెను. ఇతడొరిస్సా యాదవరాజులను జయించెను. ఇతనికుమారుడగు గణ

పతిదేవుని కాలమున యాదవరాజోడిపోయి తనకూతురును గణపతిదేవునకిచ్చి వివాహము జేసెను. ఇంతటి నుండియు కాకతీయులు గణపతులను బిరుదువహించిరి. ఇతని యనంతర మితని భార్య రుద్రమదేవి తనకూతురుకొడుకగు ప్రతాపరుద్రుడు చిన్నవాడయినందున వానికిబదులు రాజ్యమును పాలించెను. ప్రతాపరుద్రుని కాలమున రాజ్యము విస్తరించెనుగాని 1309 లో మలిక్కాఫరు ఒరంగల్లుజయించి రాజువద్దనున్న ధనమును నగలను గుఱ్ఱములను ఏనుగులను గొనిపోయెను. రాజు కప్పముగట్టుట కొప్పుకొనెను. 1323 లో మహమ్మదు టోగ్లాకు ఒరంగల్లు జయించి రుద్రరాజును బందీగా డిల్లీ తీసికొనిపోయెను. అతడు సామంతరాజుగా పాలించుట కొప్పుకొనినమీదట టోగ్లాకతనిని విడిచిపెట్టెను. అతడోరంగల్లు వచ్చి రెండుసంవత్సరములు రాజ్యముజేసి చనిపోయెను. ఈతరువాత రాజులు బలహీనులై 1424 లో భామినిసుల్తానుచే నోడింపబడి రాజ్యమును గోలుపోయిరి. ఇంతటినుండియు కాకతీయ వంశము నశించెను.



## 19-వ అధ్యాయము.

## దక్షిణమున సాంఘిక రాజకీయ మతవిషయములు.

దక్షిణమునకును ఉత్తరమునకును రాజకీయవ్యవహారములలో నంతభేదము లేదు. పశ్చిమఘాటులచే వేరుపరుపబడిన పశ్చిమ తీరమునదప్ప నితరచోట్ల నాయాచారములు క్రమ



ముగా మార్పుజెందెను. ఇప్పటికిని తిరువాన్కూరు కొచ్చినులలో పూర్వాచారములే కొన్ని యున్నవి.

రాజ్యపరిపాలనా పద్ధతి.

ప్రతిదేశమునకు నొకరాజుండెను. రాజునకు వంశపారంపర్యపు హక్కుండెను. రాజునకు పరిపాలనలో సహాయము జేయుట కయిదుసభలుండెను. ఒకటి ప్రజాప్రతినిధులసభ, రెండవది వైద్యులసభ; వీరు దేశారోగ్యమును గమనించుచుండిరి మూడవది జ్యోతిష్కులసభ; వీరు బలులు మొదలగువాటికి మంచి ముహూర్తముల నేర్పరచుచుండిరి. నాల్గవది మతగురువులసభ మతసంబంధమైన కార్యములు జేయుట వీరివిధి. ఐదవది యుద్యోగులసభ. రాజుసింహాసనమున గూర్చుండునపుడు రాణి గూడ నతనితో గూర్చుండు వాడుకయుండెను.

ప్రభుత్వపురాబడి.

దిగుమతిపన్ను, మొటుపన్ను, నేలపన్ను, సామంతరాజులనుండి కప్పము, గజముల నమ్ముటచేవచ్చు ధనము, యడవివస్తువు లమ్ముటచేవచ్చు సొమ్ము, రాజుయొక్క రాబడి. దిగుమతిపన్నులు ప్రతి రేవుస్థలములయొద్దను వసూలుజేసెడివారు. ప్రతిరోడ్డుదగ్గరను సరిహద్దులవద్దను మొట్టుపన్ను వసూలుచేయబడెను. రాబడిలో నారవవంతు రాజునకు నేలపన్నుక్రింద నివ్వవలసియుండెను. నీరు సప్లయిజేసినందులకు నీటిపన్నుకూడ వసూలుజేసెడివారు.

వర్ణపద్ధతి.

ఉత్తరమున నున్నట్లు వర్ణపద్ధతిలేదు. రాజు ప్రజలందరికంటె పెద్ద. మతసంబంధమైన కార్యములు చేయుటయు, యుద్ధమున సైన్యమును నడుపుటయు

సతనివిధి. బ్రాహ్మణు లుత్తరమునుండివచ్చిరిగాని వారువేరుగ నుండిరి. రాజులతరువాతవ్యవసాయదారులు, వీరితరువాత గొల్లలు, చేతిపనులు చేయువారు, యుద్ధభటులు, బెస్తలు, వాకిల్ వారును నుండిరి. బానిసలు లేరు.

దుస్తులు.

వేడి దేశమున నుండుటచే బురుషులు మోకాళ్లవరకును మొలకొక గుడ్డయు తలకొక గుడ్డయు ధరించిరి. జుట్టు కత్తిరించుకొనుట లేదు. నడినెత్తిమీదనో ప్రక్కనో జుట్టుముడి యుండెను. శరీరమంతయు బట్టచేగప్పుకొనెడివారు. స్త్రీలు మొలబట్ట కాళ్లవరకు వ్రేలాడునట్లు గట్టుకొనిరి. పురుషులును స్త్రీలును నగలుధరించెడివారు. భాగ్యవంతులు బంగారునగలు, బీదలు పూసలతోను గుల్లలతోను పగడములతోను జేయబడిన నగలను ధరించిరి.

స్త్రీలయాచారములు.

స్త్రీలకు ఘోషాలేదు. బీదస్త్రీలు భర్తలతోను సోదరులతోను పనిపాటులు జేసికొనుటకు వెళ్ళెడివారు. కన్నెలను వరించి వివాహమాడు పద్ధతియుండెను. స్త్రీలను మర్యాదగాజూచుటగలదు.

భోజనము.

వరియన్నము సాధారణముగా భోజనమున నుపయోగించెడివారు. పదునారురకముల ధాన్యములుండెను. పాలు వెన్న తరుచుగ భోజనమునకు వాడెడివారు. తాటి కొబ్బరి కల్లుల త్రాగునాచారముండెను. భాగ్యవంతులు బియ్యమునుండి బాగుగతయారుచేయబడిన సువాసనగల సారా త్రాగెడివారు. వీరు పరదేశములనుండి సారా దిగుమతిచేయుట గూడకలదు.



వినోదములు.

సంగీతము, నాట్యము, సంతర్పణములు, పిగిలిపిట్టదెబ్బలాటలు మొదలగు వినోదములు వీరియిండ్లజరుగుచుండెను. చిలుకలబెంచుట, ఉయ్యాలలూగుట నాడువారిలో నాచారము. పెద్దకుటుంబములలో బాగుగ పాడగలట్టియు నాట్యముజేయగలట్టియు నాడువారుండెడివారు.

సంగీతమున దాక్షిణాత్యులు మంచిపరిశ్రమ జేసిరి. పిల్లనగ్రోవి, సన్నాయి, మద్దిల మొదలగు ననేకసాధనము లుండెను. నాట్యశాస్త్రముండెను. నాటకములాడు నాచారము గూడ గలదు. అన్నిరకముల నాటకములుండెను. భోగము వారు నటులుగ నుండెడివారు. చిత్రరువులు వ్రాయుట, విగ్రహములు చెక్కుటగూడ గలదుగాని నిలువయుండు వస్తువులమీద నీపని జరుగకుండుటచే నవినశించినవి. బీదలు మట్టిగోడలును, తాటాకు లేక కొబ్బరియాకుల కప్పులుగల యిండ్లలో నుండెడివారు. పట్టణమున సున్నము పూసినయిటికగోడలును పెంకుకప్పులునుగల యిండ్లను గట్టుకొనెడివారు దేవాలయములు రాచనగరులు యిటుకతో గట్టిరి. కూర్చుండుట కెత్తైనపీటలు, హంసతూలికాతల్పములు, పిల్లలకుయ్యెలలు విగ్రహములమీద దీపములు భాగ్యవంతుల యిండ్లనుండెను. చోరభయములేకుండ గ్రామములచుట్టును కంచెలును, పట్టణములచుట్టును గోడలును నుండెడివి.

సైన్యము.

సైన్యము నాలుగుభాగములు. ఏనుగులు గుఱ్ఱములు రథములు కాల్బలము. యుద్ధమున మొదటయేనుగులు తరువాత గుఱ్ఱపువరుసలు నాతరువాత కాల్బ

లమును నుండెను. సేనానాయకులు రథములనెక్కియో యేనుగులనెక్కియో నుండెడివారు. కాల్బలము డాలు కత్తియు, అశ్వికులీటెలను ధరించెడివారు. విలుకాండ్రుగూడ నుండెడివారు. గొప్పయింటివారు కవచముల ధరించిరి.

ద్రావిడవాఙ్మయము.

దక్షిణమున పేరువడ్డ ద్రావిడభాషలు నాలుగు. తమిళము, మళయాళము, కన్నడము, తెనుగు వీటిలో మొదటి రెంటును నొకవిధముగను చివర రెంటును నొకవిధముగను నుంచును.

తమిళము.

సంఘయుగమున తమిళభాష వృద్ధినొందెను. పాండ్యరాజులపోషణక్రింద మధురలో నొకపండితసంఘముండెను. వీరు పుస్తకముల రచించుటయే గాక పుస్తకముల బరీక్షించి రాజుచే బహుమానమిప్పించుటగూడ గలదు. కవీశ్వరులు పండితులు సాధారణముగ జైనులుగాని బౌద్ధులుగాని యయియుండిరి.

కన్నడము.

పూర్వము కన్నడము తెనుగుగూడ కర్ణాటమని పిలువబడెడివి. కన్నడగ్రంథములగూడ జైనులు బౌద్ధులే మొదట వ్రాసినవారు. ఇప్పుడున్న పురాతనగ్రంథము కవిరాజమార్గము. ఇది నృపతుంగుడను రాష్ట్రకూటరాజుచే రచింపబడెను. పంపభారతము, విక్రమార్జునవిజయము నను గ్రంథముల పంపుడనునొకగొప్పకవీశ్వరుడు రచించెను. ఇతడు బ్రాహ్మణుడు. నాగవర్మ భాణుని కాదంబరిని తర్జుమా జేసెను. భాషాభూషణమను నొకవ్యాకరణముగూడ నుండెను.

# మహమ్మదీయమహాయుగము

## పఠానులు.

## 1-వ అధ్యాయము.

### మహమ్మదీయులు.

మహమ్మదీయ మతము.

మహమ్మదు 570 లో బుట్టెను. మొదటినుంచియు మతమునందాసక్తి గలవాడు. క్రైస్తవమతము యూదుమతము సంకరములై విగ్రహారాధనప్రబలుటచే మహమ్మదీ దురాచారములబోగొట్టి స్వచ్ఛమైన మతమును స్థాపింపబూనుకొనెను. ఒకడే దేవుడనియు విగ్రహారాధన కూడదనియు బలులనిచ్చుట మొదలగు కార్యములు భగవంతునిదయను సంపాదించుటకు మార్గములు కావనియు మనుజుని ప్రవర్తననుబట్టి వానిపరలోక సుఖముండుననియు నీతనిమతము. మహమ్మదీయుల యుపయోగార్థ మితడు ఖొరానను నొకగ్రంథమును రచించెను. ఇదియే వారి వేదము. వీరిదేవుని పేరు అల్లా. మతాభివృద్ధికొరకు కత్తినైన నుపయోగించవచ్చునని యితని యభిప్రాయము. మతముకొరకు యుద్ధమున జనిపోయినవారు వీరస్వర్గమనుభవింతురని యితడు జెప్పెను. కాన మతముకొరకు ప్రాణమునిచ్చుటకైనను మహమ్మదీయులు వెనుదీయరు. ఇతర మతకర్తలవలెనే యితడు గూడ యప్పటిప్రజలచే బాధింపబడి మెక్కానుండి మెడీనాకు బ్రాణరక్షణార్థము బారిపోయెను. మహమ్మదీయశక మీసంవ

త్సరమునుండియె ప్రారంభమగును. మహమ్మదు మెక్కాను తరువాతజయించి అరేబియాయందు తనమతము స్థాపించెను.

మహమ్మదీయ విజయము.

నూతన మతదీక్షచే మహమ్మదీయులు దమమతవ్యాపనకై నలుదిక్కులకును బోయిరి. మొదట పడమటియాసియా యందున్న పురాతనరాజ్యములన్నిటిని జయించి, ఐరోపాకుబోయి తూర్పున కానస్టాంటునోపిలువరకు బోయి నచటిరాజులను 1453 లో జయించి ఆస్ట్రియారాజధానియగు వియ్యన్నాను ముట్టడించిరి. ఇచ్చటి క్రైస్తవులు వీరినాపిరి. ఉత్తరయాఫ్రికాకుబోయి దానినంతయు జయించి జిబ్రాల్టరు జలసంధినిదాటి స్పెయినునుజయించి ఫ్రాన్సునకుబోయి యచ్చటిక్రైస్తవులచే నోడింపబడిరి. ఈకాలమున మహమ్మదీయుల పరాక్రమము, ఔదార్యము, బుద్ధిసూక్ష్మత పొగడదగినవి. కవీశ్వరులు శాస్త్రకారులు మెండుగనుండిరి. ఈవిషయమున వారు దేశమునకు జేసినయుపకారము శ్లాఘాపాత్రము.

హిందూదేశమునకు మహమ్మదీయులు వచ్చుట.

650 లో పరిష్యా మహమ్మదీయుల పాలయ్యెను. తరువాత కొంతకాలమునకు బాసోరాపాలకుడు ఆఫ్ఘనిస్థానమున గొన్నిపరగణాలనుజయించెను. 664 లో సఘారి యనునతడు ముల్తానువరకువచ్చి గొందర హిందువులను మతమున గలుపుకొనుటకు ఖయిదీలగా దీసికొనిపోయెను. 683 లో నబ్దుల్లాయనునతడు కాలిఫా నాగ్రహమునకు జడిసి కొందరితో సూలేమాన్ పర్వతములకు బారిపోయివచ్చెను. ఇచ్చట



మహమ్మదీయమతములో గలిసినకొండవారితో నతడును నతనియనుచరులును వివాహసంబంధముల జేసికొనిరి. అబ్దుల్లా హిందూదేశమునకు తరువాత రాజులైన ఘోరి లోడివంశములకు మూలపురుషులైన ఘోరిలోడిలను నిద్దరపుత్రులగనెను. అబ్దుల్లా ఘాకర్సను కొండవారితో స్నేహముజేసి వారిసహాయమున పిషావరువరకు నున్న దేశమును జయించి కైబరు కనుమవద్ద నొకకోట గట్టెను. 712 లో అరబ్బు సేనానాయకుడగు ఖాశిము సింధుదేశమును జయించెను. 828 వరకు మహమ్మదీయులిచ్చట రాజ్యము జేసిరి.

సిబక్తజిను.

కాని గజినీమహమ్మదు దాడులతోగాని హిందూదేశము మహమ్మదీయదాడులకు లోనయ్యెనని జెప్పుటకు వీలులేదు. ఖొరాసానుపాలకుడగు అల్పటిగిను గజినీరాజధానికి 912 లో రాజయ్యెను. అతడు మృతినొందినతరువాత యతనిబానిసయగు సిబక్తజిను రాజయ్యెను. ఇతడు టర్కీ దేశస్థుడు. ఇతడు తనప్రభువు కూతురును పెండ్లియాడి రాజ్యమును స్థిరపరచుకొనెను. ఇతడు 977 లో కాంధారును జయించి సింధునదిప్రాంతమునకు వచ్చెను. లాహోరురాజగు జయపాలుడెదిరించెనుగాని యోడిపోయెను. ఇతడు కొన్నియేనుగులను కప్పముక్రింద సిబక్తజినున కిచ్చుటకొప్పుకొని రాజధానికిదిరిగివచ్చి కప్పముజెల్లింప మానివేసెను. ఇతనిని శిక్షించుటకు సిబక్తజిను తిరుగవచ్చి జయపాలు నోడించి పిషావరువద్ద నొకసైన్యముంచెను. సిబక్తజిను 991 లో మృతినొందెను.

గజనీ మహమ్మదు.

సిబక్తజిను చనిపోయినప్పుడు పెద్దకొడుకగు మహమ్మదు దూరలేందున నతనితమ్ముడు సింహాసన మెక్కుటచే మహమ్మదు తమ్ముని నోడించి రాజ్యమును సంపాదించి రాజ్యమునగల సర్దారులనణచి 1001 లో సుల్తానను బిరుదును వహించెను. ధనము సంపాదించుట మత వ్యాపన మితని ముఖ్యోద్దేశములుగాన ధనవంతమని ప్రఖ్యాతి నొందినట్టియు, మహమ్మదీయేతరులతో నిండియున్నట్టియు హిందూదేశమితని దృష్టినాకర్షించెను.

1-వ దండయాత్ర. 1002

క్రీ.వె. 1002 లో లాహోరు రాజయిన జయపాలుని మీదకు దాడివెడలి యతనినోడించి చాలధనమును కొల్లగొనిపోయెను. ఆకొల్లయందు పదియారు హారములుండెనట. అందులో నొకహారము ఖరీదు 80000 పౌనులట. అనగా 1200000 రూపాయలు. జయపాలుడు సిగ్గుచే రాజ్యమును కొడుకగు నానందపాలునికిచ్చి తాన గ్నిప్రవేశము జేసెను.

2-వ దండయాత్ర. 1004

1004 లో భటియారాజు తనవంతుకప్పము చెల్లింపనందున మహమ్మదాతనిపై దాడివెడలెను. ఈ రాజు ధైర్యముతో మూడురోజులు పోరెను గాని నాలవరోజున మెక్కావంకకుతిరిగి నమాజుచేసి తన సైనికులను మహమ్మదు ప్రోత్సహించుటచే మహమ్మదీయులు హిందూసైన్యముల బారదోలి జయముగాంచిరి. రాజు స్వహస్తముతో బొడుచుకొని చనిపోయెను. మహమ్మదు దేశమును కొల్లగొట్టి విశేషద్రవ్యమును సంపాదించెను.



3-వ దండయాత్ర. 1005

ధనాశాపీడితుడై మహమ్మదు 1005 లో సుల్తానుప్రభువగు నబ్దుల్ ఫతేలోడీమీదకు యుద్ధమునకు రాగా నతడానందపాలుని సహాయమునుబడసి యతనినెదిరించెను. ఆనందపాలు డోడిపోయినందున లోడి సంధికిసిద్ధమయ్యెను. కాష్గరురాజు హీరటుమీదకు దాడివెడలుటచే మహమ్మదు లోడితో సంధికంగీకరించి కొంత సొమ్ముబట్టుకొనిపోయెను. మహమ్మదు తనహిందూరాజ్యమును నొకమతభ్రష్టుడగు హిందూరాజున కప్పగించి తనశత్రువుల నెదుర్కొనబోయెను.

4-వ దండయాత్ర. 1008

మాటిమాటికి తనకడ్డమువచ్చుచున్న నానందపాలుని నాశనము జేయుటకు 1008 లో మహమ్మదు బయలుదేరెను. ఆనందపాలుడు తోడిరాజులనందర ప్రోగుచేసి యుద్ధమునకు వెడలెను. హిందూసైన్యవిస్తీర్ణతనుజూచి మహమ్మదు నలుబదిరోజులు శత్రువులను దాకకుండ వారిసైన్యమున కెదురుగా శిబిరమును నుండెను. కడకు యుద్ధమారంభమయ్యెను. ఘాకర్లు మహమ్మదీయ సైన్యమును నొకప్రక్కనుండి దాకిరి. మహమ్మదీయ సైన్యస్థితి దుర్భరముగానుండగ హిందూసేనానాయకుని యేనుగు వెనుకకు బారిపోవుటచే నతడుగూడ దానితో బోవలసివచ్చెను. సైన్యము సేనానాయకుడు బారిపోవుటజూచి చెల్లాచెదరయ్యెను. మహమ్మదీయులు విజృంభించి హిందూసైన్యమును నాశనము జేసిరి.

అమృతసరస్సునకు తూర్వోత్తరముననున్న నాగరకోట

5-వ దండయాత్ర. 1009

లో శత్రురాజుల ధనము దాచబడెనని తెలిసి మహమ్మదా కోటనుబట్టుకొని 313333 పౌనుల (4699995 రూపాయిలు) ద్రవ్యమును నగలను దీసికొనిపోయెను.

6వ దండయాత్ర 1011

1011లో మహమ్మదు థనేశ్వరము మీదకుబయలుదేరెను. సంధిషరతుల ప్రకారము తానడ్డగించుటకు వీలులేనందున ఆనందపాలుడు థనేశ్వరముజోలికిబోకున్న దానిదోపిడివలన వచ్చుసొమ్ము తానిచ్చెదననెను. థనేశ్వరము పుణ్యస్థలముగుటచే నట్టిగబురంపెనని విగ్రహనాశకుడని బేరుపొంద నాశించిన మహమ్మదంగీకరింపక యాస్థలమును బట్టుకొని దేవాలయమును నందలివిగ్రహమును నాశనముజేసి గొంతద్రవ్యమును ననేకమందిప్రజలను బానిసలగను దీసికొనిపోయెను.

7,8 దండయాత్రలు

రెండవ జయపాలుని కాశ్మీరమునవోడించి కాశ్మీరదేశస్థుల మహమ్మదీయుల జేసెను. 8వ దండయాత్రగూడ కాశ్మీరమునకే చేయబడెను. తిరుగబడిన సామంతప్రభువుల లొంగదీసి తిరిగివచ్చుచుండగా దారిచూపువారిద్రోహముచే మహమ్మదుయొక్క సైన్యమును యుద్ధసామగ్రియును గొంతనష్టమయ్యెను.

9వ దండయాత్ర 1017

9వ దండయాత్రలో కనోజిని జయించెను. ఇదిచాలా పెద్ద పట్టణము. తూర్పు పశ్చిమములకు మధ్య గంగానదిమీద నుండుటచే గొప్ప వర్తకస్థానము. ఇచ్చట 30000 తమలపాకు



ల దుకాణములుండెనట. ఇచ్చటనుండి వెడలి ధనవంతమైన మధుర బట్టుకొనెను. ఇది గొప్ప పుణ్యస్థలము విగ్రహముల నాశనముజేసెనుగాని, గుడిగట్టిదగుటచే మహమ్మదు దానినిపగులగొట్టలేకపోయెను. ఈదండయాత్రలో మహమ్మదు 416000 పౌనులు (62,40,000 రూపాయిలు) పట్టుకొనిపోయెను. మధుర కట్టడములజూచి గజనీలో మహమ్మదు గొప్ప మశీదును గట్టెను దీనిలో విలువైన తివాసులు, రత్నదీపములు మొదలగునవి నమర్చబడుటచే దానిని దేవతాంగనయని పిలచిరి. మహమ్మదునుజూచి యితరులుగూడ మంచిభవనములు మొదలగువానిని నిర్మించుటచే గజనీపట్టణము కట్టడములకు బ్రసిద్ధికెక్కెను.

10వ దండయాత్ర 1022

తనస్నేహితుడగు కనోజిరాజు సహాయార్థము మహమ్మదు ఇండియాకు వచ్చెను. దారిలో లాహోరురాజైన రెండవజయపాలుని జయించి యతనిరాజ్యమును తనరాజ్యములో గలుపుకొనెను.

11వ దండయాత్ర

1023లో మహమ్మదుతిరుగ హిందూదేశమునకువచ్చెను. కాని యతనికేమియు లాభము గలుగలేదు.

12వ దండయాత్ర 1024

ఇది ముఖ్యమైనది. పుణ్యతీర్థమైన సోమనాథపట్టణము పట్టుకొనబడెను. 1024లో బయలుదేరి మహమ్మదు ముల్తాను బట్టుకొని సోమనాథ

పట్టణము ముట్టడించెను. ఎంతసొమ్మిచ్చెదమన్నను నతడు ముట్టడి మానలేదు. ఈగుడి సేవకులు 20 బ్రాహ్మణులు; 500 దేవదాసినులు, 300 సంగీతపాఠకులు, 300 క్షౌరకులు నుండిరట. దీనినిబట్టి యిదియెంత గొప్పయాలయమో, ఎంతరాబడి గలదో, ఎంతమంది యాత్రస్థులిచ్చటికి బోవుచుండిరో యూహించవచ్చును. విగ్రహనాశకుడన్న బిరుదును సంపాదించవలెనని కోరికగల మహమ్మదు వారి సంధిమాటలకు నొప్పుకొనక విగ్రహనాశనముజేసెను. విగ్రహముల క్రింద శంకుస్థాపన నాడు వేసిన బంగారమే వారిచ్చెదనన్న దానికి నెన్నిరెట్లో యుండెనట.

మహమ్మదు 1030లో జనిపోయెను. తాను సంపాదించిన ద్రవ్యమంతయు తనదగ్గర కుప్పబోయించి యదిచూచుచు కన్నులనీరు పెట్టుకొని జనిపోయెను. ఇతడు పరిష్యనుభాషను వృద్ధిజేసెను. మహమ్మదుగజనీ న్యాయము నిచ్చుటయందు ప్రసిద్ధికెక్కెను.

మహమ్మదు తరువాత పదిమంది రాజ్యముజేసిరి. కాని వారికాలమున ముఖ్యమైన సంగతులేమియు లేవు. వీరికాలమున సెల్జుకుటర్కులు గజనీరాజ్యముపైకి దాడివెడలి కొన్నిరాష్ట్రముల లాగికొనిరి. గజనీవంశస్థులు క్రమముగా హిందూదేశమునకు జరిగిరి. ఇచ్చటనుగూడ రాజ్యము జేయకుండ ఘోరువంశస్థుడగు అల్లాయుద్దీనను నతడు తనయన్నను జంపినందులకు గజనీ రాజ్యము లాగికొనెను.





## ౭-వ అధ్యాయము.

## ఘోరీవంశము 1186-1206.

వీరు హిందూకుషు పర్వతములకు పారిపోయివచ్చిన యబ్దుల్లాకుమారుడయిన ఘోరీసంతతివారగుటచే నాఫఘనులు. వెనుకటి యధ్యాయమున బేర్కొన్న యల్లాయుద్దీను కుమారు డొకసంవత్సరము రాజ్యముజేసి మృతినొందిన నతని పినతండ్రికుమారుడగు గయాజుద్దీను రాజ్యమునకు వచ్చెను. ఇతని తమ్ముడు మహమ్మదుఘోరీ దేశపరిపాలనలో నన్నగారికిసహాయము చేయుచుండెను. గయాజుద్దీను గతించినవెనుక మహమ్మదు రాజయ్యెను.

మహమ్మదుఘోరీ గజనీమహమ్మదువలెనే హిందూదేశమునకు దండయాత్రజేసి యచట మహమ్మదీయ రాజ్యస్థాపనజేసెను. ఇతడు 1176 లో ముల్తానువిూదకు దాడివెడలి రాణీద్రోహముచే ఆక్కపట్టణమును బట్టుకొనెను. 1186 లో లాహోరును జయించి గజనీరాజవంశము నంతమొందించెను. 1192 లో గజనీవలెనే కీర్తి నంపాదించుటకు హిందూదేశమునకు దాడివెడలగా రాజపుత్రులెదిరించిరి. వారినాయకుడు డిల్లీ యాజ్మీరులరాజగు పృథ్వీరాజు. వీరు ఘోరీని థనేశ్వరము నొద్ద నోడించిరి. మహమ్మదు తనరాజధానికి తిరిగివెళ్ళి పందలయిన తనసేనానాయకుల మూతులకు గుఱ్ఱపుదాణాసంచులదగిలించి పట్టణమున దిప్పించెను. పూర్వముకంటె నెక్కుడసేననుగూర్చుకొని 1193లో నతడుతిరుగ హిందూదేశము

నకువచ్చెను. పృథ్వీరాజు రాజపుత్రుల నందరఁగూడఁ జేసి తిరుగ ధనేశ్వరము నొద్దనే ఘోరీ నెదిరించెను. ఈసారి రాజపుత్రులోడిపోయిరి. పృథ్వీరాజు యుద్ధమున మరణించెను. ఘోరీ తనబానిసయగు కుతుబుద్దీనుని తనకుఁజిక్కిన హిందూరాష్ట్రమునకు పాలకునిగా నియమించి యింటికి మరలెను. ఈయుద్ధమున పృథ్వీరాజు మామయగు కనోజిరాజు బలవంతుఁడయ్యును పృథ్వీరాజునందుండు కోపముచే దేశభక్తిని విడనాడి రాజపుత్రుల జేరడయ్యెను. దీనికితగిన ఫలితమును నతఁడు వెంటనేయనుభవించెను. 1194 లో మహమ్మదు హిందూదేశమునకువచ్చి కనోజిని ముట్టడించెను. ఎవ్వరును సహాయముజేయువారులేక జయచంద్రుడోడిపోయెను. కనోజిపట్టణము మహమ్మదీయులచే దోచుకొనబడి యచ్చటి దేవాలయములన్నియు ధ్వంసముజేయబడెను. ఇట్లు మహమ్మదీయులు హిందూదేశమును సులభముగా జయించుటకు నాలుగుకారణములు గలవు. మొదటిది హిందూరాజులు తమలోతాముపోరాడి పరదేశీయుల నెదిరించుటకైన గలియకుండుట. రెండవది యుద్ధశాస్త్రమందు మహమ్మదీయు లెక్కుడుప్రవీణులగుట. మూడవది హిందువు లుష్ణదేశమందుండుటచే తురుష్కులకంటె బలహీనులగుట. నాలవది ప్రజలలో సౌఖ్యముబలసి దేశభక్తి నశించుట.

ఇంతటినుంచి ప్రతిసంవత్సరమును మహమ్మదు హిందూదేశముపయికి దాడివెడలుచుండెను. ధనసంపాదనయందును, మతవ్యాపనయందును గజినీకున్నయాసక్తి యితనికున్నను



నితడు సంపాదించిన కీర్తి నితడు సంపాదించలేకపోయెను. గజినీవలె ఘోరీ కవిపోషకుడుగాడు.

పశ్చిమోత్తర పర్వతప్రాంతముల ఘూకర్లను నొకక్రూరులయిన నడవిజాతివారుండిరి. ఘోరీ వారినిజయించి మహమ్మదీయుల జేసెను. తుదకు వారిచేతనే 1206 లో జంపబడెను. ఇతని యనంతర మితనిరాజ్య మితనిబానిసలపాలయ్యెను గజినీరాజ్యము ఎల్దాజనువానికిని, సింధు నాజరుద్దీనునకును, హిందూరాజ్యము కుతుబుద్దీనునకును వచ్చెను.



## 3-న అధ్యాయము.

### బానిసవంశము 1206—1288.

కుతుబుద్దీనను మహమ్మదుఘోరీబానిస దీనికి స్థాపకుడు. మహమ్మదితనిని హిందూరాజ్యమునకు పాలకునిగా నియమించినందున ఘోరీమృతినొందినవెంటనే నితడు ఢిల్లీసింహాసనమెక్కెను. ఇతడిరువదినాలుగు సంవత్సరములురాజ్యముజేసి కుతుబ్మినరను నొకస్తంభమును గట్టించి తాను స్వతంత్రరాజైన నాలుగుసంవత్సరములకు ననగా 1210 లో జనిపోయెను. ఇతడు బహుధర్మాత్ముడనియు జంతువులుగూడ నితనిచావునకు విచారించినవనియు కథలుగలవు. ఇతడు మొదటి ఢిల్లీసుల్తాను.

కుతుబుద్దీను 1206—1210.

కుతుబుద్దీనుకొడుకు బలహీనుడగుటచే నతనినిబారదో

అల్తమషు 1210—1236.

లి కుతుబుద్దీను బానిసయగు నాల్తమషను వాడు రాజ్యమునకు వచ్చెను. ఇతడు నాజరుద్దీనునుండి 1225 లో సింధురాజ్యమును, యింకొక మహమ్మదీయ పాలకునినుండి వంగ బీహారములను జయించెను. 1226 లో మాళవదేశమును జయించి యుత్తరహిందూస్థానమునకంతకును రాజయ్యెను. ఇతడుజ్జయినిలో ప్రసిద్ధికెక్కిన కాళీవిగ్రహమును ధ్వంసము జేసెను. ఇతడు 1236 లో మృతినొందెను.

రిజియా 1236—1239

ఇతని కుమారుడు బలహీనుడగుటచే నతనిని సింహాసనభ్రష్టునిజేసి అల్తమషుకూతురగు రిజియాయనునామెను ప్రజలు రాణిగ జేసిరి. ఈమె కగు సమర్థురాలు. ఈమె యొకబానిసవానిని జేరదీసి గొప్పయుద్యోగ మిచ్చినందున ప్రభువులందరు కోపగించి తిరుగబడుటచే వారిలో నాయకుడగు అల్తూనియా యనువాని వివాహమాడి యీయుపద్రవముదాటెను. కాని ప్రభువులలోన సంతుష్టి నశింపకుండుటచే నామె తమ్ముడగు బెహారమనునతడు కొందరిప్రభువుల సహాయముచే నాల్తూనియానుజంపి యీమెను సింహాసనమునుండి తొలగించి తాను రాజయ్యెను. ఇతడు రెండుసంవత్సరములు మాత్రమే రాజ్యమేలెను.

నాజరుద్దీను 1247—1266.

ఈవంశములో గడపటివాడు నాజరుద్దీను. ఇతడు భగవద్భక్తుడై పకీరువలె కాలము గడపెను. రాజ్యపుటాదాయములో నొకదమ్మిడీయైనను తన స్వంతఖర్చునకు ముట్టుకొనక పుస్తకములువ్రాసి



సొమ్ము సంపాదించుకొనెడివాడు. ఇతనిభార్యయే యితనికి వండిపెట్టవలెను. ఇతని కాలమున నితనిమంత్రియగు గయాజుద్దీను బాల్బనను వాడే నిజముగా రాజ్యపరిపాలన జేసెను.

గయాజుద్దీను బాల్బను 1266-1287.

ఇతడు బహుసమర్థుడు. ఢిల్లీ చుట్టుననున్న రాజుల జయించి రాజ్యమును బలపరచి దేశమును బాధించుచున్న మొగలుల బారద్రోలెను. నాజరుద్దీను యనంతరమున నితడు సింహాసనమెక్కెను. ఇతడు రాజ్యమునకు వచ్చిన వెంటనే సైన్యమును మంచిస్థితిలోనికి దెచ్చి తిరుగుబాటుచేసిన మీవాటు వంగదేశములను తిరుగ జయించెను. మొగలులు తిరుగ ముల్తానుపయికి దాడివెడలిరని తెలిసి తనకుమారుడగు మహమ్మదును వారిపయికి బంపెను. మొదట జయమునొందినను నతడు యుద్ధమున జనిపోయెను. గయాజుద్దీను తనకుమారునియందే నెక్కుడాశ పెట్టుకొనినవాడగుటచే నావార్త వినిన వెంటనే గుండెపగిలి చనిపోయెను. గయాజుద్దీను తనకుమారునికొరకు వ్రాసిన రాజనీతులు చాలప్రసిద్ధికెక్కెను. ఇతడు న్యాయమిచ్చుటయందు పేరొందెను.

కైకుబాదు.

ఇతనిమనుమడు కైకుబాదు రాజ్యమునకు వచ్చెను. ఇతడు బలహీనుడును విషయలోలుడును నగుటచే దేశమున నరాజకము ప్రబలి జలాలుద్దీనుకిల్జీ యనునతడు 1288 లో కైకుబాదు చంపబడినపిమ్మట రాజయ్యెను.



# 4-వ అధ్యాయము.

## కిల్జీవంశము 1288—1320.

జలాలుద్దీను 1288—1295

ఈవంశస్థాపకుడగు జలాలుద్దీనుకిల్జీ దయగలవాడనియును మంచిరాజకీయవేత్తయనియును ప్రసిద్ధిగాంచెను. ఇతడు రాజ్యమునకు వచ్చినవెంటనే గయాజుద్దీనుబాల్బను సోదరపుత్రుడు తిరుగబడిన నతనినోడించెనుగాని శిక్షింపక క్షమించెను. 1292 లో మొగలులెత్తివచ్చిన వారినోడించి తరిమివేసెను. కొందరితనిని జంపుటకు కుట్రలుపన్నుచున్నారని దెలిసి వారందరుజేరినచోటికిబోయి తనకత్తి వారిముందు బడవేసి తననుజంప నుద్దేశించిన జంపమనికోరెను. ఎవ్వరును కదలనందున వారితోగూడ గూర్చుండి విందారగించి యింటికిదిరుగ వచ్చెను. ఇతని మంచితనముచే దేశమున శాంతికిభంగమగుటయేగాక రాష్ట్రపాలకులుగూడ కప్పముజెల్లింపరయిరి. సిద్దీమౌలాయను నొకపకీరు రాజద్రోహముజేయ నయుకట్టిన నతనిని జంపించుటచే నతడు శపించెను. అంతటినుండియు జలాలుద్దీను సౌఖ్యమెరుగడు. పెద్దకొడుకు చనిపోయినందున తనయన్నకొడుకగు నల్లాయుద్దీనుని తనకొడుకుగనే భావించుచుండెను. అల్లాయుద్దీను బందలఖండు మాళవరాజుల జయించి దక్కనుపైకి దాడివెడలెను. వింధ్యాపర్వతములదాటి దేవగిరిరాజగు రామదేవునోడించి యతనివద్ద విశేషధనమును ఎల్లిచిపురమును బుచ్చుకొని తిరిగివచ్చెను. అల్లాయుద్దీను తన్నుజంప నుద్దేశముతో నున్నాడని వినినను, తనసహజ యౌదార్యముతో జలాలుద్దీను వానినెదు



ర్కొనబోయెను. దుర్మార్గుడగు నల్లాయుద్దీను తనపినతండ్రియగు నితనిని జంపించెను.

అల్లాయుద్దీను 1295-1316

అల్లాయుద్దీను సింహాసనమెక్కి 1297 లో గుజరాతును, 1300 లో రత్నభోరను రాజపుత్రకోటను, 1303 లో చిత్తూరును జయించెను. చిత్తూరులోజరిగిన అల్లాయుద్దీను పద్మిని కథయందరకు దెలిసినదేగాన నిచటజెప్పలేదు. మొగలాయీలను 1297, 1304-5 లలోను జయించి తరిమివేసెను.

దేశమున నల్లరులు మెండగుటచే నల్లాయుద్దీను తనసామంతప్రభువులబిల్చి దీనికిగారణమేమని యడుగ వారు నిర్భయముగ జవాబుజెప్పిరి. అల్లాయుద్దీను రాజ్యవ్యవహారముల జూడకుండుటయు నతిడువిస్తారముగా త్రాగుటయు, ఆస్తిసరిగా పంచిపెట్టకుండుటయు, గొప్పకుటుంబములకును పెద్దయుద్యోగస్థుల కుటుంబములకును బంధుత్వముండుటయును గారణములని వారుజెప్పిరి. అందుమీద రాజు న్యాయపరిపాలనకును త్రాగుడుమానిపించుటకును బూనుకొనెను. త్రాగుడు నిషేధించుటయేగాక డిల్లీలోనున్న సారాపీపాలనన్నటిని పగులగొట్టించి సారానువీధులలో బారబోయించెను రహితు తన పంటలో సగము రాజునకిచ్చునట్లేర్పాటయ్యెను హిందువుల వద్దనుండి పన్ను కఠినముగా వసూలుచేయబడెను. అన్నివస్తువులకును ధరలేర్పాటయ్యెను. అల్లాయుద్దీను క్రూరుడగుటచే మహమ్మదీయులును హిందువులునుగూడ నతనిప్రభుత్వమున మిగుల కష్టముల ననుభవించిరి.

దేవగిరిరాజగు రామదేవు కప్పము చెల్లించనందున నతని శిక్షించుటకు మలిక్కాఫరు సేనానాయకత్వమున నొకసైన్యమును నల్లాయుద్దీను బంపెను. మలిక్కాఫరు రామదేవుని జయించి కప్పముగొని సామంతరాజుగ జేసెను. మలిక్కాఫరును 1810 లో పశ్చిమదేశమునకు బంపగా నచట సంపూర్ణజయమునొంది యనంతమైన ధనమును నగలను దెచ్చెను. మలిక్కాఫరు దక్షిణదిగ్విజయము మూలముగా 1807 లో దేవగిరిని, 1310 లో ఒరంగల్లును (కాకతీయులు), 1311 లో దేవసముద్రమును (హోసల్యులు), నల్లాయుద్దీను రాజ్యమున జేర్చెను. ఈతరువాత నల్లాయుద్దీను తనసహజక్రూరత్వమును జూపగా దేశమున నసంతుష్టి బయలుదేరెను. మలిక్కాఫరు ప్రసిద్ధుడగుటచే ప్రబలుడయ్యెను. అట్టిసమయమున నల్లాయుద్దీను 1315 లో చనిపోయెను.

ఇతని తరువాత ముబారిక్ కిల్జి యనునతడు రాజయ్యెను. ఇతడు క్రూరుడగుటచేతను, నీచజాతివాడైన కుస్రూయనువానిని మంత్రిగజేయుటచేతను ప్రభువులందరితనినిజూచి యసహ్యించుకొనిరి. కుస్రూ వీనినిజంపి రాజుకాగా పంజాబు గవర్నరగు గయాజుద్దీనుటగ్లాకు వానినిజంపి కిల్జీవంశస్థు లెవ్వరులేనందున తానేరాజయ్యెను.

## 5.వ అధ్యాయము.

### టగ్లాకువంశము 1321—1414.

ఇతడు 1321 లో సింహాసనమెక్కి మొగలాయీలు



రాకుండ సరిహద్దుల బలపరచి తనకొడుకును
గయాజుద్దీను 1821—1823. 1822 లో దక్షిణదిగ్విజయయాత్రకు బంపెను. అతడు ఒరంగల్లు త్రిలింగదేశముల జయించి తిరిగివచ్చెను. గయాజుద్దీను 1823 లో వంగదేశమును లోంగదీసి మిథిలనుజయించి రాజధానికి తిరిగిరాగా నతనికి స్వాగతమిచ్చుటకితనికుమారుడొక కఱ్ఱభవనమును నిర్మించెను. ప్రమాదవశముననో, బుద్ధిపూర్వకముగనో దానిలో గయాజుద్దీ నడుగుపెట్టగనే నదికూలి యతడు మరణించెను.

అతనికుమారుడు మహమ్మదుబీనుటగ్లాకు రాజయ్యెను. ఇతడు రాజ్యమునకు వచ్చుసరికి దక్షిణ
మహమ్మదు 1828-51. మున చిట్టచివర కొద్దిభాగముతప్ప హిందూదేశమంతయు పఠానులవశమున నుండెను. ఇతడు పిచ్చివాడని కొందరుచరిత్రకారులు వ్రాసిరిగాని యది సహేతుకముగ గనుపించదు. చీనాకు దండయాత్ర హిమాలయపర్వతములద్వారా బంపుట, నాణెములకుబదులుగా నోట్లనేర్పరచుట, రాజధానిని ఢిల్లీనుండి దేవగిరికిమార్చుట, యిట్లు వ్రాయుటకు కారణములుగా జెప్పబడెను. మనము సరిగాజూచినయెడల పిచ్చివాడు కాకపోవుటయేగాక మిక్కిలి బుద్ధిమంతుడనియు నాతనియుద్దేశముల నాకాలపువారు గ్రహించలేకుండుటచే బిచ్చివాడనిరనియు దేలును. చీనాకు దండుబంపుట మనకు పిచ్చిగాగనబడదు. ఏలనన బ్రిటిషువారీరోజులలో టిబెట్టునకు ససైన్యగాయభారమును పంపలేదా? ఆయాపజయములబట్టి దండయాత్ర పిచ్చిదనవచ్చునా? అల్పుసున్న

దాటగల్గెను గాన హేనిబలు గొప్పవాఁడా? తనసైన్యముదాటలేక నశించెనుగాన టగ్లాకు పిచ్చివాఁడా? రెండవది నోట్లను నాణెములక్రింద నుపయోగించుట. పద్ధతిప్రకారము, పద్ధతికి వ్యతిరేకముగను మిగుల నాగరికతజెందినవన్న పాశ్చాత్యదేశము లీకాలమున నాపద్ధతినవలంబింపలేదా? వారిని పిచ్చివారంటిమా? మూఁడవది రాజధానిని దేవగిరికిమార్చుట. దీనిలో నతనిబుద్ధిసూక్ష్మత బరిశీలింపవలసియున్నది. అప్పటికాలమున పశ్చిమోత్తర కనుమలద్వారా శత్రువులు వచ్చుచుండిరి. రాజధానిని పట్టుకొనిన రాజ్యము వశమగుచుండెను. శత్రువులు దక్షిణమునకు వచ్చుటకంత వీలులేకుండెను. ఇట్టిస్థితిలో నుత్తరమునుండి దక్షిణమునకు రాజధానిని మార్చుట పిచ్చితనమా? ప్రజలను ఢిల్లీనుండి బలవంతమున దేవగిరికిదీసికొనివెళ్లెననియు నచటినుండి తిరుగఢిల్లీకే బంపివేసెననియు జెప్పుదురు. ఆకాలమున రాజధానిలోనిప్రజలు సాధారణముగ మూఁడుపాళ్లు రాజకీయోద్యోగస్థులు, మిగిలినవారు వీరికిగావలసిన వస్తుసామగ్రి సప్లయిచేయుట కున్నవారు. రాజధాని మార్చబడినవెంటనే యందరు రాజువెంటబయలుదేరి వెళ్ళవలసినవారేగాని బలవంతముచేయనవసరము లేదు. ఒకవేళకొందరిని బలవంతముచేసినను నతనిక్రూరత్వమే దెలుపునుగాని పిచ్చితనమును దెలుపదు. అంత వెంటనే దేవగిరినుండి ఢిల్లీకేల పోవలెనను ప్రశ్న యుదయించవచ్చును. తనయుద్యోగులందరు తనయుద్దేశ్యమును బోధపరచుకొనలేక నష్టుతగులుటచే నతడేమిచేయగలడు? అందుచే నిష్టములేనివాడైనను దిరుగ



ఢిల్లీకే పోవలసివచ్చెను.

ఇతడు రాజ్యమునకు వచ్చినవెంటనే జనులకు విశేషద్రవ్యమును దానముజేసి, కవులజేరదీసి భాషాపోషకుడగుటయేగాక తానుగూడ విద్యలనభ్యసింప నారంభించెను. వైద్యమున తర్కమున ఖగోళగణితభూగోళశాస్త్రముల మంచిసామర్థ్యమును సంపాదించెను. మతసంబంధమైన విఘులనెప్పుడును నిర్లక్ష్యముచేయక ఖొరాన్‌లో నిషేధింపబడినవాటిని వదలివేసి మతానుసారముగా గాలముగడపెను. ధర్మమందాసక్తిగలవాడై యనేకచికిత్సాలయముల గట్టించెను.

1327 లో మొగలులు ముల్తానునాక్రమింపగా వారినెదుర్కొనుటకు వీలులేక సొమ్మిచ్చిపంపివేసియతడుతనరాజ్యములో శాంతికొరకు బ్రయత్నించెను. దక్కనున తిరుగుబాటులనణచి కర్ణాటమును జయింప బ్రయత్నించెను. పరిష్యా, చీనా నీపాలుల జయింపనిశ్చయించి తనకుగావలసినధనముకొరకు పన్నులవృద్ధిజేసి కాగితపునోట్లను నమలులోనికిదెచ్చెను.

ఇతనియుద్దేశముల నుద్యోగు లర్థముజేసికొనలేక సహాయము జేయకుండుటచే నితని ప్రయత్నములు వ్యర్థమగుటయేగాక దేశముగూడ నరాజకమయ్యెను. పన్నులచే ప్రజలు తిరుగుబాటుచేసిరి. సైన్యము దండయాత్రలలో నశించుటచేత పాలకులు కప్పముజెల్లింపరయిరి. పాంచాలము తిరుగబడిన నానవాబునితడు జయించి చంపివేసెను. మాళ్వాలోనితనిపినతండ్రికుమారుడు తిరుగబడెను. వంగబిహారములు

స్వతంత్రములయ్యెను. ఆఫ్ఘనులు, ఘూకర్లు శిబిరమునుదోచుకొనసాగిరి. త్రిలింగకర్ణాటరాజులు 1344 లో స్వతంత్రులైరి. త్రిలింగరాజు ఒరంగల్లువద్దను కర్ణాటరాజు విజయనగరమువద్దను రాజ్యముల స్థాపించిరి. 1345 లో గుజరాతు మాళ్వాపాలకులు తిరుగబడిరి. దక్షిణమున భామినీరాజ్యము స్థాపితమయ్యెను. గుజరాతు సంక్షోభము నణచుటకుబోయి తాతావద్ద 1351 లో మహమ్మదు చనిపోయెను. ఇతడు క్రూరుడగుటచే ప్రతినేరమునకును మరణశిక్షవిధించెను. ఇతనికాలమున టపా గుఱ్ఱపువారులు తీసికొనివెళ్లుచుండిరి.

ఫిరోజిషా
1351—1388.

ఇతనియనంతరమితనిదాయాదియగు ఫిరోజిషా రాజ్యమునకువచ్చెను. ఇతడు బహుయోగ్యుడు. తిరుగబడినదేశముల మరల జయించుటకు ప్రయత్నించెనుగాని లాభములేకపోయెను. ఢిల్లీవద్ద ఫిరోజిబాదను నొకపట్టణమునునిర్మించెను. మరణశిక్షగల నేరములసంఖ్యను తగ్గించెను. ప్రజలు చెల్లించవలసిన పన్నుల నియమించుటచే పన్నులువసూలుజేయువారు ప్రజలహింసించి తమకొరకు సొమ్ములాగుకొనకుండజేసెను. నేరస్థుల నంగవికలులజేయుట మాన్పించెను. ఇతడనేక కట్టడముల గట్టించెనుగాని నన్నిటిలో ముఖ్యమైనది నితడుత్రవ్వించిన కాలువ. కర్నాలువద్దనుండి యమునద్వారా హాంశిహిస్సారుల కీకాలువ త్రవ్వించెను. అతనితరువాత రాజులు బలహీనులగుటచేతను మొగలులు దేశమున ప్రవేశించుటచేతను దేశమరాజకమయ్యెను.



మొగలాయిలు
టామర్లేను

వీరు మంగోలు జాతివారు, ఈతెగను ప్రాముఖ్యతకు దెచ్చినవాడు చెంగిజుఖాను. బానిసరాజుల కాలమునుండి వీరు హిందూదేశముపైకి దండెత్తి వచ్చుచుండిరిగాని యప్పటిసుల్తానులు వీరినోడించియో లేక లంచమిచ్చియో బంపివేయుచుండిరి. టామర్లేను తనమనుమడి ముల్తానుచుట్టునున్న దేశమును కొల్లగొనబంపి తాను పంజాబునదులనుదాటి 1398 డిశంబరు 17 వ తేదీని ఢిల్లీలో ప్రవేశించెను. సుల్తానయిన మహమ్మదుటగ్లాకు పారిపోయెను. తనసైన్యరక్షణమున కేర్పాటుజేసిన గట్లవరుసలలో నొకదానిముందు వరుసగా దున్నపోతులబెట్టెనట. బహుశా హిందువులు వీటినిజంపరుగాన తనమీదకు వారురాలేరని యూహించి యుండును. ఢిల్లీలోని భాగ్యవంతులు కొందరు తానడిగినసొమ్మివ్వనందున ఢిల్లీకొల్లగొట్ట నాజ్ఞాపించెను. శిశుస్త్రీవృద్ధభేదములేక జనులుచంపబడిరి. స్త్రీలను చెరగొనిరి. ఇండ్లు దోచుకొని తగులబెట్టిరి. చావగామిగిలినవారు టామర్లేను శరణిచ్చినమీదట లొంగిపోయిరి. టామర్లేనయిదురోజులుండి విశేషద్రవ్యముతో తిరిగిపోయెను.

1405 లో సుల్తానగు మహమ్మదు తిరిగివచ్చి 1414 వరకు రాజ్యముచేసిచనిపోయెను. టగ్లాకువంశమంతరించెను.

## 6-వ అధ్యాయము.

## సయ్యదులోడీ వంశస్థులు.

పంజాబుపాలకుడగు ఖైజరుఖాను పేరునను టామర్లేను

సయ్యదువంశము 1414-1450

ప్రతినిధిగ సింహాసనమెక్కెను. మహమ్మదు వంశమువాడగుటచే నతనివంశము సయ్యదు వంశమని పేరుపొందెను. ఢిల్లీచుట్టునున్న దేశమే వారిపాలనక్రింద నుండెను. 1450 లో నీవంశమున గడపటివాడగు సయ్యదు ముబారకు మసీదులో ప్రార్థించుచుండ నొకహిందువుచే జంపబడెను. బెలాలుఖానులోడీ యనునతడు రాజయ్యెను.

లోడీవంశము 1450-1525

లోడీవంశస్థు లాఫ్ఘనులు. ఘూరీవంశస్థులవలెవీరును నబ్దుల్లానుండి వచ్చినవారే. వీరి మూలపురుషుడబ్దుల్లా చిన్నకొడుకగు లోడీ. బెలాలు లోడీ పంజాబు సరిహద్దులనున్న దేశమునకు బాలకుడగుటచే నితడు చక్రవర్తియైన తరువాత నాదేశముగూడ ఢిల్లీరాజ్యమున జేరెను. ఇతడు రాజ్యమును గొంతపెంచెను. ఇతని మరణకాలమునాటికి ఢిల్లీరాజ్యము యమునమొదలు హిమాలయమువరకును ఢిల్లీమొదలు కాశీవరకును వ్యాపించెను. ఇతడు యోగ్యుడు; బాహ్యాడంబరమం దిష్టములేనివాడు. తన్నందరెరుగుదురుగాన రాజచిహ్నముల ధరించనవసరములేదని మానివేసెను.

ఈవంశమున గడపటివాడగు నిబ్రహీము దుర్మార్గుడగుటచే సామంతప్రభువులందరతనియెడల విముఖులయిరి. పంజాబుగవర్నరగు నితనిదాయాది దౌల్తాఖానులోడి యనునతడు కాబూలురాజగు బేబరును హిందూదేశముపయికి దాడివెడలబ్రోత్సహించెను. టామర్లేనువంశపు వాడగుటచే హిందూదేశము తనదేయనిచెప్పుచు సమయముకొరకు నిరీక్షించుచున్న బేబరు వెంటనే లాహోరుపైకి 1524 లో దండెత్తి దానిని బట్టుకొనెను 1525 లో పానిపట్టువద్ద నిబ్రహీము నోడించి యితడు రాజ్యముగొనెను.



అఫ్ఘనురాజ్యము క్షీణించి యనేక చిన్నరాజ్యము లేర్పడుటచే బేబరునకు ఢిల్లీయును దానిచుట్టునున్న ప్రదేశమే స్వాధీనమయ్యెను. జౌన్పూరు, మాళ్వా, గుజరాతు, బెంగాలు భామిని, విజయనగర రాజ్యములు స్వతంత్రములుగానుండెను. వీటిలో సాఖరుదితప్ప మిగిలినవి అఫ్ఘనురాజ్యములే.



## 7-వ అధ్యాయము.

### దక్కను: భామిని, విజయనగర రాజ్యములు

భామినిరాజ్యము.

మహమ్మదుబీనుటూగ్లాకు కాలమున దక్షిణమున రెండుస్వతంత్రరాజ్యము లేర్పడెను. అవి మహమ్మదీయరాజ్యమగు భామినీరాజ్యము, హిందూరాజ్యమగు విజయనగరరాజ్యము. భామినీరాజ్యము జఫర్ఖాననువానిచే స్థాపింపబడెను. ఇతడొకప్పుడొక బ్రాహ్మణుని యొద్ద హుస్సేనుగంగోభామిని యనునామమున బానిసగానుండెను. అందుచే నీరాజ్యము భామినీరాజ్యమని పిలువబడెను. ఇతడు 1858 వరకు రాజ్యముజేసి విజయనగరరాజ్యమున కుత్తరమున అరేబియాసముద్రము త్రిలింగదేశముల మధ్య దేశ

మును వశపరచుకొనెను. భామినీరాజులరాజధాని మొదట నోరంగల్లును దరువాత విదర్భ (బీదరు) యు. ఒరంగల్లు రాజ్యమున కృష్ణా తుంగభద్రా గోవా మచిలీపట్టణముల మధ్యనున్న దేశముండెను ఈ రాజ్యసైన్యములలో ననేకదేశములనుండి వివిధజాతుల వివిధమతముల మహమ్మదీయభటులు జేరియుండుటచేతను, సుల్తానులు క్రూరులు విషయాసక్తులగుటచేతను నారాజ్యము చిరకాలము నిలువక 1518 లో నయిదు చిన్నరాష్ట్రములయ్యెను. అవియేవనగా బీజపూరు, గోలకొండ, అహమదునగరము, ఎలిచిపురము (బీరారు), బీదరు. బీజపూరున నదిల్షాహివంశస్థులును, గోలకొండలో కుతుబుషాహివంశస్థులును, అహమ్మదునగరమున నైజాముషాహివంశస్థులును, ఎలిచిపురమున నిమాదుషాహివంశస్థులును, బీదరులో బరీదుషాహివంశస్థులును రాజులుగానుండిరి. ఈరాజులు తమలో దాము పోరాడి విజయనగరపురాజు సహాయమును గోరుచుండుటచే విజయనగర మభివృద్ధిజెందెను. కాని యీమహమ్మదీయరాజులు దాముచేయుచున్న తప్పు నగ్రహించి యందరేకమై 1565 లో తల్లికోటవద్ద విజయనగరపురాజు నోడించి యారాజ్యమును నాశనముజేసిరి.

బీజపూరు
1489—1688.

బీజపూరురాజ్యము 1489 లో యూసపుఅదిల్షాచే స్థాపింపబడి 1688 వరకును నారాజుల వశముండెను. 1688 లో ఔరంగజేబుదీనిని జయించెను. ఈసుల్తానులు షియామతస్థులగుటచే మతసంబంధములగు కలతలు విస్తారముగానుండెను. అందుచే



శాంతిలేకుండెను. ఈరాజ్యమున మహారాష్ట్రులు కొలువులో నుండి చివరకీరాజ్యముతోనే పోరాడి దీనిని పలుచిక్కులబెట్టిరి. బీజపూరున మహమ్మదీయ కట్టడములిప్పటికిని యద్భుతమును గొలుపుచున్నవి. వీనిలో నిబ్రహీము ఆదిల్షాగోరీ మిక్కిలి పనివాడితనముగలది. సుల్తాను మహమ్మదుగోరీ 18000 చదరపుటడుగుల నేల నొక్కస్తంభమయినను లేకుండ నాక్రమించియున్నది. ఈరాజ్యపు సుల్తానులలో స్థాపకుడగు యూసపు గొప్పవాడు. ఇతడు పరిష్యాచక్రవర్తికుమారుడు. అన్న సింహాసనమెక్కిన ప్రాణరక్షణార్థ మితనితల్లి పరదేశమున కితనిని పంపివేసెను. క్రమముగానితడు భామినీరాజుల కొలువులో జేరి రాజ్యము స్థాపించెను. ఇతడు కవీశ్వరులను పాటకులను శిల్పులను బోషించుటయేగాక తానుగూడ కవిత్వమందును పాటయందును ప్రజ్ఞను సంపాదించెను.

అహమ్మదునగరము.

అహమ్మదునగరము భామినీనీవంశపు రాజులవద్ద బానిసగానున్న యొకనిచే 1490 లో స్థాపితమయ్యెను. ఇతడు బ్రాహ్మణకరణమునకుబుట్టి మహమ్మదీయుడై బానిసయయ్యెను. ఈరాజ్యమును 1636 లో షాజహాను జయించెను.

గోలకొండ.

గోలకొండ 1512 లో టర్కీదేశస్థుడగు నొకభామినీరాజ్య సేనానాయకునిచే స్థాపింపబడినది. ఒరంగల్లును, విజయనగరరాజ్యములో గొంతభాగమును, కృష్ణా, గోదావరి, విశాఖపట్టణము, గంజాం, కడప, నెల్లూరుజిల్లాలును గోలకొండరాజ్యమై యుండెను. నాలుగవ

సుల్తాను రాజధానిని గోలకొండనుండి హైదరాబాదునకుమార్చెను. ఈరాజ్యము 1688 లో నౌరంగజేబుచేజయింపబడెను.

విజయనగర సామ్రాజ్యము.

1326 లో హొసల్యరాజ్యము మహమ్మదీయుల వశమైనందున దానిలో గొంతభాగమును బాలించుటకు హరిహరుడను సామంతరాజును బాలకునిగా వారు నియమించిరి. 1343 లో నితర హిందూరాజుల సహాయము గూర్చుకొని మహమ్మదీయులబారదోలి హరిహరుడు తనరాజ్యమును విస్తరింపజేసెను. ఇతనితమ్మునికొడుకైన రెండవ హరిహరుడు స్వతంత్రరాజై తుంగభద్రాతీరమున విజయనగరమను నొకపట్టణమును నిర్మించెను. ఇతనికాలమున మైసూరు దీనికిదక్షిణముననున్న దేశమంతయు నితనియధీనమున నుండెను. ఈతనిమంత్రి విద్యారణ్యులని పేరుపొందిన మాధవాచార్యులు. విజయనగరరాజులలో నొకడగు కృష్ణమరాజు భామినీసుల్తానునకు గప్పముగట్ట నొప్పుకొననందునను, రాయచూరు ముద్గల్లుకోటలవిషయమై వివాదలుండుటచేతను, సుల్తాను విజయనగరముపైకి దాడివెడలి పెద్దచిన్న స్త్రీపురుష భేదములేకుండ ప్రజలజంపుటచే కృష్ణమరాజు గప్పముగట్టనొప్పుకొని సంధిజేసికొనెను. 1400 లో దేవరాజు సుల్తానుమీదకు యుద్ధమునకుబోగా నొకనాటి సాయంత్రము రాజు నాట్యసభజరుపుచుండ మహమ్మదీయసైనికులు కొందరు మారువేషములతో రాజశిబిరమున బ్రవేశించి రాజకుమారునిజంపి యాగందరగోళములో బారిపోయిరి. ఈకలవరములో మహమ్మదీయ సైనికులు హిందూసైన్యముమీద బడిరి-



హిందువులలో మృతినొందినవారుగాక నితరులుఁబారిపోయిరి. దేవరాజు తనకూతురును సుల్తానునకిచ్చి వివాహముచేసి సంధిచేసికొనెను. ఈతనితో బుక్కవంశమంతరించెను. ఇతనియనంతరము దేశమరాజకముగనుండుటచే నితనిసేనానాయకులు రాజ్యముకొరకు నొకరితోనొకరుపోరాడిరి. అందరనోడించి 1487 లో నరసింహరాయలు సింహాసనమెక్కెను. ఇతని తరువాత రాజు బలహీనుడగుటచే మంత్రియగు నరసనాయకుని కుమారుడు వీరనరసింహరాజు రాజయ్యెను. ఈవంశము వెనుకటి వంశముకంటె ప్రసిద్ధికెక్కెను. భాషాసేవకుడనియు, వీరుడనియు ప్రసిద్ధికెక్కిన కృష్ణదేవరాయ లీవంశమువాడు. ఇతడు 1509_30 వరకును రాజ్యముజేసెను. ఇతనికాలమున మనుచరిత్రకారకుడగు పెద్దన, వసుచరిత్ర రచించిన రామరాజభూషణుడు మొదలగు సుప్రసిద్ధ కవులుండిరి. ఆంధ్రకవులేగాక సంస్కృత కన్నడ కవులుగూడ నుండిరి. కృష్ణదేవరాయలుకూడ కవీశ్వరుడు. ఇత డముక్తమాల్యదను రచించెను.

కృష్ణదేవరాయలు రాజ్యమునకు వచ్చుసరికి దేశమరాజకస్థితియందుండెను. సామంతరాజులు తిరుగుబాటొనర్చిరి. బీజపురపు సుల్తానును గజపతియు విజయనగరపు రాష్ట్రముల నాక్రమించి శత్రువులైయుండిరి. రాయలు ముందుతగిన సైన్యమును సమకూర్చుకొని సామంతరాజులలొంగదీసి పైశత్రువులమీదకు బోయెను. బీజపురముననుండి రాయచూరు ముద్గల్లుకోటలను, గజపతులనుండి ఉదయగిరికోటను వశపరచుకొనెను. గజపతులనోడించి కొండవీడు నాక్రమించెను. అం

తట నుత్తరదిగ్విజయయాత్రకు బయలుదేరెను. దారిలో కోటలనాక్రమించి రాజమహేంద్రవరము పట్టుకొని యచ్చటనుండి సింహాచలమువరకునున్న దేశము నాక్రమించి సింహాచలమువద్ద జయస్తంభము నాటెను. గజపతిరాజు కృష్ణరాయలతో సంధిజేసికొని తనకూతురు నతనికిచ్చి వివాహముజేసెను. తరువాత 1520 లో బీజపురపుసుల్తానును రాయచూరువద్దనోడించి కృష్ణా తుంగభద్రానదుల మధ్యనున్న దేశమంతయు స్వాధీనము చేసికొనెను. ఈతని రాజ్యమున కృష్ణానదికి దక్షిణముననున్న హిందూదేశమంతయు నుండెను.

ఇతని రాజ్యమున న్యాయపరిపాలన హిందూయాచారములబట్టి యుండెను. వ్యవసాయమున కవసరమగు ఆనకట్లు, చెరువులు, కాలువలు మొదలయినవాటివిషయమై తగుజాగ్రత తీసికొనబడెను. వర్తకము బాగుగా సాగుచుండెను. ఇతడు విష్ణుభక్తుడగుటచే తిరుపతి మొదలగు స్థలములలో ననేక వైష్ణవాలయముల గట్టించెను. వీటిలో ముఖ్యమైనది విజయనగరమున గట్టబడిన విఠలస్వామి దేవాలయము. ఏమయినను నితనికి జనసామాన్యమున ప్రఖ్యాతి భాషాపోషకుడగుటచే వచ్చెను.

అనంతర మితనికుమారు డచ్యుతదేవరాయలు 1530-1542 వరకును, అచ్యుతదేవరాయల కుమారుడు 1542-1567 వరకును రాజ్యముచేసిరి. భామినీరాజ్యము చిన్నరాజ్యములక్రింద భాగింపబడి యాసుల్తానులు వారిలోవారుపోరాడుచు విజయనగరరాజుల సహాయము గోరుటచే విజయనగరరాజ్యము ప్రబల



మయ్యెను. పిచ్చివాడయిన తిరుమలరాజు కాలమున ప్రజలు తిరుగుబాటుచేయుటచే వారినణచుటకు తిరుమలరాజు మహమ్మదీయసైన్యముల దెచ్చి పట్టణముననుంచెను. దేశమున మహమ్మదీయులుండిన బ్రమాదము తటస్థించునని సేనానాయకులు మొదలగువారు తిరుమలరాజు నొప్పించి వారినిబంపివేసిరి. తిరుమలరాజు స్వహస్తముచే మృతినొందెను. రామరాజు రాజై మహమ్మదీయసైన్యముల నోడించి నాశనముజేసెను. మహమ్మదీయసుల్తానులు తామిదివరకుచేసిన పొరపాటునుగ్రహించి యందరేకమై విజయనగరరాజును 1565 లో తల్లికోటవద్ద నోడించిరి. ఈయుద్ధముతో విజయనగరరాజ్యము నశించెను గాని మహమ్మదీయసుల్తానులకు వారిలోవారికి సరిపడనందున విజయనగరరాజ్యములో కొంతభాగమే వారాక్రమించుకొనగలిగిరి. మిగిలినరాజ్యము చిన్నసంస్థానములయ్యెను. పోలిగార్లన్న పేరుతో విజయనగర సామంతరాజులు వీటిని పాలించిరి. రాజవంశమువాడయిన తిరుమలరాజు పెనుగొండకు బోయి యచ్చట రాజ్యమేర్పరచుకొనెను. ఈరాజులవద్దనుండియే బ్రిటిషువారు చెన్నపట్టణముగొనిరి. ఆనెగొందిరాజు రాజ్యము లేకున్నను విజయనగర రాజవంశపువాడనని చెప్పుకొనును.

విజయనగరపు ఔన్నత్యమునుగూర్చి పరదేశీయులిట్లు వ్రాసిరి. విజయనగరమునకు చుట్టును నేడుప్రాకారములుండెను. ఏడవప్రాకారమున రాజభవనముండెను. కోట ఎనిమిదిమైళ్ళ చతురము. కోటకు నాలుగుద్వారములుండెను. మొదటి మూడుప్రాకారములలోను పొలములు, తోటలు, కొద్ది

గానిండ్లును నుండెను. మిగిలినప్రాకారములలో నంగళ్లుండెను, విలువగల వస్తువులకు ప్రత్యేకబజారులుండెను. నవరత్నముల నమ్ముటకు రత్నబజారుండెను. ప్రజలందరు సామాన్యముగ బంగారు భూషణములధరించిరి. రాజభవనములు ప్రభుత్వము వారిచే గట్టింపబడిన దేవాలయములు మొదలగునవిగాక భాగ్యవంతులచే గట్టింపబడిన సొగసయినభవంతులుగలిగి విజయనగరమతి శోభస్కరముగా నుండెను. మహమ్మదీయులచే ధ్వంసముచేయబడినను నిప్పటికిని నశించగామిగిలినగట్టడభాగములు విజయనగరపుఔన్నత్యమును దెలుపుచున్నవి.



## ౮-వ అధ్యాయము.

## మహమదీయయుగమున హిందూదేశస్థితి.

మహమ్మదీయ రాజ్యము.

మహమ్మదీయు లుత్తరహిందూస్థానమున చాలభాగమును, దక్షిణమునగొంతయు సైన్యసహాయమున బరిపాలనజేసిరి. వీరు పెద్దపట్టణములబట్టుకొని యచ్చట నితరదేశపుమహమ్మదీయ కుటుంబముల గొన్నిటినినిలిపి వారిసహాయమున దమరాజ్యమును బాలించిరి. మిగిలినదేశమునుండి పన్నులనుగాని, రాజుల వద్దనుండి స్వల్పకప్పమునుగాని వసూలుచేయుచుండిరి. కప్పము పన్నులు సరిగాచెల్లిన హిందువుల మతసాంఘికవిషయములలో నంతగా జోక్యము కలుగజేసికొనెడివారు గారు. పర్వత ప్రాంతముల నున్న రాజులు మహమ్మదీయులతో బోరాడి గొంతకాలము



తమస్వాతంత్ర్యమును నిలబెట్టుకొనగలిగిరి. కాని మహమ్మదీయరాజ్యము నశించి చిన్న మహమ్మదీయ రాజ్యములు బయలుదేరి యీపర్వతప్రాంత రాజుల నోడించి వారికోటల బట్టుకొనిరి.

మహమ్మదీయ పరిపాలన

రాజు నిరంకుశాధిపతి. మహమ్మదీయ న్యాయచట్టములున్నను నవి యుద్యోగు లనుసరించుటకేగాని రాజునడ్డుటకు బనికిరాకుండెను. పరిపాలనలో ప్రజలయొక్క సౌఖ్యాసౌఖ్యములు రాజుస్వభావమువిూదనుండెను. రాజు సన్మార్గుడయిన ప్రజలు సౌఖ్యపడిరి; దుర్మార్గుడయిన ప్రజలస్థితి దుర్భరముగానుండెను. జాతిమతవివక్షతలేకుండ న్యాయమందరకు సమానముగానియ్యబడెను. రాజుక్రౌర్యమతని సన్నిధివారినేగాని జనసామాన్యమును నంతగా బాధించుటలేదు. కాని మహమ్మదీయ ప్రభుత్వము భిన్నమైనతరువాత చిన్నసంస్థానము లేర్పడుటచే రాజపుత్రప్రభువులయినను మహమ్మదీయప్రభువులయినను దమప్రజలను నిరంకుశపద్ధతిప్రకారము పాలించుటచే ప్రజలకు గష్టమయ్యెను.

మతవ్యాపన.

మహమ్మదీయచక్రవర్తులు బలిమిని హిందువుల మహమ్మదీయుల జేసిరి. కాని సామ్రాజ్య దూరభాగములయందున్న ప్రజలకంతయిబ్బంది లేకుండెను. హిందువులు మహమ్మదీయులయిన గావలెను లేక జిజియాయను తలపన్నునయిన జెల్లించవలెననుటచే హీనజాతులవారు మహమ్మదీయులయిరి. అగ్రజాతులు పన్నుజెల్లించి తమమతమున నేయుండిరి. పరిపాలనశాఖయందును సైన్యమునందును

హిందువులకు మంచియుద్యోగము లియ్యబడెను. ఆస్తివిషయమైనదావాలు మహమ్మదీయ న్యాయచట్టముప్రకారము పరిశీలింపబడినను నితరవిషయముల హిందూసాంప్రదాయమే యములులో నుండెను.

అధికారస్థితి.

ప్రజలు సౌఖ్యముగనే గాలక్షేపము చేయగలిగిరి. మహమ్మదీయరాజులుకూడ ప్రజాసౌఖ్యమునకే పాటుపడిరని చెప్పకతప్పదు. ఈకాలమున గట్టబడిన యిండ్లు కాలువలు తూములు వంతెనలు చికిత్సశాలలు నాకాలపు సౌఖ్యస్థితిని దెలుపుచున్నవి.

ఆచారవ్యవహారములు.

ఆచారవ్యవహారములమార్పు లంతగాలేవు స్త్రీలకిదివరకున్నంత గౌరవములేదు. మహమ్మదీయభయముచే స్త్రీలుబహిరంగముగ తిరుగుటలేదు. ఘోషాపద్ధతి మహమ్మదీయులజూచి భాగ్యవంతులగు హిందువులుగూడ నారంభించిరి. వేషభాషలలో మహమ్మదీయులను హిందువులనుసరించిరిగాని మహమ్మదీయనాగరికత హిందువులలో నిశ్చలమయినమార్పును గలుగజేసెనని చెప్పుటకు వీలులేదు.

సంస్కృతభాష.

విజయనగర సంస్థానపురాజులు భాషాపోషకు లగుటచే సంస్కృతము కొంతయభివృద్ధిజెంది యాభాషలో బుస్తకములు రచియింపబడెను. కానిసంస్కృతముయొక్క పూర్వపుటౌన్నత్యము పోయెను. శాస్త్రములుగూడ యభివృద్ధినొందలేదు. రాజావలంబనలేకుండుటయే దీనికిగారణము. ఈకాలమున స్మృతులు రచింపబడెను.



దేశభాషలు.

మతప్రచారకులీకాలమున సంస్కృతమునగాక దేశభాషలలో బ్రచారము జేసిరిగాన దేశభాషలభివృద్ధి జెందెను. చైతన్యునివలన వంగదేశభాషయు, నానకువలన పంజాబీయు, కబీరువలన హిందీయు, తుకారామ్ వలన మహారాష్ట్రభాషయు వృద్ధియయ్యెను. ఇదిగాక న్యాయస్థానముల దేశభాషలు వాడబడుటగూడ నీయభివృద్ధికిదోడయ్యెను. ఇదివరకున్న దేశభాషలుగాక యుర్దూయను క్రొత్త భాషయొకటి బయలుదేరెను. మహమ్మదీయులు తమసేవకులతోను నితరులతోను మాటలాడునపుడు దేశీయపదములు గొన్ని వాడవలసివచ్చుటచే నామాటలు తురకభాషనుజేరి యామిశ్రమభాష యురుదూ యయ్యెను. కాని యారోజులలో నీ భాషలో బుస్తకములు లేవు.

హిందూమతము.

మహమ్మదీయులొకేభగవంతుని పూజించువారగుటచే బ్రాహ్మణమతమున దీనిఫలితము గనిపించెను. బ్రాహ్మణమతమును దానిసిద్ధాంతములను నొప్పుకొనుచు భగవంతుడొకడేయని నమ్మకముగల గొన్నిమతములు బయలుదేరెను. ఈమతముల స్థాపించినవారు చైతన్యుడు, కబీరు, రమానందుడు, తుకారామునువారు.

శిల్పశాస్త్రము.

పఠానులు మొగలులవలె విస్తారముగా కట్టడముల గట్టలేదు. వారికట్టడములన్నియు డిల్లీలోను నాచుట్టుపట్లను నుండెను. సామ్రాజ్యము నశించినతరువాతనక్కడక్కడ మహమ్మదీయకట్టడములు బయలు

దేరెను. గౌరులోను, జౌన్పురమున, అహమదాబాదున, బీజపూరు రాజ్యముననున్న భవనములు ప్రసిద్ధములు. మహమ్మదీయభవనములు మిగుల పెద్దవిగను విస్తారము నగిషీపని గలిగినవియునయి యుండెను. ఈభవనములను హిందూదేవాలయములు పాడుచేసి వాటిసామగ్రితో మహమ్మదీయులు గట్టిరి.



# మొగలులు

## 1-వ అధ్యాయము.

### బేబరు క్రీ. శ. 1526-1530.

బేబరు తండ్రివంశమున టామర్లేనునుండియు తల్లివంశమున చెంగిజుఖానునుండియు జన్మించెను. కాన నితనిశరీరమందు టర్కి మంగోలు రక్తములు మిశ్రమమైయుండెను. ఇతనికి పండ్రెండవయేట నితనితండ్రి చనిపోయెను. అప్పటినుండియు నితడు పలుకష్టములపాలై రాజ్యమునుండి రాజ్యమునకు దరుమబడి తుదకు హిందూదేశపు చక్రవర్తియయ్యెను. ఇందుచే నితనికి కొంతమందిచరిత్రకారు లదృష్టదేవతయొక్క కాలిబంతియని పేరిడిరి. ఇతడింగ్లాండు రాజులయిన ఏడవ, ఎనిమిదవ హెన్రీల సమకాలికుడు.

తండ్రిమరణించిన తరువాతనితడు ఫెర్గానాకు రాజయ్యెను.

పూర్వచరిత్ర.

1497 లో సామార్కండును జయించెనుగాని కొద్దికాలములోనే నచ్చటనుండి తరుమబడి 1504 లో కాబూలు స్వాధీనపరచుకొనెను. 1508 లో పదభ్రష్టుడయి కొంతకాలము నిటునటు సంచారముజేసి కాబూలు తిరుగబట్టుకొని తనయధికారమును స్థాపించుకొనెను.

హిందూదేశమును జయించుట 1526

పంజాబు గవర్నరగు దౌలతుఖానులోడి యనునతడు ఢిల్లీచక్రవర్తియగు నిబ్రహీము దుర్మార్గుడగుటచే బేబరును హిందూదేశము పయికి దాడివెడల బ్రోత్సాహపరచెను. హిందూ

దేశమును గబళించుటకు సమయమునకై వేచియున్న బేబరు వెంటనే బయలుదేరి 1525 లో లాహోరును పట్టుకొని 1526 లో నిబ్రహీమును పానిపట్టువద్దనోడించి డిల్లీ స్వాధీనపరచుకొనెను. అఫ్ఘనులును, హిందువులునుగూడ నీక్రొత్త వారి రాకకయిష్టులై బేబరునకులోబడకుండిరి. అఫ్ఘనులు జాన్పూరువద్ద నొకప్రతిరాజ్యమును స్థాపింపయత్నింపగా వారినోడించి కాశీ పాట్నాలనతడు లోబరచుకొనెను. మీవారురాజగు రాణాసంగ్రామసింహుడు క్రొత్తవారలబారదోలిన హిందూరాజ్యమును స్థాపింపవీలగునని నాఫ్ఘనులపక్షముజేరి మొగలుల నెదిరించెను. కాని సంగ్రామసింహుడును నతనితోజేరిన రాజపుత్రవీరులును ఫత్తేపూరుసిక్రివద్ద 1527 లో నోడిపోయిరి. మొగలాయీరాజ్యము స్థాపింపబడెను. కాని బేబరు 1530 లో జనిపోయెను.

బేబరు విద్వాంసుడును కవియును నైయుండెను. తన స్వీయచరిత్రము నితడు వ్రాసెను. ఇతడు మొగలుచక్రవర్తులలోనన్నివిధములను స్తవనీయుడు. యుద్ధనైపుణ్యమునందేమి పాలనాశక్తియందేమి విద్యయందేమి ప్రపంచమున పేరెక్కిన జ్యూలియసుసీజరను రోమనువీరునకు సమానుడనిచెప్పనగును. దూరదృష్టి, జ్ఞానశక్తి, దయ మొదలగు గొప్పతనమును సూచించు చిహ్నము లితనియందుండెను. ఇతర మొగలాయీచక్రవర్తులకున్న డంబమీతనియొద్ద లేదు.





## 2-వ అధ్యాయము.

## హుమయూను క్రీ. శ. 1530-1556.

బేబరు చనిపోయిన వెనుక నతనికుమారుడగు హుమయూను రాజ్యమునకు వచ్చెను. ఇతడు ఖగోళభూగోళశాస్త్రములలో మంచిజ్ఞానము గలవాడు. సరళస్వభావుడు; పితృవాక్యపరిపాలన సోదరప్రేమ నితనిని గష్టములపాలు జేసెను. ఆకాలపుటాచారము ననుసరించి తమ్ములజంపించినను లేక నంధులజేసినను నితనికేచిక్కును లేకుండయుండెడిది. తండ్రియాజ్ఞానుసారము వారిని వేరు వేరు రాష్ట్రములకు పాలకులుగా జేసినందున వారు తిరుగబడుచుండుటయేగాక నితనికి కష్టదినములలో నిలువనీడనయిన నియ్యక నితనిని జంపుటకుగూడ బ్రయత్నించిరి. వారంత మొందిన తరువాతగాని నితనికి క్షేమము లేకుండెను.

రాజ్యభ్రష్టత.

గుజరాతుసుల్తానగు బహదూరుషా తిరుగబడినందున నతనిని 1534 లో నోడించి 1535 లో చాంపనీరుకోటనుబట్టుకొనెను. బీహారుగవర్నరగు షేర్ఖాను మొగలాయీల బారదోలి యాఫ్ఘనురాజ్యము స్థాపింప నుద్దేశముగలవాడై తిరుగబడినందున నతనినణచుటకు హుమయూను గుజరాతు వదలిన నది తిరుగ బహదూరుషా పాలయ్యెను.

షేర్ఖాను బంగాళమును జయించనుద్యుక్తుడై హుమయూనునకు దారిలోనున్నట్టియు తనకు జెందినట్టియు చానారు

రోతాసు కోటలలో గొంత సైన్యముంచి బంగాళమును జయింపబోయెను. షర్ఖానూహించిన ట్లితడు బంగాళమును జయించివచ్చువరకును హుమయూను చానారుకోటను బట్టుకొను ప్రయత్నములోనే యుండెను. చానారుపట్టుకొని హుమయూను ముందుకుబోగా షర్ఖాను చానారుకోటను తిరిగి తనవశముజేసికొని రాజధానికిని హుమయూనునకును రాకపోకల సంబంధము లేకుండజేసెను. అట్లితర రాజ్యములో కట్టుబడి వలయు సాధన సామగ్రి యింటినుండి రాకుండుటచే హుమయూను షర్ఖానుని సైన్యమును దాటి యింటికిబోవ ప్రయత్నించుటలో మొదటి చౌంఘిరువద్దను దరువాత బక్సారువద్దను నోడిపోయెను. కాని యెట్లో ప్రాణము దక్కించుకొని కొద్దిసైన్యముతో నాగ్రజేరెను. 1540 లో హుమయూను తిరుగ షర్ఖానుమీదకు బోయి కనోజివద్ద నోడింపబడి గంగానదినీదిదాటి శత్రువును నెదిరించుటకు దగిన సైన్యములేనందున లాహోరునకు బారిపోయెను. పంజాబుపాలకుడగు నితనితమ్ముడన్నకు సహాయము చేయుటకుబదులుగా పంజాబును షర్ఖానున కప్పజెప్పి యతనిక్రింద పాలకుడుగా నుండుటకొప్పుకొనెను. అందుచే హుమయూను సింధుదేశమునకుబోయి మార్వారురాజును శరణుగోరెను. అరాజంగీకరించకుండుటచే నక్కడనుండి యమరకోటకు బోయెను. అచ్చట నక్బరుపుట్టెను. అచ్చటనుండి కాంధారుజేరి యచ్చటను నిలుచుటకువీలులేక కాబూలునకధిపతియైన తనతమ్ముని సైనికులు తరుముకొనిరాగా నక్బరును వారికివదలి హుమయూను పరిష్యాకు బారిపోయెను. పరిష్యాచక్రవర్తి యితనికి



సగౌరవముగా నాతిథ్యమిచ్చెను. షియామతమవలంబించుటకును కాంధారిచ్చుటకును హుమయూనంగీకరించిన మీదట పరిష్యాచక్రవర్తి యితనికి సైన్యసహాయము చేయుటకు నొప్పుకొనెను.

షర్ఖాను షర్షాయను నామధేయముతో సింహాసనమెక్కెను. బేబరుతో విందారగించుచు కత్తిలేనందున తనకైజారుతో మాంసమును నితడుఖండించుటజూచి బేబరితడు గొప్పవాడగునని యనెనట.

షర్ఖాన్ 1540-1545

పాపము తనవంశమునకే హానిచేసి యితడు గొప్పవాడగునని బేబరు తలంచలేదు. ఇతడు గొప్పవీరుడును, పరిపాలకుడును నైయుండెను. అక్బరుకాలమున జరిగినవన్నె నేలపన్నువిషయమైన మార్పులితనికాలముననే యారంభమయ్యెనని కొందరు చెప్పుచున్నారు. ఇతనిరాజ్యకాలమున నితడు ప్రజలసౌఖ్యముకొరకు జాలపాటుపడెను. సింధునది మొదలు బంగాళమువరకును రోడ్డువేయించెను. ఈరోడ్డుప్రక్కల మధ్యమధ్యసావిడులు నూతులు నిర్మింపబడెను. ఒకయూరునుంచి యింకొకయూరునకు నుత్తరములదీసికొనిపోవుటకు గుర్రపురౌతుల మొదటిసారి నియమించినవాడితడే.

ఇతడు రాజ్యమునకు రాగానే బంగాళమున దిరుగుబాటు సంభవించిన దానినణచి మార్వారురాజ్యముపయికి దండెత్తెను. ఎడారియగు రాజపుత్రస్థానమున చాలకాలము వ్యర్థపుచ్చి చివరకువిసిగి పిడికెడు బియ్యముకొరకు హిందూదేశపు రాజ్యమును బోగొట్టుకొంటినని విచారించెను. తరువాత చిత్తూ

ముబట్టుకొని కాళింజరుకోటనుముట్టడించుచుండగా ఫిరంగిమం దంటుకొని ప్రేలి దెబ్బతగులుటచే నతడు 1545 లో చనిపోయెను. ఇతనితరువాతవారు బలహీనులగుటచే నెక్కడకక్కడ స్వతంత్రరాజ్యము లేర్పడెను. సికందరుసురు పంజాబు ఆగ్రాల నాక్రమించెను.

హుమయూను తిరిగివచ్చుట 1555.

ఈసమయమున హుమయూను కాబూలును జయించి 1555 లో హిందూదేశమున బ్రవేశించెను. సర్హిందువద్ద సికందరునోడించి ఢిల్లీకిబోయి సింహాసనమెక్కెను. అక్బరు సికందరును దరుముచు పంజాబున నుండెను. హుమయూను మేడమెట్లుదిగుచు కాలుజారిపడి చనిపోయెను. అఫ్ఘనురాజులమంత్రియగు హేమూ బంగాళముజయించుచు నీవార్తవిని యాగ్రాకుబోయి యదిపట్టుకొని యచ్చటనుండి ఢిల్లీవెళ్ళి సింహాసనమెక్కెను. పంజాబులోనున్న యక్బరుమీదకు హేమూ యుద్ధమునకు బోయెను. అక్బరుననుచరు లతనిని కాబూలుపారిపొమ్మనిసలహానిచ్చిరిగాని యతనికిగాని యతనిసంరక్షకుడగు బైరముఖానునికిగాని పారిపోవుట యిష్టములేక యుద్ధమునకు సిద్ధపడిరి. బైరముఖాను హేమూను 1556 లో పానిపట్టువద్దనోడించెను. హేమూ యుద్ధమునచనిపోయెను. అక్బరును సింహాసనమెక్కించి బైరమతనిపక్షమున పరిపాలన జేయసాగెను.





## ౪-వ అధ్యాయము.

## అక్బరు 1556—1605.

అక్బరు సింహాసనమెక్కునరి కతనికి పదమూడుసంవత్సరములుండెను. బైరము పేరునకు మంత్రిగానుండి యధికారమంతయు తానే చలాయించుచుండెను. ఇతడు క్రూరుడు. రాజ్యమున దనకయిష్టులగు పెద్దయుద్యోగులజంపించి యక్బరనుమతినొందకుండ తనయిష్టప్రకారము రాచకార్యముల జరుపుచుండుటచే నక్బరున కయిష్టత గలిగెను. ఒకనాడిద్దరును వేటకుబోగా తల్లికి జబ్బుగానున్నదనుమిషచే నొక్కడు నింటికి దిరిగివచ్చి యక్బరుస్వంతముగా వ్యవహారములు జూచుకొందునని ప్రచురించెను. బైరమందుల కిష్టపడక తిరుగబడినందున నతనినిజయించి శిక్షింపక క్షమించి మక్కాకుబోవ నాజ్ఞజేసెను. అతడోడయెక్కుటకు పశ్చిమతీరమునకుబోవ నతనిశత్రువులెవరో యతనిని బొడిచిచంపివేసిరి.

అక్బరు రాజ్యపద్ధతి.

మొగలుసామ్రాజ్యము పేరుగొప్పయేగాని కాబూలు పంజాబు ఢిల్లీలే మొగలులక్రింద నుండెను. శేషించిన దేశమంతయును చిన్నచిన్న స్వతంత్రసంస్థానములైయుండెను. కాన వీనినన్నిటిని జయించి రాజ్యముస్థాపించుట యక్బరుచేయవలసినపనులలో మొదటిది. కానిఅక్బరు మొగలువంశీయుడగుటచే నాఫ్ఘనులుగాని యుద్యోగులుగాని ప్రభువులుగాని యతనికి మనస్ఫూర్తిగా సహాయము జేయకుండిరి. అక్బరుసైన్యముననున్న మహమ్మదీ

య వీరులు పరదేశస్థులును ధనసంపాదనకొరకు జేరినవారునునగుటచే మొగలురాజ్యస్థాపనకొరకు పట్టుదలతో పనిచేతురన్న నమ్మకములేకుండెను. మహమ్మదీయులు తమమతమునకు విరోధులని హిందువులు వారిని ద్వేషబుద్ధితో జూచుచుండిరి. తనతండ్రితాతలు దేశముల జయించిన నంతమాత్రమున రాజ్యము సుస్థిరముగాలేదని నెరిగినవాడగుటచే తాను జయించిన దేశములను శాంతిమార్గములచే నిలబెట్టుకొనవలయు నని యతడు గ్రహించెను. రాజపుత్రస్త్రీల వివాహమాడియు, మహమ్మదీయరాచస్త్రీల హిందూరాజులకిచ్చియు, హిందువుల కున్నతపదవు లిచ్చియు, హిందూమతముజోలికి బోకయు, హిందువులను మహమ్మదీయులను నొకేవిధముగా బరిపాలించియు, హిందువుల కసహ్యమగు నిబంధనలదీసివేసియు నక్బరు తనరాజ్యమును బలపరచుకొనెను. హిందువులును మహమ్మదీయులును సైన్యముననుండుటచే హిందువుల నణచుటకు మహమ్మదీయసైన్యములను, మహమ్మదీయుల నణచుటకు హిందూసైన్యములను నుపయోగించుటచే హిందువులుగాని మహమ్మదీయులుగాని తిరుగబడుటకు వీలులేకుండెను.

అక్బరు జయములు రాజపుత్రస్థానము.

1567 వరకు నలహాబాదు, కాశీ, లక్నోల చుట్టునున్న దేశమునతడాక్రమించి శాంతిని నెలకొల్పెను. ఈరోజులలోనే యక్బరు మాళ్వాను గారమండలమును జయించెను. గారమండలపు రాణియగు దుర్గావతి స్వయముగా బోరాడి యోడిపోయినందున శత్రువులచేతులలో బడకుండ నామెయు నామెయొద్ద



నున్న స్త్రీలును నగ్నిప్రవేశము జేసిరి. ఇట్లగ్నిప్రవేశము చేయుట జోహారనిపిలువబడెను. ఇది రాజపుత్రస్థానమున మహమ్మదీయులకాలమున తరుచుగాజరుగుచుండెను. అక్బరు రాజపుత్రస్థానమునకు దిగ్విజయార్థమై బయలుదేరెను. రాజపుత్రస్థాన రాణాయగు ఉదయసింగు, జయపురపురాజగు బిహారమల్లు, జాధ్పురపురాజగు మాల్దేవు మొదలగు రాజపుత్రస్థానాధీశ్వరులయిదుసంవత్సరము లక్బరు నెదిర్చిరి. జయపుర జాధ్పుర రాజులోడిపోయిరి. జయపురపురాజు తనకూతురు నక్బరునకును, జాధ్పురపురాజు తనమనుమరాలి నక్బరుకుమారుడగు జహంగీరునకును పరిణయమొనర్చిరి. ఉదయసింగు లొంగనందున గఢమువిూద నక్బరు చిత్తూరుపట్టుకొనెను. ఉదయసిం గారవల్లి పర్వతములకు బారిపోయెను. అతనికుమారు డుదయపురమును నొకసంస్థానమును స్థాపించి పైతృకమయిన రాజ్యములో గొంతభాగము తిరుగజయించెను. తక్కిన రాజపుత్రులు మొగలాయి రాచకుటుంబమునకు బందుగులగుటచే మొగలుసామ్రాజ్యమున గొప్పయుద్యోగముల బడసిరి.

ఆఫ్ఘనురాజ్యములు.

హిందువు లట్లు మిత్రులగుటవలన వారిసహాయమున నాఫ్ఘనురాజ్యముల నక్బరు జయింపసమకట్టెను. గుజరాతుప్రభువు తనదేశమున నున్న సామంతప్రభువులను లొంగదీసికొనలేక నక్బరును బిలువగా నక్బరు శాంతిస్థాపన జేసి యాప్రభువునుమతివిూద నా దేశమునాక్రమించుకొనెను. 1576 లో దావూదుఖాను నోడించి బంగాళాదేశమును దానితో బీహారును స్వాధీనపరచు

కొనెను. పదునాల్గవశతాబ్దమున కాశ్మీరమును నొకయాఫఘనుడు హిందూరాజులనుండి జయించెను. అంతటినుండియునది యాఫఘనుల పాలనలో నుండెను. 1586 లో నక్బరు కాశ్మీరమును జయింపనిశ్చయించి యాదేశముననున్న నంతఃకలహముల నణచవలెనన్న మిషచే నక్బరు కష్టముమీద కాశ్మీరమును జయించెను. ఈదేశమింతటినుండియు మొగలుపాలనమున నుండి వారికి వేసవికాలమున నివాసస్థానమయ్యెను. 1591లో సింధుదేశమును జయించి యారాజును తనదర్బారున నుమ్రావు జేసెను. 1594 లో కాంధారును పరిష్యనులనుండి తిరుగజయించెను. దక్కనుననున్న నాష్ఘనురాజ్యముల జయింప నక్బరు ప్రయత్నించెనుగాని నచ్చటంతగా జయముమ పొందలేదు. అహమదునగర రాచకుటుంబములోగలకలతలను కారణముగ దీసికొని అక్బరహమదునగరమును ముట్టడించెను. కాని యాపట్టణమున సుప్రసిద్ధురాలగు చాందుబీబీ యనునామె పాలించుచుండెను. ఆమె తానుస్వయముగా యుద్ధమునబాల్గొని తనసైన్యమును బ్రోత్సాహపరచి మొగలాయి సైన్యముల దరిమివేసెను. 1566 లో నక్బరు విసిగి సంధిచేసికొనెను. కాని కొద్దిమాసములలోనే యహమదునగరముతో తిరిగి యుద్ధమారంభమయ్యెను. బీజపూరు గోలకొండసుల్తానులు మొగలులవలన దమకుగలుగబోవు నష్టమునుగ్రహించి చాందుబీబీకి సహాయము జేసిరి. చాందుబీబీ మొగలులతో బోరుటవలన లాభములేక సంధిమాటలు జరుపుచుండ నామెచంపబడెను. అహమదునగరము మొగలులపాలయినను నహమదునగరమున



పూర్వపురాచకుటుంబమే మునపటికన్న తక్కువ వైభవముతో 1637 వరకు రాజ్యముచేయుచుండెను. బీరారు గుజరాతులకు మధ్యనున్న కాండేషును జయించి యక్బరింటికి మరలెను.

అక్బరు రాజ్యవిధానము.

దేశమున శాంతినెలకొల్పుటకు శాంతిసాధనములే నుత్తమములని గ్రహించి యటుల తానుక్రొత్తగాసంపాదించిన దేశముల తనయధికారముల స్థిరపరచుకొనెను. పక్షపాతము, కాఠిన్యము నసంతృప్తికిగారణములని వాటికిజోటియ్యకుండ రాజ్యపాలనజేసెను. జయించిన దేశములయొక్క ప్రభువులకు తనసైన్యమున గొప్పయుద్యోగములిచ్చి వారిని తనవారినిగా జేసికొనెను.

రాజ్యవిభజన.

విశాలమగు తనరాజ్యమును రాష్ట్రములక్రింద విభజించి పాలకుల నియమించెను. రాష్ట్రములకు సుభాలనియు, పాలకులకు సుబేదారులనియు బేరులు. ఈసుబేదారులకు వారిరాష్ట్రమందు పరిపాలనసైన్యశాఖలపై సంపూర్ణాధికారముండెను. పన్నులు వసూలుజేయుటకును, న్యాయవిచారణకును దివానను నొకయుద్యోగియు, సేనాధిపతియు, న్యాయాధికారియు సుబేదారుక్రింద నుండిరి. దివానుద్యోగము పాదుషాచేనియ్యబడుచుండుటచే సుబేదారు దివానులు సాధారణముగా మిత్రులుకాకుండిరి. సుబేదారు నాజ్ఞలను పాదుషాకు విచారించు హక్కుండెను.

దేశమంతయు గొలిచి మూడవపాలుపంట రాజునకు

పన్నులపద్ధతి.

హితిచ్చునట్లేర్పాటయ్యెను. ఈపన్ను సరకురూపమునగాక ధనరూపమున జెల్లించవలసియుండెను. భూములపంటనుజూచి శిస్తుతగ్గించవలసిన తగ్గించుటకు మొదటనేటేట జమాబందీయుండెను. కానియుద్యోగస్థు లక్రమముగా బ్రవర్తించినందున నది జనులకు బాధగానుండెను. కాన యేటేటజమాబందిరద్దయి పదిసంవత్సరముల కొకసారి యేర్పాటయ్యెను. పన్నులసొమ్మంతయు నాగ్రాఖజానాకు బంపబడినదరువాత నచ్చటనుండి ఖర్చులవిషయమై చలామణి చేయబడెను. ఈపద్ధతినేర్పాటుజేసినవాడు రాజాతోడరమల్లుడు. హిందువులనుండి యదివరకు వసూలుచేయబడుచున్న జిజియాయను నక్రమపుపన్నును, హిందూయాత్రికులమీది పన్నును నక్బరు తీసివేసెను. నేలపన్నుగాక వర్తకము మొదలగువాటిమీదగూడ పన్నుండెను.

న్యాయపద్ధతి.

చక్రవర్తియే న్యాయశాఖకధిపతి. రాజధానులయందు మిర్-ఇ-అదిలను ప్రధానన్యాయాధికారియు, పట్టణంబుల ఖాజీయను న్యాయాధికారియు నుండిరి. పట్టణముల పోలిసు మేజిస్ట్రేటుపనుల నిర్వర్తించుటకు కొత్వాలుండెను. పల్లెల న్యాయవిచారణయు రక్షణమును పెద్దభూస్వాములు జూచిరి. పల్లెలను సామాన్యముగా గ్రామకాపరి దొంగలు రాకుండ గాపాడుచుండెను. దొంగతనము జరిగిన నాదొంగల బట్టుకొనుపని వీనిదే. దొంగను దొంగయే పట్టుకొననగునని దొంగలగుంపునకు జెందినవారికీయుద్యోగముల నిచ్చుచుండిరి.



సైన్యపద్ధతి.

సైన్యము రెండువిధములుగా నుండెను. ప్రభుత్వపుస్వంతసైన్యము, పాలకులు యుద్ధసమయముల దీసికొనిరావలసిన సైన్యము. ప్రభుత్వసైన్యమున కాల్బలము, గుఱ్ఱపుదళము, ఏనుగులు, ఫిరంగులు నుండెను. సుబేదారుల సైన్యములు ముఖ్యముగా నశ్వదళములగుటచే మొత్తముమీద నశ్వదళము విస్తారముగానుండెను. పూర్వమునుండియు నొకనికి గొంత దేశముజాగీరిచ్చి దానికిగాను కొంతసైన్యమును నతడుతయారుగ నుంచుట యాచారమైయుండెను. కాని యక్బరీయాచారమును తీసివేసెను. జాగిరుదారులు జాగీరుల ననుభవించుటయేగాని వారుంచవలసిన సైన్యమును నుంచక యవసరమువచ్చినప్పుడు జనులను బోగుచేసి సైన్యరూపమును గలుగజేయుచుండిరి. అందుచే నట్టిసైన్యములు యుద్ధమున నిరుపయోగములయ్యెను. అదిగాక జాగీరుదారే ప్రభువుగా వారెంచుకొని చక్రవర్తికి వ్యతిరేకముగానయినను బోరుటకు సిద్ధముగానుండిరి. అక్బరు సైనికులకు జీతముల నేర్పాటుజేసి సేనానాయకులకే జాగీరులనిచ్చెను. అందుచే తరిఫీదయిన సైనికుల నుంచవలసినంత మందిని జాగీరుదార్లుంచిరి. సైనికులుగూడ నక్బరుసైనికులమని తెలిసికొనుటచే నక్బరువకెదురుగా బోరుటకు సమ్మతింపరయిరి. సమ్మతించినను వారినిజీతములిచ్చి బోషించుట జాగిరుదారులకు కష్టమయ్యెను. దీనిచే దేశమున శాంతికి భంగములేకుండున ట్లేర్పాటయ్యెను.

మతము.

అక్బరు మహమ్మదీయుడయినను సరళస్వభావుడగుటచే నితరమతస్థుల హింసించుట యితని కిష్టములేకుండెను. అబులుఫజలు స్నేహముగలిగిన దరువాత బాహాటముగా పరమతసహనమును క్రియారూపమున గనబరచెను. మహమ్మదీయ మతగురువులలో వివిధతెగలవారికి జరుగుచున్న వాగ్వాదమునుజూచి మహమ్మదీయమతమందతనికి నమ్మకముబోయెను. అన్నిమతములనిజమున్నదని తానునమ్మినందులకు నిదర్శనముగా నొకప్పుడు హిందువుల బొట్టును జందెమును ధరించెననిగూడ జెప్పుదురు. ప్రతి లక్ష్మివారమునను నన్నిమతములవారినిజేర్చి మతచర్చ తనయాజమాన్యమున జేయించి వినుచుండెను. ఏమయినను నావిష్ణుః పృథివీపతిః యనునార్యోక్తి తలకెక్క తానుప్రధానుడుగాగల యొకనూతన మతమును స్థాపించెను. తేజస్సునకంతకును ముఖ్యాధారమగు సూర్యుడేభగవంతుడనినమ్మి యతనికినిత్యమును పగలుసాష్టాంగనమస్కారములజేయుచు రాత్రులుగూడ నగ్నిదీపము వెలిగించగనే దీపమునకు జేయుచుండెను. ప్రజలందరు దేవునిప్రతినిధియగు చక్రవర్తికి సాష్టాంగపడవలెనని యాజ్ఞాపించెను. అతనియాస్థానముననున్న మహమ్మదీయహిందూప్రముఖులలో గొందరకీమతము సరిపడక వారది యవలంబింపమనినను వారి నక్బరు శిక్షింపలేదు. ఇతనికి హిందూ క్రైస్తవ భార్యలు గూడనుండిరి. వారిని వారిమతమునసుసరించుట కభ్యరడ్డుపెట్టలేదు. ఇతరమతసహనమున్నను తనమతమునందు పట్టువల యితనికి బోలేదు. అక్బరువద్ద నుపకారముపొందవలెనన్నచో



నీమత మవలంబింపవలసినదే. ఇతని సమకాలికురాలును నాంగ్లదేశపురాణియు నగు నెలిజబెత్తువకువలెనే నీతనికిని యేమతమునందునను నమ్మకము లేదేమోయని సంశయము పుట్టకమానదు.

సాంఘికాచారముల మార్పులు.

పసిపిల్లలకు పెండ్లియు, భార్యలు భర్తలతో సహగమనము జేయుటయు నక్బరు నిషేధించెను. విధవావివాహములు జేసికొనుటకు న్యాయశాస్త్రమడ్డురాదని ప్రకటింపబడెను. మతాంతరవివాహములుకూడ నాకాలమున జరుగుచుండెను. వివాహమునకు వధూవరులయొక్కయు వారితలిదండ్రులయొక్కయు ననుమతి యవసరమనిశాసించెను. ఒకడనేకస్త్రీల వివాహమాడుటయు, స్త్రీలు తమకంటె చిన్నపురుషులను వివాహమాడుటయు నతడు గర్హించెను.

అక్బరుస్వభావము.

అక్బరు బహుదయాళుడును శాంతిప్రియుడునై యుండెను. తప్పనిసరివచ్చినగాని ప్రజలను శిక్షించుట కిష్టపడలేదు. మెత్తనిమనస్సుగలవాడగుటచే యుద్ధరంగమందు తనయవసరముండినంతకాలమే యుండి ప్రజానష్టముజూడలేక వెంటనే శిబిరమునకు బోవుచుండెనట. యుద్ధముల బట్టుకొనబడినవారిని బానిసలజేయు నాచారము మాన్పించుటయేగాక హిందూపద్ధతి ననుసరించి శరణాగతుల రక్షించుటయుగూడ గలదట. చిన్నతనమున విద్యాగంధమేమియు లేకున్నను, విద్యయందాసక్తిగలవాడై విద్యనేర్చుటయేగాక విద్యావంతుల నాదరించి భాషాసేవజేసెను. ఇతని

యాస్థానమున ఫెయిజీ, బదాని యను ప్రసిద్ధికెక్కిన పారశ్య సుకవులును, రాచకార్యములలో పేరొందిన అబూలుఫజలు, తోడరమాలు మున్నగువారును, సమయస్ఫూర్తికి ప్రసిద్ధికెక్కిన బీరబలుడను బ్రాహ్మణుడును, సంస్కృత, ఉర్దూ, హిందూస్థానీ కవీశ్వరులును నుండిరి. దీనిలో చిత్రమేమనగా నా ప్రసిద్ధపురుషులు యుద్ధమునగూడ సేనానాయకులుగ పేరువడసిరి. అక్బరు 1605 లో జనిపోయెను.



## 4-వ అధ్యాయము.

## జహాంగీరు 1605—1627.

అక్బరు మరణానంతరమున నతనికుమారుడగు సలీము జహాంగీరను నామమున రాజ్యమునకువచ్చెను. జహాంగీరనగా ప్రపంచమును జయించినవాడని యర్థము. ఇతడు క్రూరుడును సోమరియు త్రాగుబోతును చపలచిత్తుడును నై యుండెను తండ్రివలెగాక నితడు మహమ్మదీయమతమందు పట్టుదలగలిగియుండెను. నూర్జహానుని వివాహమాడినయనంతర మితని నడవడి గొంతమారెను. ఇతడొక దేశమునయిన పైతృకమయిన రాజ్యమునకు జేర్చలేదు. ఇతనికాలమంతయు త్రాగుడు మొదలగు చెడువ్యాపారములయందును, పితూరీల నణచుటయందును గడచెను.

ఇతడు రాజ్యమునకురాగానే నితనికుమారుడగు ఖుస్రూ



పితూరీలు. రాజపుత్రుల సహాయముబడసి తిరుగబడి లాహోరునువశపరచుకొనెను. జహాంగీరతనిని యుద్ధమున నోడించి గొంత సైన్యముతో గూడ బట్టుకొనెను. సైనికులగొందర కొరతనువేయించి ఖుస్రూనామార్గమున ద్రిప్పించి జనిపోవువరకతనిని ఖయిదులోనుంచెను.

నూర్జహాను. జహాంగీరురాజ్యకాలములో చాలభాగమతని రాణియగు నూర్జహాను తంత్రములతోడనే నరిపోయెను. నూర్జహానొక బీదపారశ్యను దంపతులకు బుట్టెను. వారామెను పెంచలేక రహదారిప్రక్కవదలిరి. ఆమెయొకభాగ్యవంతుని కంటబడెను. అతడాబిడ్డ రూపలావణ్యములజూచి యింటికిగొనిపోయి పెంచెను. అతడు చక్రవర్తి సన్నిధానవర్తి యగుటచే నీపిల్ల నూర్మహాలనునామమున నక్బరుజనానాయందు తరుచుగనుండుట తటస్థించెను. అనన్యసామాన్యసౌందర్యవతియగు నీమెనుజూచి జహాంగీరు మోహించెను. అక్బరట్టితగనికన్యను జహాంగీరు బెండ్లిజేసికొన నిష్టములేనివాడై షర్కానను నొకనికీమెనిచ్చివివాహముజేసి యతనికి బంగాళమున నున్నతోద్యోగమిచ్చి పంపివేసెను. కాని జహాంగీరామెను మరువలేదు. తాను రాజ్యమునకు వచ్చినవెంటనే బంగాళాదేశపు రాజప్రతినిధియు తనదాదిపుత్రుడునునగునొకనిని షర్కానువద్దకు బోయి యతనిభార్యను విడువుమనిచెప్పునట్లు జహాంగీరాజ్ఞాపించెను. అతడామాట జెప్పగనే షర్కానతనిని జంపి భార్యనుజంపబోగా నామెదాగుకొనెను. ఈలోపున రాజప్రతినిధిరక్షకసైన్యముషర్కానునిదుదముట్టించెను. నూర్మహాలు జహాం

గీరువద్దకు బంపబడి జనానాలో నుంచబడెను. మగనిజంపించెనని కోపముచేతనో, వెంటనే వివాహమాడిన జనులు నిందింతురనియో, యాలస్యము జేసిన జహాంగీరు తనకులోబడి యుండు ననియో లేక మరియే కారణముచేతనో నామె జహాంగీరును వివాహమాడుట కొప్పుకొనదయ్యెను. కొంతకాలమునకు నామె యంగీకరించినందున నిద్దరకునువివాహముజరిగెను అంతటినుండియు రాచకార్యముల సహితము నామెమాటయే జెల్లుచుండెను. ఆమెపేరుగూడ నాణెములమీద జెక్కబడెను. తాగుబోతైన భర్తను తనచాకచక్యముచే లొంగదీసికొని తన యిష్టమువచ్చినటుల జేయించుటయేగాక నతని నడతనుగూడ గొంతవరకు బాగుపరచెను. తండ్రిని మంత్రిగను సహోదరుడగు అసాఫుఖానుని సేనాధిపతిగనుజేయించెను. ఈమె మిక్కిల తెలివిగలదియు జాగరూకతగలదియునై తనయధికారముపోకుండుమార్గముల నరయుచు కాలక్షేపముజేసెను. ఈమె వివాహానంతరము నూర్జహాననునామమును ధరించెను. నూర్జహాననగా ప్రపంచదీపమని యర్థము.

దక్కను.

మలిక్కాంబరను నొకయోధుడు అహమదునగరరాజవంశమును నిలబెట్టుటకు ఔరంగబాదను పట్టణమును నిర్మించి, యదిరాజధానిగ జేసి మొగలులదేశమునుండి పారదోలెను. ఇతడు బహున్యాయముగా రాచకార్యముల జరిపెను. ఇతనిబుద్ధిని నాయ్యమందాసక్తిని జనులు పొగడిరి. తోడరుమల్లుని పన్నులపద్ధతి నితడహమ్మదునగరరాజ్యమున నవలంబించెను. రాజపుత్రస్థానమున నుదయపు



రపు రాణాను జయించినట్టియు తనప్రియపుత్రుడునునగు షాజహానుని 1616 లో నహమదునగరమునకుబంపెను. షాజహాను దక్కనుసుల్తానుల కూడికను భంగపరుపగా మలిక్కాంబరతనికి లొంగెను. కాని 1620 లో జహాంగీరు కాశ్మీరములో జల్లనిగాలిననుభవించుచుండ మలిక్కాంబరు తిరుగబడెను. షాజహాను తిరుగదక్షిణమునకు బోయి యుద్ధమున జయమందియు మంచిమాటలతో మలిక్కాంబరును తిరుగ పూర్వపుషరతుల మీదనే లొంగునట్లు జేసెను.

ఈసమయమున జహాంగీరు జబ్బుపడెను. జహాంగీరు చనిపోయినయెడల నెవ్వరురాజుకావలసినదన్న ప్రశ్న జనించెను. మొదటినుండియు షాజహానునకే రాజ్యము వచ్చునట్లుండెను. తండ్రికి ప్రియపుత్రుడు. ఖ్యాతివహించిన యుద్ధవీరుడు. అసాఫుఖానుని యల్లుడగుట చేనసాఫుఖానునకును నతనిసహోదరి నూర్జహానునకును నిష్టుడు. కాని యతనిశక్తిసామర్థ్యములజూచి నూర్జహాను తనయాటలతని రాజ్యకాలమున సాగవనితలంచి యతనితమ్ముడును తనకుప్రథమభర్తవలన గలిగిన కూతురుభర్తయునగు షారియారునకు రాజ్యమిప్పించ బ్రయత్నించుచుండెను. జహాంగీరు రెండవకుమారుడయిన పర్వీజుపక్షమును సేనాధిపతియు నసాఫుఖానుని తరువాత ప్రధానపురుషుడునునగు మహబతుఖాను డవలంబించెను. న్యాయము కూడ పర్వీజుపక్షముననే యుండెను. షాజహానుని బలమును తగ్గించుటకు యతనిసైన్యములో గొంతభాగమును కాబూలుపయికి దాడివెళ్లుచున్న షారియారునకు బంపమని జహాంగీ

రుచే నూర్జహాను షాజహానునకు తాఖీదునంపించెను. ఈ మోసము దెలిసి షాజహాను తిరుగబడి డిల్లీమీదకుబోయెను. అచ్చట జహాంగీరుచేనోడింపబడి తండ్రిదేశముల గొంతకాలమల్లరి జేసి తుదకు దక్షిణసంస్థానముల తలదాచుకొనెను.

నూర్జహాను మొదటినుండియు మహాబతుఖానుని గౌరవించి యతనిని తనపక్షమున నుంచుకొనెను. కాని యతడు పర్వీజుపక్షమున నుండెనని దెలిసి యతనినవమానించుటకు బూనుకొనెను. జహాంగీరాజ్ఞయైనదనియతనినిబిలిపించి యతనికిజహాంగీరు దర్శనము కానియ్యనందున నతడుకోపగించి తనదాపున నేయున్న సైన్యమును జేరి తిరుగబడెను. జహాంగీరతని నణచుటకుబోగా 1626 లో జీలమువద్ద మహాబతుఖా నతనినోడించి బందీగానుంచి యతని పేర రాజ్యపాలన తానుజేయుచుండెను. భర్తను విడిపించి తనయధికారమును తిరుగస్థాపించుటకు నూర్జహాను గొంతసైన్యమును గూర్చికొని మహాబతుఖానును నెదిర్చెనుగాని యోడిపోయెను. ఆయుద్ధము వ్యర్థమయినందున స్త్రీసహజమగు మాయనుపయోగించి జహాంగీరును మహాబతుఖానునిచేతులనుండి దప్పించెను. భర్తతోపాటు తానుగూడ ఖయిదుననుండుదనని జెప్పి జహాంగీరువద్దచేరి క్రమముగా మహాబతుఖానుని సైన్యమున గొందఱజీలదీసి తంత్రమువలన జహాంగీరును దప్పించెను. మహాబతుఖాను పర్వీజుచనిపోయినందున దక్షిణమునకుబోయి షాజహానుపక్షమున జేరెను. 1627 లో గాశ్మీరమునుండివచ్చు మార్గమున జబ్బుచేసి జహాంగీరు చనిపోయెను.



షాజహాను మామయగు అసాఫుఖాను నూర్జహానుతంత్రముల కడ్డుపెట్టుటకు కుస్రూకొడుకగు బులాకిని చక్రవర్తిని చేసి నూర్జహానును ఖయిదుననుంచి షాజహానునకు కబురుపెట్టెను. షాజహానువచ్చి డిల్లీపట్టుకొని తనకుటుంబముతప్ప మిగిలిన జహాంగీరుసంతతివారి నందరినిజంపి రాజ్యమెక్కెను.

జహాంగీరుకాలమున నాంగ్లదేశపురాజయిన మొదటిజేమ్సువద్దనుండి సర్ తామసురో యనునొక్కరాయబారి జహాంగీరునొద్దకు వచ్చెను. ఇతడప్పటి రాచనగరునుగురించి సవిస్తరముగా వ్రాసెను. తూర్పుదేశముతో వర్తకముచేయుచున్న నాంగ్లదేశపు వర్తకసంఘమునకు సదుపాయముల సంపాదించుటకును వారికిరావలసిన బాకీలు వసూలుచేయుటకు చక్రవర్తి సహాయము గోరుటకునువచ్చెను. జహాంగీరితనినిమర్యాద జేసెనుగాని యితడు వచ్చినపనికాలేదు. ఆకాలమున చేతిపనులయందు హిందువులు నేర్పరులనియు, దేశమభివృద్ధిదశయందుండెననియు నితడు వ్రాసెను. ఇట్టి రాయబారులే రాచనగరులలోగల వజ్రవైడూర్యాది రత్నములను ధనమును విలువగల వస్తుసామగ్రినిజూచి హిందూదేశభాగ్య మనంతమయినదని పడమర దేశముల జాటిరి. వీరికి సామాన్యజనులతో పరిచయము లేకుండుటచే వీరిట్లు తప్పభిప్రాయపడిరి.



## 5-వ అధ్యాయము.

### షాజహాను 1628–1658.

తండ్రికెదురుతిరిగినను, తండ్రివంశమువారినందఱజంపిం

చినను షాజహాను మొత్తముమీద దయాళుఁడును న్యాయవంతుఁడు నైయుండెను. తాతవలెనే హిందువులకును మహమ్మదీయులకునుగూడ సమానముగ నుద్యోగముల నిచ్చెనుగాని యతనికుండిన పరమతసహన మితనికి లేదు. ఇతని కాలమున హిందూదేశమున ప్రజలు సుఖముగానుండిరి. వర్తకము బాగుగా జరుగుచుండుటచే దేశమునజనులు భాగ్యవంతులయిరి. చక్రవర్తి రాబడిగూడ హెచ్చుగా నుండెను. ఇతని నామధేయము కుర్రాము. కాని షాజహానను పౌరుషనామమును రాజపుత్రుల జయించినందున తండ్రిపెట్టెను. షాజహాననగా ప్రపంచమును జయించినవాఁడని యర్థముగాని యితనికాలమున తనరాజ్యమునకు క్రొత్తదేశములనితడు జేర్చుకొనుటయే గాక కాంధారు మొదలగు పశ్చిమదేశములను బోగొట్టుకొనెను. ఇతఁడాంగ్లరాజగు మొదటిచార్లెస్సునకు సమకాలికుఁడు.

**షాజహానుని జయములు.**

దక్కనుననొకప్పుడు మొగలుసేనానియు, గోలకొండ నవాబునునగు ఖాన్‌జహానులోడి 1629 లో తిరుగబడిఅహమదునగరసుల్తాను సహాయమును బొందెను. దౌలతాబాదునద్ద వీరిని షాజహానోడించెను. ఖాన్‌జహాను మరణించుటచే పితూరీయడగెను.

మొగలులు దక్షిణమునబ్రవేశించిన నచ్చటనున్న నాల్గుసంస్థానముల స్వాతంత్ర్యమునకు భంగముగలుగునని యహమ్మదునగరపురాజు బీజపూరురాజును లేవదీసి 1630 లో యుద్ధసన్నద్ధుఁడయ్యెను. షాజహాను దక్షిణమునకు వచ్చుసరికి అహమదునగరపుసుల్తాను తనమంత్రిచే జంపబడెను. అతఁడు



షాజహానుతో సంధిగోరకు రాయబారముజరుపుచు నతడాగ్రా వెళ్లువరకు గాలక్షేపముజేసెను. మొగలు సేనానాయకుఁడగు మహాబతుఖాను బీజపూరు జయించలేకపోయినను నహమ్మదునగరమునుమాత్రము జయించెను. కాని శివాజితండ్రియగు షాజీ యహమ్మదునగర రాచకుటుంబమును తిరుగనిలబెట్టెను.

షాజహాను 1635 లో దక్కనుకు రెండవసారి దాడివెడలెను. షాజీనియోడించి తరిమివేసి యహమ్మదునగరమునాక్రమించి బీజపూరును ముట్టడించుగా బీజపురపుసుల్తాను కప్పముగట్ట నొప్పుకొనెను. అహమ్మదునగర రాజ్యమును ధ్వంసముజేసి, బీదరుపట్టుకొని గోలకొండ సుల్తానునుండిగూడ కప్పముగొని యాగ్రకు తిరిగివచ్చెను. ఈజయములవలన శాశ్వతఫలితము లేమియు గలుగలేదు. దక్కనుసుల్తానులు మొగలులు దక్కనువిడిచివెళ్ళిన తరువాత స్వతంత్రులుగనే రాజ్యముజేసిరి.

దక్షిణమున దనకుఁగలిగిన జయములచే గర్వితుఁడై పైమూరురాజ్యములోనిభాగమగు బాక్కును బట్టుకొనుటకు షాజహాను సైన్యములబంపెనుగాని జయము చేకూరలేదు సరికవా పరిష్యనులు కాంధారును తిరుగలాగికొనిరి.

**సోదరులయుద్ధము.**

అదియేమి భగవన్నిర్మాణమోగాని మొగలురాజ్యమున నక్బరుకాలమునుండియు కొడుకులు తండ్రులపై దిరుగుబాటుచేయుటాచారమయ్యెను. దీనికి ప్రాపంచికకారణము లేకపోలేదు. చక్రవర్తులు దమపుత్రుల రాష్ట్రములకధిపతులుగజేసి వారియధీనమున గొం

తసైన్యముంచుటచే వారు పితృభ్రాతృప్రేమల జంపుకొని కేవలరాజ్యాసక్తులై యుద్ధసన్నద్ధులగుచుండిరి. మొగలుచక్రవర్తులలో షాజహానుగతి మిగుల విచారకరమయినది.

షాజహానునకు నలుగురుపుత్రులుండిరి. వారు క్రమముగా దారా, షుజా, ఔరంగజేబు, మురాదనువారు. దారా సత్యప్రియుడు; మంచిగుణములు గలవాడు. పేరునకు మహమ్మదీయుడేగాని యక్బరువలె సన్నిమతములు నిజములేయని నమ్మెను. ఇతడు రాజపుత్రులకిష్టుడు. షుజా మహమ్మదీయుడేగాని షియామతస్థుడు. సంతోషముగా కాలక్షేపము జేయుటయం దిష్టముగలవాడు. ఔరంగజేబు మహమ్మదీయులలో సున్నీ తెగవాడు, టక్కరి, గడుసువాడు. మురాదుగూడ సున్నీమహమ్మదీయుడేగాని త్రాగుడు మొదలగు దురభ్యాసములుగలవాడును, మూఢుడును, దూరాలోచన శూన్యుడునునైయుండెను.

షాజహాను దారాను ప్రేమించుటచే నతనిని యువరాజును జేసి తనయొద్దనుంచుకొనెను. షుజాను బంగాళా దేశమునకును, ఔరంగజేబును దక్కనునకును, మురాదును గుజరాతునకును బరిపాలకులుగ నియమించెను.

1657 లో షాజహాను జబ్బుపడెను. షాజహాను మరణించిన దారాకు రాజ్యమియ్యబడునని దెలిసి ముగ్గురన్నదమ్ములు మూడుప్రక్కలను లేచిరి. ఔరంగజేబు కపటిగాన యొంటరిగా దారాతో బోరుట లాభములేదని గ్రహించి దనకు రాజ్యముజేయ నుద్దేశములేదనియు, మెక్కాకు బోదుననియు, మ



హమ్మదీయమతమందు నమ్మకములేని దారాను పదభ్రష్టుని జేసి మురాదును చక్రవర్తిగా జేయుటే తనయుద్దేశమనియు, మురాదునకు దెల్పెను. మూఢుడగు మురాదామాటలునమ్మి తనసేనను ఔరంగజేబుసైన్యముతో గలిపెను. వీరుత్తరమునకు వెళ్ళకపూర్వమే దారా రాజపుత్రసహాయమున షుజానోడించెను. ఈలోపున ఔరంగజేబు మురాదు లుత్తరహిందూస్థానమునకువచ్చి యుజ్జయినివద్ద దారా నోడించిరి. 1658 లో నాగ్రవద్దగూడ దారా యోడిపోవుటచే రాజ్య మౌరంగజేబు పాలయ్యెను. ముగాదును చక్రవర్తిగా బ్రకటించి నాగ్రాకు బోయి యెంతజెప్పినను దండ్రి దారాపక్షము వదలకుండుటచే నౌరంగజేబతనిని ఖయిదులోబెట్టెను. మురాదుత్రాగుబోతగుటచే సింహాసనమెక్కుట కనర్హుడని యతనిని గ్వాలియరు కారాగారముననుంచి యచ్చటజంపించెను. తాను 1658 ఆగష్టు నెలలో సింహాసనమెక్కెను. దారానొకరాజు ద్రోహముజేసి యౌరంగజేబున కప్పజెప్పగా నతనినొక చచ్చారి యేనుగమీద నూరంతయుద్రిప్పించి చివరకు తలదీయించెను. షుజా యారకానునకు బారిపోయెను. అతడేమయ్యెనో దెలియదు. షాజహాను 1666 లో జనిపోయెను.

షాజహానుగొప్పతన మతడుగట్టించిన భవనములనుండి వచ్చినది. తనభార్యయగుముమతజుమహలు చనిపోయినందున నామెకొరక గోరీకట్టించెను. ఆగోరీయే ప్రపంచమున బేరొందిన తాజమహాలు. ఇది యాగ్రాలో యమునవద్ద గట్టబడెను. ఆగ్రాకోటలో మోతీమస్జిదను నొకమసీదు గట్టింపబడెను.

రాజధాని ఢిల్లీకి మార్చవలెనన్న యుద్దేశముతో ఢిల్లీలో జామా మస్జిదను నొక మసీదును నొక గొప్ప రాజభవనమును షాజహాను కట్టించెను. ఇతడు నెమలిసింహాసనము నొకదానిని జేయించెను. అది వజ్రవైడూర్యాది రత్నములతో నలంకరింపబడి చూపరులక ద్భుతమును గొలుపుచుండెను. దీనికి 6½ మిలియనుల పౌనులగునని యిప్పటిపాశ్చాత్యు లంచనా వేసిరి. అనగా 97,50,00,000 రూపాయిలు. పరిపాలనఖర్చులు భరించుచు యుద్ధముల జేయుచు నింతధనము నిట్టిపనులకు వెచ్చించుటకు మొగలుచక్రవర్తుల కెట్లువీలయ్యెనో గదా!



## 6-వ అధ్యాయము.

## ఔరంగజీబు 1658–1707.

ఔరంగజీబు కాలమున మొగలురాజ్య మత్యున్నతపదవి నొంది యంతటనుండి క్షీణింపసాగెను. ఔరంగజీబు బుద్ధికుశలతగలవాడును, రాచకార్యనిర్వహణమందు ప్రజ్ఞగలవాడును, యుద్ధనైపుణ్యముగలవాడునునగుటచేత రాజ్యమాతనికాలమున వృద్ధియయ్యెను. వృద్ధిక్షయములకే కారణమను ప్రతీతిప్రకార మీతనికాలముననే రాజ్యముక్షీణింప నారంభించెను. ఈ క్షీణతకనేక కారణములున్నను ఔరంగజీబుచేసిన యొకపెద్ద పొరపాటు ముఖ్యకారణములలో నొకటని చెప్పకతప్పదు. దక్కనునందున్న మహమ్మదీయరాజ్యములగు బీజపూరు గోల్కొండలను నాఫఘనురాజ్యములన్న కారణముచే నౌరంగజీబు



నాశనముజేసెను. ఇవియుండిన మహారాష్ట్రుల నణగద్రొక్క లేకపోయినను వారు విజృంభించకుండ చేయగలిగియుండెడివి. మొగలురాజధాని దూరముననుండుటచే మహారాష్ట్రులయాటలుసాగెను. వారు మొగలురాజ్యమునకు వేరుపురుగులయిరి.

ఔరంగజీబు రాజ్యాంగ పద్ధతి.

ఔరంగజీబునకు తనమతమునందమితమయిన పట్టుదల యుండెను. పరమతసహనమన్న నతనికిగిట్టదు. హిందువులనేగాక సున్నీలుకాని మహమ్మదీయులనుగూడ నతడుబాధించెను. రాజ్యమునకు భంగకరమనితోచినను హిందువులను మహమ్మదీయులనుగూడ నతడుబాధించెను. మహమ్మదీయేతరులకు తలపన్ను విధింపబడెను. హిందువుల నుద్యోగములనుండి దప్పించి వారి దేవాలయముల బాడుజేసి యుత్సవములను జాతరలను మాన్పించి యక్బరుకాలమునుండియు మిత్రులుగనున్న రాజపుత్రుల శత్రువుల జేసెను.

ఇతడక్బరువలెనే దేశమును సుభాలక్రిందభాగించి పాలకుల నియమించినను మొదటనుండియు కలుషస్వభావుడగుటచేతను కపటమువలన తాను రాజ్యముసంపాదించి యుండుటచేతను నెవ్వరినినమ్మక ప్రతివ్యవహారమును తానేచూచుకొనెను. సుమారు హిందూదేశమంతయు వ్యాపించియున్న రాజ్యపువ్యవహారములన్నియు నొక్కడేచూచుకొనుటచే వ్యవహారములుపాడై రాజ్యమునకు భంగముగలిగెను. పాలకులకు చక్రవర్తియందభిమానము లేకుండెను. చక్రవర్తి యాజ్ఞలేనిది యేమిచేయుటకును వీలులేక వెంటనే యణగద్రొక్కవల

సినపితూరీలను పాలకులు రాజాజ్ఞయగువరకు నుపేక్షించుటచే నవిపెరిగి పెద్దవియై నణచవీలుదప్పి శాంతిభంగమునకును రాజ్యనాశనమునకును గారణములయ్యెను.

ప్రజలకు న్యాయమిచ్చువిషయమై మొగలుచక్రవర్తులలో నెవ్వరికినిత క్కుదీసిపోలేదు. తనయొద్దకువచ్చిన వివాదలను బహున్యాయముగా బరిశీలించెను. సరిగా న్యాయమియ్యని యుద్యోగుల శిక్షించెను. కాని పాలకులు దూరముననుండుటచే చక్రవర్తి భయములేక తమయిష్టప్రకారము ప్రజల బాధించిరి. మానప్రాణములకు రక్షణములేకుండెను. ఆస్తి విషయమై చెప్పనక్కరయేలేదు.

హిందువులతో యుద్ధము.

1676 లో సత్యనారాయణులను నొకహిందూమతభక్తులసంఘముతో నౌరంగజేబుపోరాడి కష్టముమీద వారిని నార్నోలుయొద్దనోడించెను. ఆగ్రయొద్ద జాటులును, పంజాబున సిక్కులును దిరుగబడిరి. కాని ఔరంగజేబు శక్తినంతయుబీల్చి పిప్పిచేసినవారు రాజపుత్రులును మహారాష్ట్రులును.

రాజపుత్రస్థానము.

ఔరంగజేబు మతవ్యాపనకై రాజపుత్రస్థానముపయికి వెడలెను. ఔరంగజేబు జాధ్పురిపురాజయినజస్వంతునిరాణిని పిల్లలను మోసముచేయుటచే రాజపుత్రులిదివరకే మొగలులయెడల విముఖులై యుండిరి. జస్వంతు ఔరంగజేబుసేనానాయకుడై యనేకయుద్ధములజరిపెను. కాంధారునకుబోయి యచ్చటనతడు చనిపోయినందున నతనికుటుంబము తిరిగివచ్చుచుండగా వారిని బందీలగా



బట్టుకొనితనయొద్దకుదీసికొనివచ్చుటకు నౌరంగజేబాజ్ఞాపించెను. జస్వంతుని బంటగు దుర్గదాసు ఔరంగజేబుయొక్క యభిప్రాయమును గ్రహించి వారిని రహస్యముగా బంపివేసి జస్వంతుని కుమారునికిబదు లింకొకనినుంచెను. వీనినే జస్వంతుని కుమారుడని చెప్పి చక్రవర్తితనయొద్ద నుంచుకొనెను. ఔరంగజేబు కృతఘ్నత రాజపుత్రులనుద్రేకులజేసెను. కాననతడు రాజపుత్రస్థానమునకు వచ్చినపుడందరు నేకమయిరి. కాని జయపురపురాజు మొగలురాజులకు బంధువగుటచే జిజియాజెల్లింప నొప్పుకొనెను. మరికొంతకాలమునకు జాధ్పురపురాణియును గొంతదేశమిచ్చివేసి జిజియా మానిపించుకొనెను. ఉదయపురపురాణాయగు రాజసింహుడు మాటవరుసకయినను జిజియాను జెల్లించుట కొప్పుకొనలేదు. ఉదయపురకొండలలోనుండి మహమ్మదీయులకు లొంగక రాజసింహుడు వారిని చిక్కులుపెట్టుచుండెను. ఔరంగజేబనేకసంవత్సరములు నతనినిజయించ బ్రయత్నించెనుగాని ధననష్టము సైన్యనష్టముదప్ప మరియేఫలితమును లేకపోయెను. చివరకు 1679 లో నౌరంగజేబు కుమారుడగు నక్బరు తిరుగబడి రాజపుత్రులజేరెను. జాధ్పురపురాణిగూడ నీపక్షమవలంబించెను. 'తాతకుబోసిన బోలే తరతరముల'కన్నట్లు తాను తనతండ్రిమీదకు తిరుగబడినట్లుతనమీదకు దనకొడుకులు తిరుగబడుచున్నారని విచారించి యప్పటియపాయమును దాటుటకొక తంత్రమును పన్నెను. అక్బరు పితూరీ యబద్ధమయినట్లును నది తాను చేయించినట్లును నర్థమిచ్చునట్లొక యుత్తరమువ్రాసి యాయుత్తరము రాజపుత్రుల

చేతులలో బడునట్లుచేసెను. ఈకారణముచేతనేగాక నక్బరు రాజపుత్రులకుజూపవలసిన మర్యాదను జూపకుండుటచే రాజపుత్రులక్బరును వదలివేసిరి. అక్బరచ్చటనుండిమహారాష్ట్రులయొద్దకుబోయి యచ్చటను తనకుక్షేమములేదని పరిష్యాకుబారిపోయి యచ్చటనే మృతినొందెను. రాజపుత్రులు ఔరంగజీబు మరణముపర్యంతము మొగలుసైన్యములతో యుద్ధమునలుపుచు నౌరంగజీబు ప్రక్కలోని బల్లెములైయుండిరి.

మహారాష్ట్రులు.

మహారాష్ట్రనాయకుడగు శివాజీ దుండగములజూచి యౌరంగజీబు నాజ్ఞప్రకారము దక్కనుప్రతినిధియగు షైస్తఖాను శివాజీకి బుద్ధిజెప్పుటకు మహారాష్ట్రముబోయి యమితకష్టముతో చాకన్కోటను బట్టుకొని పూనాలో శివాజీయింటనే బసచేసి క్రొత్తమహారాష్ట్రసవ్వారిని పట్టణములోనికి రానియ్యవలదని తనసైన్యమునకు నాజ్ఞచేసెను. శివాజీ తనయనుచరులతోగూడ నొకపెండ్లిగుంపునుగలిసి యూరిలోబ్రవేశించి పెండ్లివారి యూరేగింపుతో బయలుదేరెను. పెండ్లివారు షైస్తఖానున్న యింటియెదుటకు రాగానే యాయింటిపై బడెను. షైస్తఖానుని కొడుకాపోరాటములో మృతినొందెను. షైస్తఖాను చిటికెనవ్రేలునష్టముతో నెట్లోప్రాణము దక్కించుకొని పారిపోయెను. తనచేబంపబడిన జస్వంతసింగుకూడ నేమియుచేయలేనందున నతడు మహారాష్ట్రులతో నేకమయ్యెననియనుమానించి యౌరంగజీబు తనకుమారుడైన మువజ్జామును జస్వంతుని సహాయమునకు బంపెను. వారిద్దరునేమియు జేయలేకపోయిరి. శివాజీ



సూరతుపట్టణమును దోచుకొని మెక్కాకుబోవుచున్న మహమ్మదీయయాత్రికుల నోడనుబట్టుకొనెను. ఏయూరుదోచుకొన్నను నంతగా నౌరంగజీబునకు గోపమురాలేదుగాని మహమ్మదీయయాత్రికుల నల్లరబెట్టుటచే నీ 'కొండయెలుక' ను నణచవలెననుతలంపుతో జస్వంతు మఅజ్జాముల వెనుకకు మరలనాజ్ఞాపించి జయసింగు డిలిరుఖానుల బంపెను. ఔరంగజీబొకరినినమ్మక యొకహిందూసేనానిని, నొకమహమ్మదీయసేనానిని జతచేసిపంపుచుండెను. ఇదియేముప్పుదెచ్చెను. జయసింగు డిలిరుఖానులలో నొకరికొకరికి సరిపడకుండెను. అట్టిస్థితిలో నిద్దరుగలిసి మనస్ఫూర్తిగా బనిచేయకుండిరి. అయినను పురందరు బట్టుకొని రాయఘరును ముట్టడించిరి. సుప్రసిద్ధులగు నాసేనానాయకులతో బోరుట తనకుముప్పనియో లేక నేమియితరయుద్దేశముతోనో శివాజీ జయసింగునకులొంగి దక్షిణమునున్న మహమ్మదీయులతో వారుపోరునపుడు సహాయముజేయుటయేగాక తనసదుద్దేశమును దెలియజరచుటకు కుమారుడగు శంభాజీతోగూడ జయసింగిచ్చిన యభయముబట్టి రాజధానికి బోయెను. తన్ను యేదక్షిణపరగణాలకో సుబేదారునిజేయుదురనియు, నాయధికారమును, తద్ద్వారా తనయొద్దనుండు సైన్యమును నుపయోగించి మొగలురాజ్య నాశనము జేయవచ్చుననియు శివాజీ యెంచెను. ఔరంగజీబతనిరాకకు నంతసించినను, దర్బారునందు సామాన్యసర్దారులలో నతనికి స్థలమిచ్చి యతని నగౌరవపరచెను. శివాజీ యసంతృప్తినొందగా నది తెలిసి యౌరంగజీబతనికి దేవిడీమన్నాజెప్పి యొకయిం

టనుంచి చుట్టును భటులకావలిబెట్టెను. ఔరంగజీబుయొక్క దురుద్దేశమును దెలిసికొని తనకు జబ్బుగానున్నట్లు కొన్నిరోజులనటించి తరువాతనింపాదిగానున్నదని దేవునకును బ్రాహ్మణులకును ఖానుకలుసమర్పింప సెలవునుశివాజీపొందెను. తనకుబదులింకొకని మంచముమీద బరుండబెట్టి మిఠాయికావిళ్లలో శివాజీ తనకుమారునితోగూడ జయసింగుకుమారుడగు రామసింగుసహాయమున దప్పించుకొని పారిపోయెను. దేశమునకు తిరిగివచ్చి తనమామూలుచర్యల నారంభించెను. ఇకనూరకుండుటతగదని యౌరంగజీబు తానే పెద్దసైన్యముతో దక్షిణమునకు బయలుదేరెను. పాపమతడు తిరిగియింటికి రాలేదు. అప్పటికి శివాజీ చనిపోయి శంభాజీరాజయ్యెను. మహారాష్ట్రుల కోటలు పట్టుబడిన వారు కొంకణపర్వతప్రాంతములకు బారిపోయిరి. వారు యుద్ధమునకు రారు. మొగలుసైన్యములు వారిని యుద్ధకు బోలేవు. వారిది కోతియుద్ధము. అనగా శత్రుసైన్యము యుద్ధమునకు సిద్ధమయిన బారిపోవుట, వారు డబ్బాడవాలిగట్టుకొని ప్రయాణము జేయుచున్న వెనుకప్రక్కనుండి వారినిదాకుట, వారు తిరుగబడిన తమగుఱ్ఱములతో నదృశ్యమగుట. వారినప్పుడేమియుజేయునదిలేక సమయముకొరకు వేచియుండదలచి యౌరంగజీబిలోపున మహమ్మదీయరాజ్యముల వైపు తిరిగెను. బీజపూరు గోలకొండల నౌరంగజీబు జయించి యాదేశముల తనరాజ్యమునగలుపుకొనెను. శంభాజీ యౌరంగజీబు చేతులలోబడినంతన నౌరంగజీబతనిని మహమ్మదీయుడవుగమ్మని బలవంతపెట్టెను. నీకూతునును నాకిచ్చినట్ల



య్యెదనని శంభాజీ బదులుచెప్పగా కండ్లుపొడిపించి శంభాజీని జంపించెను. కాని మహారాష్ట్రులు లొంగలేదు. అందుచేతను తనకుమూకులు తిరుగబడుచుండుటచేతను విసిగి 1706 లో సహమదునగరము జేరి 1707 లో నచ్చట యౌరంగజీబు చనిపోయెను.



## 7-వ అధ్యాయము.

## మొగలురాజ్యక్షీణత.

బహదూరుషా. 1707-1712.

ఔరంగజీబు మరణానంతర మతని పెద్దకుమారుడగు షాఆలము బహదూరుషా యను నామమును వహించి రాజ్యమునకు వచ్చెను. మామూలుప్రకారమతని సోదరులందరు రాజ్యమునకై ప్రయత్నించిరి. అజామునునతడు తండ్రిచనిపోయినప్పుడు దక్కనునందుండుటచే నచ్చట దనయధీనమందున్న సైన్యమును గూర్చుకొని యాగ్రాకుబోయెనుగాని యన్నతో యుద్ధములో చనిపోయెను. మూడవకుమారుడగు కామభక్షి హైదరాబాదుననుండెను. ఇతడుతనయధికారము నంగీకరింపకుండుటచే బహదూరుషా వానిపయికి యుద్ధమునకు బోయెను. యుద్ధమున కామభక్షి మృతినొందెను. బహదూరుషా మహారాష్ట్రులతోను రాజపుత్రులతోను సంధిజేసికొనెనుగాని సిక్కులల్లరబెట్టుచుండిరి. ఉదయపురము జయపురము జాధ్పురము స్వతంత్రరాజ్యములయ్యెను. బహదూరుషా 1712 లో చనిపోయెను.

జహాందరుషా 1712.

ఇతనియనంతర మితని పెద్దకుమారుడు జుల్ఫికరుఖానుని సహాయమున జహాందరుషాయనునామమువహించి సింహాసనమెక్కెను. కాని యితడు విషయలోలుడగుటచే నుమ్రావులందరకును విసుగుజనించెను. ఇతని పినతండ్రికుమారుడగు ఫరకుసయ్యరు బీహారుగవర్నరగు సయ్యదుహుస్సేనుఆలీయొక్కయు నాతనిసోదరుడును నలహాబాదు గవర్నరునునగు అబ్దుల్లాయొక్కయు సహాయముచే జహాందరునోడించి యతడు యుద్ధమున మడియుటచే తాను రాజయ్యెను. అన్నదమ్ములగు నీయిద్దరుసయ్యదులును తమయిష్టమువచ్చినవానిని చక్రవర్తిని జేయుటయు నిష్టములేకున్న వానిని పదభ్రష్టుని జేయుటయు సాగించిరి కావున వీరిని 'చక్రవర్తికారకు' లని పిలిచిరి.

ఫరకసయ్యరు. 1712-1719

ఫరకుసయ్యరుకాలమున నన్నదమ్ములగుసయ్యదు లధికారమంతయు దమచేతులలోనేయుంచుకొనిరి. ఫరకుసయ్య రెంతప్రయత్నించినను వీరిచేతులలోనుండి దప్పించుకొనలేకుండెను. ఫరకుసయ్యరు తమ్ముదుదముట్టించుటకు బ్రయత్నించుచున్నాడని తెలిసి వానినేచంపించి నొకరితరువాత నొకరి నిద్దర రాజులుగ జేసిరి. వారు కొద్దికాలములోనే గతించుటచే బహదూరుషామనుమడగు మహమ్మదుషాను చక్రవర్తినిజేసిరి.

మహమ్మదుషా. 1719-1748

బహదూరుషాకాలమున కలీచఖాను దక్షిణసుబేదారుగానుండెను. ఇతడు సయ్యదులకు విరోధుడగుటచే నతనినివారు దక్షిణమునుండి పిలిపించిరి.



ఫరకుసయ్యరున కాంతరంగికుడై యితడుసయ్యదులకు వ్యతిరేకముగాబనిచేసెను. కాని సయ్యదులలో జేరిన దనకులాభమునుమనియెంచి తరువాత వారిపక్షముచేరెను. ఇతడనుకొనినట్లుగాక యితనినిమాళ్వాపాలకునిగా వారునియమించిరి. ఇందుచేనతనికి గోపమువచ్చి తనస్నేహితులనందర నశీరుఘురుకోటలోజేర్చి తాను దక్కనుసుబేదారునని ప్రకటించెను. ఇతని నణచుటకు హుస్సేను సైన్యముతో బోవుచుండగా నెవ్వరోయతనిని పొడిచిచంపివేసిరి. కలీచుఖాను నైజామనుపేరున హైదరాబాదువద్ద స్వతంత్రరాజ్యమును స్థాపించెను. హుస్సేనుగతించినవెనుక నబ్దుల్లానణచుటసులభముగాన నతనిజంపించి మహమ్మదుషా సయ్యదులనుండి విముక్తుడై నైజామును మంత్రిజేసెను. అయోధ్య, అలహాబాదు దేశములకు సాదతుఆలీ సుబేదారయ్యెను. ఇతడే నవాబువజీరు కుటుంబస్థాపకుడు. నర్మదాచాంబలు మధ్యప్రదేశము 1738 లో మహారాష్ట్రులకిచ్చివేసి వారివలనిబాధను మహమ్మదుషా తప్పించుకొనెను. కాని క్రొత్తయుపాయమొకటి తటస్థించెను.

నాదరుషా.

నాదరుషాయను యోధుడొకడు పరిష్యారాజ్యము నాక్రమించి చుట్టుప్రక్కలనున్న దేశములగూడ స్వాధీనముచేసికొనెను. తనయాఫ్ఘను శత్రువులలో గొందరు ఢిల్లీలోనుండుటచే వారినిజంపివేయుమని నాదరుషా మొగలు చక్రవర్తిని గోరగా నతడట్లుచేయుటకిష్టపడలేదు. నాదరుషా మొగలుచక్రవర్తిని శిక్షించుటకును, ధనముసంపాదించుటకును 1739 లో ఢిల్లీపయికి దాడివెడలెను. ఊరి

వెలుపల మకాముచేసి మహమ్మదుషాకు కబురుబంపెను. మహమ్మదుషా యతనిని జూచుటకు బోయినపుడతనికిరీటమున నున్న కోహినూరువజ్రమునుజూచి నాదరుషా యదినంగ్రహింపనుద్దేశించి తమదేశమున పురుషులొకరినొకరు దర్శించునపుడు తలపాగాల మార్చుకొనుటయాచారమని మహమ్మదుషాకు దెలియునట్లు మాటలాడెను. మహమ్మదుషా వానికోరికనుగ్రహించి తనకిరీటమునిచ్చి యతనితలపాగా ధరించెను. నాదరుషా మహమ్మదుషాకు నతిథియై ఢిల్లీలోనుండగ ప్రజలు తనమీదను తనసైన్యముమీదను రాలురువ్విరన్న మిషచే పట్టణము కొల్లగొట్ట తనసైన్యమున కాజ్ఞాపించెను. ఇండ్లుదోచియు, స్త్రీలకు మానభంగముచేసియు, స్త్రీబాలవృద్ధభేదము లేకుండ ప్రజలజంపియు పట్టణమంతయు వారల్లకల్లోలము జేసిరి. నాదరుషా ఢిల్లీనుండి తిరిగిపోవుచు షాజహానుచే నిర్మింపబడిన నెమలిసింహాసనమును బట్టుకొనిపోయెను.

నాదరుషా వెళ్ళినతరువాత దేశమందంతటను స్వతంత్రరాజ్యములేర్పడెను. నైజాము, మహారాష్ట్రులు దక్కనునాక్రమించిరి. ముల్తాను గుజరాతులు స్వతంత్రములయ్యెను. పంజాబుసరిహద్దుల సిక్కులు ప్రబలులయిరి. బంగాళమును మహారాష్ట్రులబారినుండి చక్రవర్తి కాపాడలేనందున నాదేశపుపాలకుడు స్వతంత్రతవహించెను. హిందూదేశమునకు పశ్చిమముననున్న కాబూలు మొదలగుదేశములు పరిష్యానులపాలయ్యెను. మహమ్మదుషా పేరునకుమాత్రము చక్రవర్తిగానుండెను. ఇట్టిస్థితిలో నాదరుషా సేనానాయకులలో నొకడును, నతని



యనంతరమున కాబూలు మొదలగుదేశముల నాక్రమించినట్టియు అహమదుషాఅబ్దల్లీ హిందూదేశమునకు దండెత్తివచ్చెను. కాని చక్రవర్తికుమారుడగు అహమదుషా యతనినోడించితరిమివేసెను. కొద్దికాలములోనే మహమ్మదుషా చనిపోయినందున అహమ్మదుషా చక్రవర్తియయ్యెను.

అహమ్మదుషా 1748.

అహమ్మదుషా అయోగ్యనవాబగు సఫ్దరాలీని మంత్రిగ జేసికొని రోహిలాలనణచుటకు బ్రయత్నించెను. కాని జయముచేకూరనందున మహారాష్ట్రుల సహాయముతో వారినోడించి రోహిలఖండులో చౌతువసూలుచేసికొనుటకు వారికధికారమిచ్చెను. ఈసమయమున అబ్దల్లీ రెండవసారి పంజాబునకుదండెత్తివచ్చెను. నాదరుషా వచ్చినపుడు ఢిల్లీకిగలిగిన సంక్షోభమును మనస్సునందుంచికొని అహమదుషా పంజాబతనికిచ్చి సమాధానపరచెను. అట్లిచ్చుట సఫ్దరాలీ కిష్టములేకుండుటచే చక్రవర్తికిని నతనికిని స్నేహము చెడెను. చక్రవర్తి గయాజుద్దీననునతనిని సఫ్దరాలీతో బోరుటకు బ్రోత్సాహపరచెను. వీరిట్లుకొట్లాడుచుండగా మహారాష్ట్రులు కలుగజేసికొని సఫ్దరాలీనయోధ్యకు బంపివేసిరి. చివరకు గయాజుద్దీను అహమదుషాను పదభ్రష్టునిజేసి రాచవంశములో నొకనిని రెండవఆలమగీరను పేరుతో సింహాసనమెక్కించెను. మొదటిఆలమగీరు ఔరంగజీబు. ఇంతతో నూరకుండుటమాని యతడు పంజాబున నబ్దల్లీయుంచిన పాలకునిజంపి యాదేశమాక్రమించెను. ఇందుచే నబ్దల్లీగినిసి హిందూదేశమునకువచ్చి పంజాబునాక్రమించి ఢిల్లీనిపట్టుకొ

సెను. ఇతడు వెళ్ళినచోట్లన్నిటియందును సొమ్ము వసూలు చేసి నిరపరాధులగు హిందూయాత్రికుల మధురయొద్ద జంపి తనదేశమునకు దిరిగిపోయెను. ఇతడు తిరిగిబోవుచు రోహిలానాయకుని చక్రవర్తికి ప్రధానిగా జేసెను. అతడు వెనుకకు తిరుగగానే గయాజుద్దీను మహారాష్ట్రుల బిలిచెను. మహారాష్ట్రులు రఘోబానాయకత్వమున ఢిల్లీకివచ్చి రోహిలామంత్రిని తరిమివేసి గయాజుద్దీనుని మంత్రిగ జేసి పంజాబునకు బోయిరి. అబ్దల్లీ కుమారుడగు తైమూరునోడించి యాదేశము నాక్రమించి తమప్రతినిధినినిల్పి రఘోబా తిరిగవచ్చెను. ఈమహారాష్ట్రవిజృంభణము హిందూస్థానమందలి మహమ్మదీయులందరిని మేలుకొల్పెను. 1761 లో అబ్దల్లీ నాలుగవసారి హిందూదేశమునకు వచ్చి దేశమునందున్న మహమ్మదీయ ప్రభువుల సహాయముపొంది పానిపట్టుయొద్దనున్న మహారాష్ట్రుల ముట్టడించెను. మహారాష్ట్రులకు గావలసిన భోజనసామగ్రుల నాఫ్ఘనులు రానియనందున వారుయుద్ధమునకు ఢీకొనిరి. మహారాష్ట్రులు ధైర్యముతో బోరినను చివరకు అబ్దల్లీపన్నిన తంత్రములవలన నోడిపోయిరి. అబ్దల్లీ 500 సైనికులను యుద్ధమున జేరకుండనుంచి యుభయసైన్యము లలసినంతనే వారిని యుద్ధమున జొరపెట్టుటచే నాఫ్ఘనులబల మధికమయ్యెను. ఈయుద్ధమున మహారాష్ట్రులనేకులు నశించిరి. ఆదేశమున సోదరులకొరకో తండ్రులకొరకో భర్తలకొరకో కుమారులకొరకో నేడువని కుటుంబములప్పుడులేవట. పానిపట్టుయొద్ద మూడుయుద్ధములయ్యెను. మూడును సామ్రాజ్యముకొరకే. మూటియందును హిందువు



లోడిపోయిరి. మహమ్మదీయులు గెల్చిరి.

ఇంతటితో మొగలురాజ్యము నశించెను. చక్రవర్తి బిరుదమును చివరకు ధరించినవాడు రెండవషాఆలము. వానినిగురించి బ్రిటిషుమహాయుగమున వ్రాయబడును.

**మొగలురాజ్యనాశమునకు కారణములు.**

ఔరంగజేబు తనపరమతద్వేషముచే హిందువుల బాధించి వారిలో నుద్రేకము గలుగజేసెను. వారు మొగలులకు సహాయము జేయకుండుటయేగాక యారాజ్యమును నాశనము జేయుటకై సమయముకొరకు వేచియుండిరి. మతాభిమానము వారిలో నైకమత్యమును బెంచెను. ఎవ్వరు రాజ్యస్థాపనకు ముఖ్యులని వారినక్బరు దగ్గరజేర్చెనో యట్టిరాజపుత్రుల విరోధులుగచేసి ఔరంగజేబు తనసైన్యబలమును తగ్గించుకొనెను. ఒకవైపున సిక్కులు, ఇంకొకవైపున జాటులు, వేరొకవైపున మహారాష్ట్రులు బయలుదేరి యతనిరాజ్యమున శాంతిలేకుండచేసిరి. బీజపూరు గోలకొండరాజ్యముల నాశనముచేసి ఔరంగజేబు మహారాష్ట్రుల బలవంతులుగ చేసెను. వారినణచ ప్రయత్నించుటలో విశేషధనవ్యయమును సైన్యనష్టమునుబొందుటచే మొగలురాజ్యశక్తి క్షీణించెను. మహమ్మదీయ ఉమ్రావులు మూడువంతులు పరదేశస్థులు. వారు స్వతంత్రరాజ్యముల నేర్పరచుకొనుటకును ధనముసంపాదించుకొనుటకును మొగలుకొల్వున చేరియుండిరి. ఔరంగజేబునకు వెనుకటి చక్రవర్తులు రాజపుత్రుల సహాయమున వారిని నదుపులోనుంచిరి. రాజపుత్రుల నౌరంగజేబు వైరులచేసెను గాన

వారియనంతరము మహమ్మదీయయామాత్యులు స్వతంత్రరాజ్యముల స్థాపించుకొని మొగలురాజ్యనాశనమునకు దోడ్పడిరి. ఇట్టిస్థితిలో నౌరంగజీబు తరువాతవారు బలహీనులగుటచేతను నాదరుషా అబ్దల్లీలు దేశమును కొల్లగొట్టుటచేతను మొగలురాజ్యము నామావశిష్టమయ్యెను. సమయమునకు పాశ్చాత్యులీదేశమున బ్రవేశించి తరుణముగనిపెట్టి రాజ్యస్థాపనకు గడంగిరి. కాన మొగలురాజ్యము మరలతలయెత్తలేకపోయెను.



## ౮-వ అధ్యాయము.

### — మహారాష్ట్రులు. —

మహారాష్ట్రము.

ఉత్తరమున సాత్పురాపర్వతముల వెంబడిని నాగపూరు మీదుగా వెయినుగంగవరకును, తూర్పున వెయినుగంగవరదల వెంబడి మాణిక్యదుర్గమువరకును, దక్షిణమున మాణిక్యదుర్గమునుండి మాహూరునకును మాహూరునుండి గోవావరకును, పడమర సముద్రమువరకును వ్యాపించిన దేశమున మహారాష్ట్రులుండిరి. ఈదేశము పర్వతమయమగుటచే నచ్చటనివసించువార లనాగరికులైవ్యవసాయవృత్తిచే గాలక్షేపముచేయుచుండిరి. కాని యితరకొండజాతులవలె వీరునుసహజముగా ధైర్యవంతులును యుద్ధప్రియులును నైయుండిరి. ఈదేశమున చిన్నచిన్నకొండలును వాటిమీదకోటలును నుండుటచేతను, మార్గములు దుర్గమంబులగు



టచేతను నమితమైన వర్షములుండుటచేతను చిరకాలమీదేశము మహమ్మదీయులకు లొంగకుండెనుగాని చివరకు భామినీరాజులీదేశమును కష్టముమీద జయించిరి. అయినను మహమ్మదీయులు నివసించుటకు దేశము యోగ్యముగాలేనందున యాదేశపువారినే పన్నులు వసూలుజేయుటకు మహమ్మదీయు లేర్పరచిరి. గ్రామాధికారి, దేశాధికారి, దేశముఖ, దేశపాండ్య యనుపేరుల నీయుద్యోగులు ధరించిరి. దేశపాండ్యాలు జాగీరుదారులైయుండుటచే భామినీరాజ్యము నాశనమైన తరువాత గోలకొండ బీజపూరు రాజ్యములు వీరిని దమయధికారముక్రిందనుంచికొనిరి. ఇట్టిజాగీరుదార్లవంశములలో భాంస్లేవంశమొకటి. మహారాష్ట్రులు హిందూసామ్రాజ్య పునరుద్ధరణమునకై పాటుపడిరిగాన వారిచరిత్ర విశదముగాదెలిసికొనుట యవసరము.

షాజీ.

భాంస్లేవంశమువాడగు షాజీయనునత డహమదునగరమున మలికాంబరు కొలువులోనుండెను. షాజీ యుద్ధమునందేగాక రాచకార్యనిర్వహణమందుగూడ గొప్పనైపుణ్యము గలవాడు. మలికాంబరోడిపోయి చనిపోయినతరువాత నహమదునగరరాజ్యవంశమును షాజీనిలబెట్ట బ్రయత్నించెనుగాని సఫలుడుగాకుండుటచే బీజపూరుసుల్తానుని కొలువులోజేరెను. ఇతని ప్రథమభార్యకు శివాజీ 1627 లో బుట్టెను. భార్యను పుత్రునివిడచి షాజీయింకొకామెను వివాహమాడెను. అందుచే తండ్రికొడుకులకంత యైకమత్యములేదు. షాజీ పూనాచుట్టునున్న తనజాగీరునుజూచుటకు దాదా

జీఖండియాయను నొకబ్రాహ్మణుని నియమించి యతనియొద్దనే భార్యాపుత్రులనుంచెను. ఇంతలో షాజీ కర్నాటమునకు బోయి యదిజయించి తంజావూరునొద్ద నొకచిన్నసంస్థానము నేర్పాటుచేసి దానిని తనరెండవభార్య కుమారుడగు వెంకాజీ యాధిపత్యమున నుంచి బీజపూరునకు తిరిగివచ్చెను.

శివాజీబాల్యము.

శివాజీ దాదాజీయొద్ద విద్యాభ్యాసము జేసెను. మొదటినుండియు చదువునందాసక్తి శివాజీకిలేదు. రామాయణ మహాభారతములువిని వాటిలో జెప్పబడిన వీరులననుకరించ బ్రయత్నించుచుండెను. దీనికి గారణ మాతనిజన్మమే. మహారాష్ట్రియనగా రాష్ట్రకూటతండ్రికిని రాజపుత్రులగు యాదవరాజవంశస్త్రీయైన తల్లికినిబుట్టినవానికి పరాక్రమమునందభిలాషొక వింతకాదు. చిన్నతనమునుండియు నలుగురినిజేరదీసి వారినినడపుట యితనికలవాటైయుండెను. సాముగరిడీలయందును నాయుధముల నుపయోగించుటయందును విశేషపరిశ్రమజేసి వాటియందు ప్రవీణుడయ్యెను. మహారాష్ట్రమందు మావలీలను కొండజాతివారుండిరి. వారినిబ్రోగుచేసి శివాజీ సైన్యమునేర్పాటుజేసికొనెను.

మహారాష్ట్రరాజ్యస్థాపన.

దాదాజీ మృతినొందినవెనుక తండ్రిజాగీరును శివాజీయే జూచికొనుచు సైన్యమును యుద్ధసామగ్రిని సమకూర్చుకొనుటయందారాబడి నుపయోగించెను. ఈసైన్యముతో మహమ్మదీయరాజుల గ్రామములమీదబడి దోచికొనుచు చౌతు సర్దేశముఖి యనుపన్నుల వసూలుజేయుచుండెను. చౌతనగా



ప్రభుత్వమునకు జెల్లించవలసిన పన్నులో నాలవవంతు. సర్దేశముఖియనగా పదియవవంతు. ఔరంగజేబు సింహాసనమునకై పోరుటకై బోవునపుడు శివాజీకి చౌతు వసూలుచేసికొనుట కనుజ్ఞయిచ్చెను కానవది వసూలుచేయుట శివాజీకినేరముకాదు. 1646 లో తోరణాకోటను తరువాత క్రమముగా రాయఘురు పురందరు మొదలగుకోటలనుబట్టుకొని బీజపురపుసుల్తానునకు గోపమురాకుండ గప్పము జెల్లించుచుండెను. బీజపూరుసైనికులు ద్రవ్యమును గొనిపోవుచుండ వారినోడించి యాద్రవ్యమును దోచికొనుటచే బీజపురపుసుల్తానునకు గోపమువచ్చి షాజీని దక్షిణమునుండిరప్పించి చెరయందుంచెను. షాజీ తనకొడుకు తన్నుగూడ లక్ష్యముచేయడని చెప్పినను వినక శివాజీలొంగనియెడల యీ చెరసాలకున్న ద్వారముగూడ గప్పించెదననిభయపెట్టెను. శివాజీ తండ్రిని రక్షించుటకైగాను మొగలులకు సామంతుడగుట కొప్పుకొననని తెలిసి బీజపురపుసుల్తాను షాజీనివదలి కర్నాటమునకు బంపివేసెను. తండ్రి విడుదలానంతరము శివాజీ మొగలురాజ్యమునుదోచి మూడు లక్షలరూప్యములను మూడువందల గుఱ్ఱములను సంపాదించెను. దీనిసహాయమున గుఱ్ఱపుదళమునొకదాని నేర్పాటుచేసికొని మహమ్మదీయులైనను పారుకొరిన తనసైన్యమున చేర్చుకొనిబలీయుడై బొంబాయి, గోవా, జంజీర లు దప్ప మిగిలిన కొంకణదేశమంతయు జయించెను.

ఇకనూరకున్న బాగులేదని యుద్ధముల బ్రసిద్ధికెక్క

అఫ్జుల్ ఖాను 1659.

సేనానాయకుడగు నఫుజుల్ ఖానును 1659 లో బీజపురపుసుల్తాను శివాజీమీదకు బంపెను. శివాజీపోరాడగలిగియు తంత్రముచే నతనిసాధింప నుద్దేశించి అఫ్జుల్ ఖానువద్దనున్న నొకహిందూయుద్యోగిని వశముచేసికొని అఫ్జుల్ ఖాను తన్నొంటరిగా గలిసుకొనుట కొప్పించెను. అఫ్జుల్ ఖాను శివాజీనినమ్మక తనకునమ్మకమైన నొకయోధుని తనవెంటదీసికొనివెళ్ళి తాముకలిసుకొననేర్పరచిన స్థలమువద్దనుంచెను. శివాజీ యంతకుముందే తనసైన్యములనాచుట్టుప్రక్కల పొదలలో దాగునట్లుజేసెను. శివాజీ అఫ్జుల్ ఖానులు కలిసికొనినవెంటనే నఫ్జుల్ఖానుని గౌగలింపబోయినట్లు నటించి తనచేతికి నమర్చియున్న పులిగోళ్లవంటి యాయుధముతో నక్షస్థలముచీరి శివాజీయతనిని చంపివేసెను. ఆతనికేకలువిని మహమ్మదీయ సైనికులు పరువెత్తికొనిరాగా దాగియున్న మహారాష్ట్రసైనికులు వారినిదలపడి యోడించిరి. బీజపురపుసుల్తానీవార్తవిని 1661 లో తానే స్వయముగా బోయి శివాజీని శిక్షింపబ్రయత్నించెను. కాని యింతలో కర్ణాటమున నల్లరులుబయలుదేరుటచే శివాజీమీదకతనిశత్రువగు ఘోర్పురీని నియమించి తాను కర్ణాటమునకు బోయెను. శివాజీ హటాత్తుగ ఘోర్పురీముఖ్యపట్టణమును బట్టుకొని యతనిని యతనికుటుంబమువారిని జంపివేసెను. 1662 లో గోవామొదలు బేసినువరకు, పశ్చిమకనుమలకును సముద్రమునకును మధ్యనున్న దేశమును, పశ్చిమకనుమలకు తూర్పునన్న పీఠభూమిలో గొన్నిస్థలములను శివాజీయుంచుకొనుటకొ



ప్పుకొని బీజపూరుసుల్తాను శివాజీతో సంధిచేసికొనెను.

షైస్తఖాను 1664.

శివాజీ ఔరంగబాదువరకు దక్కనునందున్న మొగలు దేశమును దోచికొన నారంభించెను. ఇతని చర్యజూచి ఔరంగజీబునకు వెప్టబుట్టి దక్కనురాజప్రతినిధియగు షైస్తఖానుని జస్వాంతుసింగును తోడిచ్చి శివాజీమీదకు బంపెను. ఇతడెట్లుపూనాలో బసచేసి శివాజిచే నోడింపబడి పారిపోయెనో, తరువాతబంపిన జయసింగు దిలిరుఖానులేమిచేసిరో, శివాజి డిల్లీకిబోయి యౌరంగజీబుచే నవమానితుండై యెట్లునిర్బంధమునుండి దప్పించుకొనిపారిపోయి స్వదేశమును జేరెనో యిదివరకు ఔరంగజీబు చరిత్రయందు జెప్పబడినది.

శివాజీరాజు 1674.

శివాజీ మొగలురాజ్యమును దోచికొన నారంభింప జస్వాంతసింగును, తనకుమారుడగు ముజ్జామును ఔరంగజీబు దక్కనునకు బంపెను. శివాజీ లంచమలిచ్చి మొగలుసైన్యమువలన నుపద్రవము లేకుండ చేసికొనుటయేగాక 1672 లో మొగలులయుద్ధమున నోడించెను. మొగలు లాఫ్ఘనిస్థానమునకు యుద్ధమునకుబోవలసివచ్చుటచే దక్షిణమునయుద్ధముమానిరి. 1671 లో షాజీచనిపోయినందున 1674 లో శివాజీ రాయఘురువద్ద సింహాసనమెక్కి ఛత్రపతియను బిరుదమును వహించెను. మొగలులితరపనిమీద నుండుటచే ఖాండేషు, బీరారు, గుజరాతులనాక్రమించి గోలకొండనవాబుతో స్నేహముచేసికొని తండ్రి దక్షిణమున సంపాదించిన యాస్తిని రాబట్టుకొనుటకనుమతో

దక్షిణదిగ్విజయయాత్రకు బయలుదేరెను. జింజి, వెల్లూరు, ఆర్ని, బళ్ళారుల బట్టుకొని పైతృకమయిన రాజ్యమును బెంచి తమ్ముడగు వెంకాజితో బంచుకొనితిరిగివచ్చెను. 1679 లో మొగలులు బీజపూరును ముట్టడించిన నాసుల్తానుకోరికమీద మొగలులదాకి బీజపురపుముట్టడి వారువదలునట్లుగా చేసెను. ఇందుకుగాను బీజపురపుసుల్తాను శివాజీని రాజుగానంగీకరించి దక్షిణమున శివాజీ జయించిన దేశమునకు నతనిహక్కు నొప్పుకొనెను. శివాజీ 1680 లో చనిపోయెను.

శివాజీ రాజ్యాంగపద్ధతి.

శివాజీకి నెనమండుగురు మంత్రులుండిరి. వారిలో ముఖ్యుడు పీష్వా సేనాపతియు న్యాయదర్శియు మంత్రులలోనుండిరి. అట్లే మిగిలినమంత్రులుగూడ రాజ్యమునందేదోయొక పరిపాలనశాఖకు నధికారులుగా నుండిరి. ఇంగ్లాండు దేశమున మంత్రిసంఘపుపద్ధతిని గమనింపుడు. వీరిక్రింద దేశపాండ్య దేశముఖ మొదలగు నుద్యోగులు తరమువారీగా శిస్తులువసూలుచేయుటకు నుండిరి. శిస్తులు హిందూశాస్త్రప్రకార మేర్పాటుచేయబడెను. పన్నులు నిర్ణీతమయినదానికంటె హెచ్చుగాగాని యదనపుపన్నులుగాని వసూలుచేయకూడదని యాజ్ఞాపించెను. కాని బకాయిలనుంచకుండ పన్నులన్నియు వసూలుచేయించెను. ప్రజలకు వివాదల బరిష్కరించుటలో ధర్మశాస్త్రప్రకారము దప్పకుండ న్యాయమిచ్చెను. నేరస్థులు కఠినముగా శిక్షింపబడిరి. దోపిడిగాడని పేరొందినను తనప్రజలను బరిపాలించుటలో పూర్వపు హిందూరాజుల బోలియుండెను.



శివాజీ మాతృభక్తియు దేశభక్తియు గలవాడు. మహమ్మదీయులుచేయు దుండగములజూచి హిందూరాజ్యమును తిరుగ స్థాపించుట కుద్దేశించెను. చిన్న జాగీరుదారుడయినను తనశక్తిసామర్థ్యములచే మోటువారగు తన దేశీయుల జేరదీసి యొకరాజ్యమును స్థాపించి మొగలురాజ్యనాశంకరుడై విలసిల్లెను. ఇతడు మహారాష్ట్రుల మనములలో జొన్పిన దేశభక్తియు మహమ్మదీయులయందు ద్వేషమును వారియందు వృద్ధియై మొగలురాజ్యనాశనానంతరమున సామ్రాజ్యపదవికొరకు వారి నిపోరునట్లు జేసెను. ఆంగ్లేయులు మొగలులనుండిగాక వీరినుండియే సామ్రాజ్యపదవిని బొందిరని చెప్పవచ్చును.

ఇతడు దోపిడిగాడనియు కొండయెలుకయనియు మొగలులనిరిగాని విశేషసైన్యమును ఉపపత్తియుగల మొగలురాజులతో నొకచిన్నజాగీరుదారు పోరుటకీవిధముతప్పనింకొకటి పనికిరాదు. దోపిడిగాడయినను తనదోపిళ్ళలో స్త్రీలనవమానపరచక గౌరవముగాజూచెడివాడు. దరిద్రులను బాధపెట్టలేదు. పూర్వపుహిందూరాజుల పద్ధతుల ననుసరించియే యితడుప్రవర్తించెను. ఇతడురాజ్యమును జయించుటయేగాక రాజ్యమున పరిపాలనవిషయమైననేర్పాటులనుగూడ చక్కగా జేసెను.

శంభాజీ 1680—1681

శివాజీ మృతినొందినవెనుక నతనిపుత్రుడగు శంభాజీ రాజ్యమునకు వచ్చెను. ఇతడు తండ్రివలెగాక విషయలోలుడును క్రూరుడునునై యుండెను. తండ్రియంత పరాక్రమశాలిగాని రాజ్యతంత్రనిపుణుడుగాని కాడు. అయినను మహారాష్ట్రులమనములలో

శివాజీచూపిన దేశభక్తి, మొగలులయందలి ద్వేషము వారిమనములయందింకను బ్రజ్వలించుచుండెను. అందుచే మొగలురాజ్యమును కొల్లగొనుట వారుమానలేదు. కాని శంభాజీయందు మహారాష్ట్రవీరులకు నసహ్యముగలుగుటచే రాజబలితగ్గెను. ప్రభుత్వపువ్యయముకొఱకై పన్నులుహెచ్చుటచే బ్రజలుకూడ నసంతృప్తులయిరి. ఇట్టిస్థితిలో నౌరంగజేబు స్వయముగా దక్షిణమునకు గొప్పసైన్యముతో వచ్చెను. ముజ్జామును కొంకణమునకు బంపెనుగాని వానిసైన్యమునకు భోజనసామగ్రిల నందనీయక మహారాష్ట్రులాసైన్యమును నాశనముజేసిరి. శంభాజీ బరహాంపురమును (అహమదునగరములోనిది) జొచ్చిదని దోచికొనెను. ఔరంగజేబు మహారాష్ట్రులమీదకు బోవుటకు బదులుగా గోలకొండపట్టుకొని బీజపురమును ముట్టడించి 1686 లో నాపట్టణమునుగూడ బట్టుకొని నాశనముజేసెను. శంభాజీకి తండ్రిశక్తిలో నేమాత్రమున్నను బీజపూరు గోలకొండ రాజ్యముల సైనికులు పనిలేకయల్లాడుచుండ వారిని తనసైన్యమున జేర్చికొనియుండును. అట్లుజేయక 1687 లో సంగమేశ్వరమువద్ద తాగిపడియుండి యౌరంగజేబుచే పట్టుబడెను. మహమ్మదీయమతమును స్వీకరింపనందున నతనినౌరంగజేబు చంపించెను.

శివాజీ II
1689-1748.

శంభాజీ యనంతరమున నతనిపుత్రుడగు రెండవశివాజీ రాజ్యమునకువచ్చెను. అతడు మైనరయినందున యతనిపినతండ్రి రాజారామతనివంతు రాజ్యముజేసెను. ఔరంగజేబు రాయఘురుకోటను



ముట్టడించి పట్టుకొనెను. రెండవశివాజీ, యతనితల్లి చక్రవర్తి చేతులలో బడిరి. చక్రవర్తి శివాజీకి సాహు యనునామమిచ్చి తనయొద్దనుంచుకొనెను. కొంకణదేశమున కోటలన్నియు మొగలులవశమైన రాజారాము జింజీకి బారిపోయెను. జింజీ జుల్ఫికరుఖానుచే ముట్టడింపబడి మూడుసంవత్సరములకు 1698 లో పట్టుకొనబడెను. ఈలోపున కొంకణమంతయు తిరిగి మహారాష్ట్రులస్వాధీనమయ్యెను. రాజారాము సతారా రాజధానిగాజేసెనుగాని మొగలులభయముచే నొకచోటనుండక 1700 లో చనిపోయెను. సతారా యిదివరకే మొగలుల యధీనమయ్యెను. రాజారాముపెద్దకొడుకగు మూడవశివాజీ రాజయ్యెను. ఆతనితల్లి తారాబాయి పరిపాలనజేయుచుండెను. ఆమె మహారాష్ట్రసర్దారుల బ్రోగుజేసి వారినిహెచ్చరించెను. వారు మహారాష్ట్రకోటల దిరుగ స్వాధీనముజేసికొనిరి. 1707 లో నౌరంగజేబుచనిపోయెను. మహారాష్ట్రములో కలతలు గలుగజేయుటకు మొగలులు సాహూను వదలిరి. మహారాష్ట్రనాయకులనేకులు సాహూపక్ష మవలంబించిరి. కానికొందరు తారాబాయిపక్షమునగూడ నుండిరి. మూడవశివాజీ 1712 లో చనిపోవుటచే నతనితమ్ముడగు రెండవశంభాజీని తారాబాయి రాజునుజేసి మొగలులుసాహూను రాజుగానంగీకరించినందున కొల్హాపురముయొద్ద రాజధానినేర్పాటుజేసెను. సాహూ రాజధాని సతారా. మహారాష్ట్రులలో నీయంతఃకలహము జూచి దానిని దుదముట్టింపనెంచి సాహూ కొల్హాపురపురాజ్యమునంగీకరించెను. సాహూ మొగలుజనానాలో పెరిగినవాడగుటచే

సోమరియు సుకుమారియునై రాజ్యపాలనతనపీష్వాయగు బాలాజీవిశ్వనాథునకు వదలివేసెను. ఇతడు సమర్థుడగుటచే సాహూపేరడుగంటి పీష్వా ప్రబలుడయ్యెను.



## 9-వ అధ్యాయము.

### పీష్వాలు.

బాలాజీవిశ్వనాథు 1712-1721.

పీష్వాలలో మొదటివాడు బాలాజీవిశ్వనాథు. ఇతడు బుద్ధిమంతుడును రాచకార్యనిర్వాహణమందు మంచిప్రజ్ఞగలవాడునునై యుండెను. సాహూ సోమరియగుటచే పరిపాలనభారమంతయు నితనిమీద నైచెను. ఇతడు మొగలాయిలతో మహారాష్ట్రుల కనుకూలమగునట్లు సంధిజేసి పరిపాలనలో గొన్నిమార్పుల జేసెను. తనబుద్ధిబలముచే పీష్వాపదవి తనవంశమందే యుండునటులను రాజు ననామకునిగను చేసి పీష్వాయధికారము నిరంకుశముగాచేసెను. కాని పీష్వాలలో ప్రసిద్ధుడితని కుమారుడగు బాజీరావు. విశ్వనాథు 1721 లో చనిపోయెను.

బాజీరావు I 1721—1740.

ఇతనికాలమున మహారాష్ట్రరాజ్యమతి యుత్కృష్టపదవినొందెను. మొగలురాజ్యము నశింపజేసి హిందూరాజ్యమును స్థాపించుటయే యితని ముఖ్యోద్దేశము. మొదట స్వదేశమందున్న నల్లరులనణచి శాంతిని స్థాపించి హిందూస్థానముపయికి దాడి వెడలవలెనని యితడుద్దేశించెను. సేనాపతియు ప్రతినిధియు



నితనికి విరోధులు. సేనాపతి గుజరాతులోను ప్రతినిధి సతారాలోనుయుండి పీష్వాయధికారమును ధిక్కరించిరి. పీష్వాయందలిద్వేషముచే వీరికిహైదరాబాదునవాబు తోడయ్యెను. కాని బాజీరావు సేనాపతినోడించి యతనికిబదులు తనకనుకూలునిగుజరాతులోనుంచెను. ప్రతినిధినియుద్యోగమునుండిదప్పించి సతారాను దనవశము చేసికొనెను. నైజాముకూడ పీష్వాకువిధేయుడై మహారాష్ట్రులకు తానుబాకీయున్న ధనమునిచ్చివేసి బాజీరావును హిందూస్థానముపయికి బోవుటకు బ్రోత్సహించెను. మాళ్వాదేశపు సుబేదారు బుందలుకండురాజుపైకి యుద్ధమునకురాగా నారాజు బాజీరావుసహాయమును గోరిన బాజీరావంగీకరించి మొగలుల బారదోలెను. ఇందునకుగాను బుందలకండురాజు మహారాష్ట్రులకు జాన్సీనిచ్చివేసెను. బాజీరావు తనదేశమున కార్యములన్నియు జక్కజేసికొని డిల్లీకిబోయెను. చక్రవర్తియొద్దనున్నవారెవ్వరును బాజీరావునాపలేకుండుటచే నతడు నైజామునకు గబురంపెను. నైజాముకూడ మహారాష్ట్రుల మరల్పబ్రయత్నించి విఫలుడై వారితోసంధికి చక్రవర్తి నొడంబరిచెను. బాజీరావునకు మాళ్వాసుబేదారుద్యోగమును, నర్మదాచాంబలు మధ్యదేశమంతయును, పదిలక్షలరూప్యములను నిచ్చుటకు చక్రవర్తి యొప్పుకొనెను. మాళ్వాను సింధియాహోల్కారులకు బాజీరా విచ్చివేసెను. నాదరుషా డిల్లీని కొల్లగొట్టిన సమయమున పోర్చుగీసువారినుండి బాజీరావు సాల్సెట్టి, బేసినులను లాగికొనెను. బాజీరావు 1740 లో మరణించెను. ఇతనియకాలమరణము మహారాష్ట్ర

మునకెంతో నష్టమును గలుగజేసెను.

బాలాజీబాజీరావు
1740-61.

బాజీరావుకుమారుడగు బాలాజీబాజీరావు పీష్వాయయ్యెను. ఇతనికాలమున మహారాష్ట్రవీరులు వేర్వేరు దేశములకు పాలకులుగానుండి చిన్న సంస్థానముల స్థాపించిరి. వారెవ్వరనిన కొల్లాపురమునొద్ద శంభాజీయు, గ్వాలియరులో సింధియాయు, ఇందూరులో హోల్కారును, బేరారున భోంస్లేయు, బరోడాలో గైకవారును సంస్థానాధిపతులుగ నుండిరి. వీరికి సాహుయాజమాని. వీరిలోవీరికి సరిపడకుండుటచే మహారాష్ట్రరాజ్యబలము తగ్గెను. కాని పీష్వాబలీయుడుగా నున్నప్పుడు వీరుపీష్వాయాజమాన్యమున గలిసిపనిచేయుచుండుటచే మొదటనంతగా నష్టముగనిపించలేదు.

1748 లో సాహూ బాజీరావునకు నర్మదకుత్తరముననున్న దేశముల చౌతువసూలుజేసికొనుట కధికారమిచ్చి కొద్దిరోజులలో జనిపోయెను. అతనికుమారుడు రామరాజు సింహాసనమెక్కెన నతనిని ఖయిదునందుంచి బాలాజీ రాజధానిని పూనాకుమార్చెను. 1748 లో నైజాము చనిపోయినందున రాజ్యమునకై యుద్ధముపొసగెను. కర్ణాటకయుద్ధములలో మహారాష్ట్రులంతగా పాల్గొనలేదుగాని, సాలబతుజంగు నైజామయినతరువాత నతనిపెద్దన్నగారగు గైయాజుద్దీనుపక్షమువలంబించిరి. బాలాజీ నైజామురాజ్యమున గొన్నిజిల్లాలనాక్రమించి సింహాసనమునకై సాలబతుజంగుతో బోరాడనుండగా గయాజుద్దీను విషప్రయోగముచే చనిపోయెను. బాలాజీ యికజేయు



నదిలేక తానుపట్టుకొనిన జిల్లాలతో సంతుష్టినుంది వెనుకకుమరలెను. కాని నైజామునియొక్క యుద్యోగస్థుడొకడహమదాఖానను మహారాష్ట్రులకప్పజెప్పెను. నైజాముఉదయగిరియొద్ద మహారాష్ట్రులతో నోడిపోయి దౌలతాబాదు, బీజపూరు, అశీరుఘరులనిచ్చి సంధిజేసికొనెను. ఈసమయమునసే రఘోజీయను మహారాష్ట్రవీరుడు పంజాబుననున్న అబ్దల్లీయొక్కకుమారునోడించి పంజాబునాక్రమించి మహారాష్ట్రపాలకుని నియమించెను. దీనిచే నబ్దల్లీకి కోపమువచ్చి మహమ్మదీయులకు ప్రబలశత్రువులయిన యీహిందువులనణచ బయలుదేరెను. రఘోజీ యుత్తరహిందూస్థానమున దనవిక్రమములచే మహమ్మదీయరాజులకు భయమును గలుగజేసెను. అందుచేమహమ్మదీయులబ్దల్లీకి సహాయముజేసిరి. అందులో ముఖ్యులు రోహిలాలు. అబ్దల్లీ 1761 లో పానిపట్టువద్ద మహారాష్ట్రులనోడించి వారిసైన్యమును నాశనముజేసెను. పానిపట్టుయుద్ధమునుగూర్చి యిదివరకే జెప్పబడినది. బాలాజీబాజీరావు కొడుకుచావును యుద్ధమునఓటమియు విని గుండెపగిలి చనిపోయెను. పానిపట్టుయుద్ధము మహారాష్ట్రులకు తీరనినష్టమును గలుగజేసెను. చాలవరకు హిందూరాజ్యస్థాపనకు భంగముగలిగెను.



## 10-వ అధ్యాయము.

### —• పోర్చుగీసులు. •—

పూర్వమునుండియు హిందూదేశమునకును నైరోపా

యూరోపా ఆశియాలకు పూర్వపుదారులు.

కును వర్తకవ్యాపారము జరుగుచుండెను. బైబిలులో మొదటిభాగమందు సోలమను దర్బారులో తూర్పువర్తకులున్నట్లు చెప్పబడెను. సముద్రయానమారంభస్థితిలోనుండుటచే నీవర్తకము సముద్రముద్వారా జరుగకుండెను. పశ్చిమమున వెన్నిసు దేశస్థులును తూర్పున నరబ్బులును నీవర్తకమును దమచేతులలో నుంచికొనిరి.

ఎఱ్ఱసముద్రపుదారి.

ఈవర్తకము మూడుమార్గములద్వారా జరుగుచుండెను. బొంబాయినుండి సరకుల నోడమీద నెఱ్ఱసముద్రమునకు దీసికొనిపోయి యచ్చటనీజిప్టు తూర్పుతీరమున దించి, యీజిప్టుదేశముగుండా నలగ్జాండ్రియాకు వర్తకులు జేర్చిరి. అచ్చటనుండి సరకు వెన్నిసుపట్టణమునకు దీసికొనిపోబడెను. ఇదియొకదారి. దీనిని యెఱ్ఱసముద్రపుదారియని పిలిచిరి.

సిరియను దారి.

అరబ్బువర్తకులు బొంబాయినుండి సరకుల పర్షియను జలభాగమునకు దీసికొనిపోయి మెసపటోమియాలో నొంటెలమీద నెక్కించి యచ్చటియెడారిగుండా సిరియాకుబోయి యచ్చట రెండుతెగలై యొకతెగ అలెప్పోకువెళ్ళి సముద్రముమీద వెన్నిసునకు బోయిరి. రెండవతెగ సూయజు భూసంధిద్వారా యలగ్జాండ్రియాకు బోయి యచ్చటనుండి సరకుల వెన్నిసునకు బంపిరి. వీటినిసిరియను దారులనిరి.



కాస్పియను దారి.

వర్తకులు పంజాబునుండి బయలుదేరి, అఫ్ఘనిస్థానమున కుత్తరముగా ఆక్ససు నదివెంబడి కాస్పియను సముద్రముదరికిబోయి యచ్చట రెండుతెగలైయొకతెగవారు కాస్పియనుసముద్రపుటుత్తరభాగమును దాటి వాల్గామీదుగా రష్యాలోని నిజనీవగర్డునకుబోయి యచ్చటిసంతలో గొంతసరకు నమ్మికొని తిరుగ వాల్గాద్వారానే క్రిందకువచ్చి వాల్గానుండి డానునదికివెళ్లి దానిద్వారా నల్లసముద్రమునకును దానినిదాటిటర్కీకిని టర్కీనుండి వెన్నిసునకును బోయిరి. రెండవతెగ కాస్పియను సముద్రపు దక్షిణభాగమునుదాటి యాసియామైనరున ట్రిబిజాండునొద్ద నోడనెక్కి నల్లసముద్రముద్వారా టర్కీకిని యచ్చటనుండి వెన్నిసునకును బోయిరి. వీటిని కాస్పియనుదారులనిరి.

పైవివరములవలన నీదారులు గొంతభూమిమీదను గొంతనీటిమీదను నున్నట్లు దెలియుచున్నది. అందుచే బరువగునట్టియు పెద్దవైనట్టియు వస్తువుల దీసికొనివెళ్లుటకు వీలుకాకుండుటయేగాక నేలమీదను నీటిమీదను జోరభయము విస్తారముగానుండెను. అయిననెట్లో వర్తకము జరుగుచుండగా పశ్చిమయాశియాయును తూర్పుయూరోపాయును ఉత్తరయాఫ్రికాయును మహమ్మదీయుల పాలయ్యెను. మహమ్మదీయులు క్రైస్తవులనుద్వేషించుటచే క్రైస్తవవర్తకమున కాటంకము కలిగెను. అధికముగా పన్నులవసూలుచేసియు, వర్తకులను జెరలోనుంచియు, సరకుల లాగికొనియు క్రైస్తవవర్తకుల మహమ్మదీయరాజులు బాధించిరి. కాన ప్రాణవిత్తమానభంగ

కరమగు నీవర్తకమును వెన్నిసువర్తకులు మానివేసిరి.

ఇదిగాక నింకొకసంగతిగూడ గలదు. పశ్చిమయైరోపాదేశస్థులీవర్తకముపై మొదటినుండియుగన్ను వేసియుండిరి. మధ్యధరాసముద్రము వెన్నిసువారిచేతులలో నుండుటచేతను తూర్పుదేశములలో వారికివిస్తారము పలుకుబడియుండుటచేతను పశ్చిమదేశీయు లూరకుండవలసివచ్చెను. కాని మహమ్మదీయాక్రమణముచే వెన్నిసువర్తకము నశించుటచేపశ్చిమదేశీయులకు వీలుగలిగెను. వారు సముద్రముద్వారా హిందూదేశమునకు దారికనుగొననెత్నించిరి.

ఇట్లు ప్రయత్నించిన దేశములలో పోర్చుగలుదేశము మొదటిది. పోర్చుగలుదేశమున రాచకుటుంబమువాడగు హెన్రీ ది నేవిగేటరనునతడీవిషయమై యెక్కువ కృషిజేసెను. స్పెయినుపక్షమున నీదారిని కనుగొనుటకు బ్రయత్నించియే కొలంబసు వెస్టిండీసును కనుగొనెను. 1487లో బర్తాలోమ్యూడయాజు ఆఫ్రికాయొక్క దక్షిణాగ్రమువరకునుబోయి యచ్చటతుపానులచే వెనుకకు దరుమబడి యాయగ్రమునకు తుపానగ్రమని పేరుపెట్టి వెనుకకుమరలెను. 1497 లో వాస్కోడీగామా యనునతడు బయలుదేరి ఆఫ్రికా దక్షిణయగ్రమును జేరి యచ్చటనుండి హిందూదేశమునకు మార్గమగుపడుటచే దానికి గుడ్హోపు అనిపేరుపెట్టెను.

ఇతడు 1498 లో కళ్ళికోటనద్దకు జేరెను. కళ్ళికోటరాజితనికిస్వాగతమిచ్చెను. పోర్చుగీసువారి కరబ్బులు వైరులు. వీరు హిందూదేశపురాజుల బురికొల్పిరి. తూర్పుసముద్రములు



వారియధీనమం దుండెనుగాన వారిని సముద్రమున నోడించినగాని హిందూదేశవర్తకము దమవశము జేసికొనుటకు వీలుపడదని పోర్చుగీసులు గ్రహించి వారినిజయించి హిందూదేశపువర్తకమును సంపాదించిరి. 1502 లో వాస్కోడీగామా హిందూదేశమునకు తిరిగివచ్చి యరబ్బులప్రేరణచే కళ్ళికోటరాజు తనకు వర్తకమున కాజ్ఞయియ్యనందున కొచ్చి, కన్ననూరు రాజులసహాయమున కళ్ళికోటరాజు నోడించి పశ్చిమతీరమున పోర్చుగీసువర్తకము సాగించెను. 1505 లో అల్మైడా పోర్చుగీసుపాలకుడుగా హిందూదేశమునకు వచ్చెను. 1509 లో అల్ఫాన్సోఆల్బుకర్కు గోవానుపట్టుకొని దానిని ముఖ్యస్థానముజేసి తూర్పుదీవులతో వర్తకముసాగించెను. ఇతనికాలమున పోర్చుగీసురాజ్యము పరిష్యనుజలభాగము మొదలు మలాకావరకును వ్యాపించియుండెను. ఇంతటినుండి పోర్చుగీసువర్తకము రాజ్యముతోగూడ క్షీణింపనారంభించెను.

పోర్చుగీసువారు మతవ్యాపనకు, రాజ్యస్థాపనకు, వర్తకమునకు తూర్పుదేశమునకువచ్చియుండిరి. అందుచేవీరిప్రభుత్వమున మతముపేర ఘోరకార్యములుజరిగెను. వీరి క్రూరత్వముచే జనులు వీరిని ద్వేషించిరి. ఇదిగాక పోర్చుగలు చిన్నదేశమగుటచేతనింతపెద్దరాజ్యమును నిలబెట్టుకొనలేకపోయెను. హిందూదేశమునకుద్యోగమునకై బంపబడినవారు పోర్చుగలుదేశమున దక్కువస్థితియందుండినవారగుటచే రాజ్యమున లంచములు నేరములు విస్తారముగా నుండెను. ఈయుద్యోగులు నీచజాతి హిందూస్త్రీలను బెండ్లియాడిరి. వీరికి బుట్టినవారు

ఉభయులదుర్గుణముల కునికిపట్టయిరి. అందుచే పోర్చుగీసురాజ్యము క్షీణింపనారంభించెను. అదిగాక పోర్చుగలు స్పెయిన్ రాజునకు సంక్రమించుటచే వెండి బంగారములనిచ్చు నమెరికావిషయమై పనిచేసి యతడు తూర్పుదేశపువర్తకము దెస జూడకుండెను. ప్రొటెస్టెంటు క్రైస్తవమతము యూరపులో ప్రబలుటచే పోర్చుగీసులకు తూర్పుదేశపు టాధిపత్యమిచ్చిన పోపునాజ్ఞ తిరస్కరింపబడెను. డచ్చివారు పోర్చుగీసుస్థలముల నాక్రమించి వర్తకము తమహస్తగతము జేసికొనిరి. వీరితరువాత నాంగ్లేయులు వచ్చిరి. అందుచే పోర్చుగీసురాజ్యమడుగంటెను.

హిందూదేశమున పోర్చుగలునకు గోవా, డయ్యు, డామను మాత్రమే మిగిలినవి.



## 11.వ అధ్యాయము.

### సిక్కులు; 18.వ శతాబ్దపు హిందూదేశస్థితి.

సిక్కులు.

సిక్కులన్నది మతమువలన గలిగిన నామము. సిక్కులనగా శిష్యులు. సిక్కుమతస్థాపకుడు నానకను నతడు. అన్నిమతములు భగవంతునకు సమ్మతమేయనియు ఫలితము మతమునుబట్టిగాక నాచరణమునుబట్టి యుండుననియు నతనినమ్మకము. ఈమతస్థులితరులతో జోక్యము కలుగజేసికొనక లాహోరునందున నాచుట్టుప్రక్కలను నుండిరి. నాలుగవగురువు రామదాసు. ఇతని పాండిత్యమునకును



సుగుణసంపత్తికిని మెచ్చి యక్బరితనికి పంజాబులో భూదానము జేసెను. అతడక్కడనొకసరస్సును దానిచుట్టును పట్టణమును నొకదేవాలయమును నిర్మించెను. ఈచెరువును అమృతసరస్సనియు పట్టణమును అమృతసరమనియు బిలుతురు. ఇతనికుమారుడర్జునుడు నానకుయొక్క యుపదేశముల నొకగ్రంథముగా జేసెను. ఈగ్రంథమును సిక్కులుపూజించుటయేగాక దానిసంరక్షణకొరకు ప్రాణములనయిన నర్పింతురు. కాని మహమ్మదీయులు వీరినట్లుండనీయక బాధపెట్టసాగిరి. కుస్రూప్రితూరీలో పాల్గొనిరన్న హేతువుచే జహంగీరనేకమంది సిక్కులను కొరతవేయించెను. అందుచేవారు లాహోరును వదలి యమునసట్లెజ్ నదులమధ్యనున్న పర్వతప్రదేశములనివాసమేర్పరచుకొనిరి. 1675 లో వారిగురువగు గురుగోవిందుడనునతడు మహమ్మదీయులబాధకాగలేక సిక్కులకు నాయుధముధరించుటయు మతమునకై పోరుటయు విధులుగా నేర్పాటుచేసెను. మహమ్మదీయులు గురుగోవిందుని వానికుటుంబమునుజంపివేసిరి. బందాయనువాని యాజమాన్యముక్రింద సిక్కులుచెలరేగి మహమ్మదీయులజంపి మొగలాయీరాజ్యపు గ్రామముల దోచికొనసాగిరి. ఈబందాకూడ మహమ్మదీయులచే హతుడయ్యెనుగాని వారు సిక్కుల నణగద్రొక్కలేకపోయిరి. సిక్కులు మిసిలులను చిన్నసంఘములక్రిందగూడి పంజాబున నలుప్రక్కలను దోపిడులనుసాగించి మొగలురాజ్యశాంతికి భంగముగలుగజేసిరి. మిసిలున నొకమొనగాడును పదిపన్నెండుగురు యోధులును పదిపన్నెండువందల సామాన్యసైనికులును నుండిరి.

అహమదుషా అబ్దాలీ పంజాబును జయించి కాబూలునకు వెళ్లినంతనే సిక్కులు తమనుంచినపాలకునిజంపి పంజాబునాక్రమించిరి. అహమ్మదుషా పంజాబునకు వచ్చినయెడల సిక్కులు తమపర్వతనివాసములకు బోయిరి. అతడు తిరిగివెళ్ళినవెంటనే దేశమాక్రమించుకొనుచుండిరి. చివరకు పంజాబు సిక్కులవశమయ్యెను. మొగలురాజ్యనాశనమునకు మహారాష్ట్రులు ముఖ్యకారకులైనట్లు పశ్చిమోత్తరమున ఆఫ్ఘనురాజ్యనాశనమునకు వీరు కారకులయిరి. చరిత్రయందు ప్రసిద్ధికెక్కిన రణజిత్తుసింగును, ప్రస్తుతమున్న పటియాలా, జిందు, నాభా, కపర్థల మహారాజులును సిక్కుమిసిలుల నాయకులవంశమువారే.

18-వ శతాబ్దపు హిందూ దేశస్థితి.

మహమ్మదీయరాజ్యమునశించెను. అయోధ్య, హైదరాబాదులుమాత్రమే మహమ్మదీయులవశమైయుండెను. వీటిలోనయినను హిందువులు గొప్పయుద్యోగముల వహించి నవాబులదయకు పాత్రులైయుండిరి. ఈకాలమున సంస్కృతమునను దేశభాషలను పుస్తకములు రచింపబడెను. హిందూశాస్త్రముల గొప్పపండితులుండిరి. తర్కపంచాననుడు హిందూధర్మశాస్త్రమునురచించెను. జయపురపుమహారాజగు జయసింహుడు గణితశాస్త్రమునవిశేషప్రజ్ఞనుసంపాదించెను. జగత్ప్రసిద్ధికెక్కిన అప్పయదీక్షితులు భాష్యమును వ్రాసెను. న్యాయశాస్త్రమునఖ్యాతివహించిన జగదీశతర్కాలంకారుడును గదాధరభట్టాచార్యుడును నీకాలమున నుండిరి. పర్షియనుభాషలో గూడ మంచిపుస్తకములు వ్రాయబడెను. అక్బరునామా,



ఎయినీఅక్బరీ, ఖాఫీఖానుని మొగలుచక్రవర్తులచరిత్రయు నీకాలమున రచింపబడినవి.

కోస్తావర్తకము మహమ్మదీయుల చేతులలోను దేశవర్తకము హిందువులచేతులలోను నుండెను. వర్తకము బాగుగా సాగుటచే దేశపుటైశ్వర్యము వృద్ధిఁబొందెను. హిందువులలో ధనమునకు ప్రసిద్ధికెక్కిన సాహుకారులుండిరి.

రాజ్యపాలనయందు బుద్ధిసూక్ష్మత గనబరిచిన తారాబాయి, అహల్యాబాయి మొదలగు స్త్రీలుండిరి. అహల్యాబాయి కాశీలోను గయలోను సుప్రసిద్ధమయిన దేవాలయముల నిర్మించెను. మతవిషయమునందును, దానమునను ప్రసిద్ధినొందిన రాణీభవాని యీకాలపుదామెయే.

ఘోషా విస్తారమయ్యెను. గృహనిర్మాణమందుగూడ దీని ఫలితము గనిపించుచున్నది. నాలుగింట్లభవంతిపద్ధతి యమలునకు వచ్చెను. దీనిలో స్త్రీలుండుభాగము చిట్టచివరనుండెను. వేషభాషలయందు మహమ్మదీయపద్ధతులను పురుషులవలంబించిరి. ఇది పట్టణములలో మెండుగానుండెను గాని పల్లెలలో లేదనియే చెప్పవచ్చును.



Printed at K. S. Rao's, S. V. V. Press, Vizianagram.

